# చతుర

సంపుటి : 9        ఫిబ్రవరి 1986        సంచిక : 1


## ఈ నెల సమగ్ర నవల

"వాళ్ళు నాకు కావాల్సినవాళ్ళు. తీర్థప్రసాదాలతోసహా వారికి సకల మర్యాదలూ చేయాల్సిన బాధ్యత నాపైన వుంది. ఇంట్లో డ్రింకుపార్టీకి నువ్వుపర్మిషన్ ఇవ్వాల్సిందే" అన్నాడాభర్త.

కోపంతో "వీల్లేదు" అని నిష్కర్షగా చెప్పింది భార్య.

"ఎందుకని?" అన్నాడతను తీక్షణంగా.

"నాకసహ్యం. వాళ్ళు ఎంత పెద్దమనుషులైనా తాగుబోతులు తాగుబోతులే" అంది కఠినంగా.

"నా గురువులు, స్నేహితులకు నచ్చేరీతిలో మర్యాద చేయడం నా ధర్మం. మాటవరసకు నీ అనుమతి కోరాను గానీ, నీ ఇష్టానిష్టాలతో నాకు పనిలేదు. ఇంట్లో వారికి డ్రింక్స్ ఏర్పాటుచేయాల్సిందే" అన్నాడతను భార్యనులక్ష్యపెట్టకుండా.

దానికి ఆమె బదులు ఏమిటి? వైద్యవృత్తిలో ప్రముఖుడిగా వెలిగిపోతున్న అతని జీవిత గమనంలో ఏ...

# చీకటిమలుపులు

ఆవిధంగా భార్యాభర్తల మధ్య కల్లోలాన్ని సృష్టించాయి?

అతని భార్య భయపడినట్టు - అతనిలోని బలహీనతల్ని ఎవరో తమ స్వార్థ ప్రయోజనాలకు వినియోగించుకునే కుట్ర నిజంగా జరిగిందా?

అతన్ని సామాజికంగా, నైతికంగా పతనం చేయడానికి కారణమైన పరిస్థితులేమిటి? వ్యక్తులెవరు?

## ❋ తాళ్ళూరి నాగేశ్వరరావు ❋

లేఖిని ప్రత్యేకమైన కథనంతో చేసిన విభిన్నమైన రచన 'చీకటి మలుపులు' ఈ నెల 'చతుర' సమగ్ర నవల!

ముఖ చిత్రం : జి. కె. నరశింహం

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటె తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షం లోనూ, నవలలు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

## చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# బెణుకుల బాధతో తన గొప్ప రోజు పాడవడం దేనికి?




## నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.

మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి — ఇవే తనకి కావలసినవి. అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే అయొడెక్స్‌లో, గాయపడిన ధాతువులను నయం చేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరి ఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండుసార్లు రెండింతలు గుణకారి.**

నొప్పి తగ్గేవరకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండుసార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువుకైన గాయం.

కనుక మీ ఆప్తులు ఎవరైనా బెణుకులు, కండరాల పట్లు, కీళ్ల పట్లు, ఒళ్లునొప్పులతో బాధ పడటం జరిగితే అయొడెక్స్ మర్దించండి. రోజుకు రెండుసార్లు. తమని రెండింతలు శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్®** — నయం చేసే శక్తి గల నమ్మకమైన బామ్.

**SKOF** — ఎస్‌కేఎఫ్ ఉత్పాదన.

ELL-1509




## శతాధికవృద్ధుడు

జపాన్‌లో 'టొక్కునెషిమా' అనే చిన్న ద్వీపంలోని సుసాన్ గ్రామంలో నివసిస్తున్న 'షికిచి యూ ఇజుమి' అనే 120 ఏళ్ల వృద్ధుడు, అధికకాలంజీవించిన వ్యక్తిగా ఈమధ్య గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో చోటుచేసుకున్నాడు.

షికిచి వయసు నూరేళ్లు పైబడ్డాకే మానవుడు తొలిసారిగా చంద్రమండలంపై పాదం మోపాడు. హిరోషిమాపై అణుబాంబు వేసినప్పుడతనికి 80 ఏళ్లు. రష్యాలో సామాజిక విప్లవం రగిలినప్పుడు షికిచి వయసు 50 ఏళ్లు. ఆ విధంగా ప్రపంచంలో ఏర్పడిన కొన్ని కీలక పరిణామాలకు సాక్షిగావున్న అదృష్టవంతుడతను. ఇప్పటికీ అతను రెండవ ప్రపంచయుద్ధకాలంలో బాంబుల వల్ల జరిగిన భయంకర వినాశనాన్ని గుర్తుచేసుకుని చెప్పగలడు.

షికిచి 1865 జూన్ 29న జన్మించాడు. శ్రమజీవి అయిన అతను పుట్టిన ద్వీపంలోనే ఎక్కువకాలం నివసించాడు. అతని సంతానం ఇద్దరు కొడుకులే! కాని, వారి పిల్లలు, పిల్లలూ కలిసి ఇప్పుడు పెద్దకుటుంబమే అయింది!

ఆరోగ్యంతో, దీర్ఘకాలం జీవించాలనేది షికిచి అభిలాష. అతను తెల్లవారుజామునే లేచి, తన పెంపుడుకుక్క 'షిరో'తో మార్నింగ్‌వాక్‌కి వెళతాడు. చేపలు, అన్నం, మరికొన్ని పచ్చికూరగాయలతో మధ్యాహ్న భోజనంచేస్తాడు. సాయంత్రం కూడా షికారుగా కొంతదూరం నడుస్తాడు. రాత్రి భోజనం దాదాపు మధ్యాహ్న భోజనంలానే వుంటుంది. అయితే రాత్రిపూట టీకి బదులుగా చెరుకురసం నుంచి తయారుచేసిన ఓరకమైన మద్యం తాగుతాడు.

షికిచి రెండేళ్ళక్రితం ధూమపానం మానేశాడు. అతను ఆకలిగా వుంటేనే ఆహారం తీసుకుంటాడు. షికిచి ఇంటికి 100 మీటర్ల దూరంలో అతని విగ్రహాన్ని కట్టించారు. అప్పుడప్పుడూ అతనా విగ్రహం దగ్గరికే వెళ్లి కూర్చుంటాడు.

తనకు జపాన్ మాజీ ప్రధాని బహుమతిగా ఇచ్చిన టెలివిజన్‌లో వివిధ కార్యక్రమాలు, వీడియో ప్రోగ్రాములు చూడటమంటే షికిచికి ఇష్టం. టెలివిజన్‌లో మల్లయుద్ధపోటీల కార్యక్రమం చూడటం

మరీమరీ ఇష్టం.

తీరికగా వున్నప్పుడతను కొంతకాలం కిందట రాసిన తన స్వీయకథ పుస్తకాన్నే చదువుతుంటాడు. దానిలో తను దీర్ఘకాలం జీవించడం వెనుకగల రహస్యాలను గురించి రాశాడు. ప్రకృతిలో కలిసిపోయి బతకడం, స్వచ్ఛమైన గాలి పీల్చడం, ప్రకృతిసిద్ధమైన ఆహారాన్ని మితంగా తీసడం ఆ రహస్యాలలో కొన్ని.



భగవంతుడిని గాఢంగా విశ్వసించే అతను, దైవకృపవల్లనే తాను ఇంత దీర్ఘకాలం జీవించానని తలుస్తాడు. "నేను దేనికీఆందోళనపడను. జీవితాన్ని ఎలాంటి అసంతృప్తిలేకుండా నాకు లభించినట్టుగా స్వీకరిస్తాను. ప్రకృతిలో ఏకమై బతుకు తాను. సూర్యుని వెలుగునుంచి స్ఫూర్తి పొందే నేను సూర్యునితోగల ఈ బంధం విడిపోయినపుడే చనిపోతాను" అని చెబుతాడతను.

జపాన్ ప్రభుత్వం షికిచి ఆరోగ్య సంరక్షణకై ఓ డాక్టర్‌ని నియమించింది కాని అతను ఇంతవరకు ఆ డాక్టరు దగ్గర చికిత్సపొందే అవసరమే రాలేదు.

"షికిచి మంచి ఆరోగ్యవంతుడు. అతని గుండె మాత్రమే కొంచెం బలహీనంగా వుంది. లేకుంటే అతను 50 ఏళ్ళ వ్యక్తి అంత దృఢంగా వుండవలసిన వాడే. అతని చర్మం ఇంకా ఆరోగ్యంతో మెరుస్తుండటం ఆశ్చర్యకరమైన విషయమే!'' అంటాడా డాక్టరు.

4 అడుగుల 8 అంగుళాల ఎత్తుండే షికిచి 84 పౌనుల బరువుంటాడు. అతనిపై ఎన్నో టెలివిజన్ సినిమాలు వచ్చాయి.

షికిచి చివరికి 'టూరిస్ట్ ఎట్రాక్షన్' కూడా అయ్యాడు. ప్రతిరోజూ దాదాపు 200 మంది పర్యాటకులు అతన్ని చూసేందుకు వస్తారు. కొందరు బహుమతులు, డబ్బు కూడా ఇస్తారు. అక్కడి మునిసిపాలిటీ షికిచికి వృద్ధాప్యపు పెన్షను ఇస్తోంది. జపాన్ ప్రభుత్వ లెక్కల ప్రకారం వందేళ్ళు దాటిన జపానీయులు 1563 మంది వున్నారు. వారందరిలో పెద్దా వృద్ధుడు షికిచియే!



చతుర ... 7

# ఇసుక స్నానం

ఆవిరి స్నానం, ఐస్ బాత్, మడ్‌బాత్, సన్‌బాత్ అంటూ పాశ్చాత్యులు అనేక రకాలుగా వళ్లు శుభ్రపరచుకుంటారు. ఇప్పుడు వాటి కోవలో చేరిన శాండ్ బాత్ అనే ఇసుకతో చేసే స్నానం జపాన్ ప్రజల్ని పిచ్చిగా ఆకర్షిస్తోంది. ఆ స్నానం మంచి ఆరోగ్యాన్నిచ్చి, యవ్వనం జారిపోకుండా కాపాడుతుందట.




టోక్యోలోని అనేక హోటళ్లు, హెల్తు క్లబ్బులలో శాండ్‌బాత్ చేసేందుకు ఇసుకతో ప్రత్యేకమైన పడకలను రూపొందించారు. ఆ స్నానం చేసేవారు లోపలి దుస్తులు తప్ప మిగిలిన బట్టలన్నీ విప్పేసి, తలకు తువ్వాలు చుట్టుకుంటారు. తర్వాత వారిని ఇసుకలో తల మటుకూ బైటకు వుండేలా పూడ్చేస్తారు. ఆవిధంగా వాళ్ళు ఆ ఇసుక పడకలో కనీసం అరగంటసేపు నిద్రపోవాలి. అటుపైని ఇసుకను తొలగించడంతో స్నానం ముగుస్తుంది.

ఈ శాండ్‌బాత్ శరీరానికి 60 డిగ్రీల టెంపరేచర్ కల్పిస్తుంది. కాని స్నానం చేసేవారికి ఆసంగతి తెలియదు. వారికి ఎవరో తమ శరీరానికి మర్దన చేస్తున్న అనుభూతి కలుగుతుంది.

జపాన్‌లో దీనితోపాటు మరో వింత రకపు స్నానంకూడా ఈమధ్య జనాదరణ పొందుతోంది. అది కాఫీ గింజల స్నానం. దానిలో ఇసుకకు బదులు కాఫీ గింజలతో మనిషిని పూడుస్తారు. శాండ్ బాత్‌వల్ల కలిగే మేలు ఈ స్నానం ద్వారా కూడా కలుగుతుంది. ఈ రెండు రకాల స్నానపు పద్ధతుల్ని టోక్యోకి చెందిన డాక్టర్ హైరోమిచి మత్సుచి కనుగొన్నాడు.

ప్రస్తుతం జపాన్‌లో వందకుపైగా నగరాలలో ఈ రెండు కొత్త రకాల స్నానాలు చేస్తున్నారు. ఈ స్నానం జరిగే ప్రదేశాలు పురుషులకీ, స్త్రీలకీ విడిగా వున్నాయి. ఈ స్నానాల ద్వారా కొత్త శక్తిని పొందడమేకాక, శరీరంలో అధికంగా వుండే కొవ్వును కోల్పోవచ్చు.

76 ఏళ్ళ సోమియా సుయారీ క్రమం తప్పకుండా ఇసుక, కాఫీ గింజల




# గెలుపొందే పిల్లల తల్లులు
# మాల్టోవా తల్లులు!



తెలివైన తల్లులు మాల్టోవా
తల్లులు. ఒక్కొక్క చెంచా
మాల్టోవాలోనూ బంగారమంటి
గోధుమలు. ముత్యాలవంటి
బార్లీ,
శుద్ధమైన పాలు,
కమ్మని కోకో,
శక్తినిచ్చే
చక్కెరల మంచితనం నిండుగా
ఉన్నదని తెలిసిన తల్లులు. ఒక
కప్పు పాలల్లో కలిపితే సరి,
మనసులు గెలిచే గొప్ప
పానీయమై పోతుంది మాల్టోవా.
ఏ మాల్టోవా తల్లినైనా అడగండి
చెబుతుంది.




కొత్త
**మాల్టోవా®**

"ఆరోగ్యం, బలం మరియు శక్తి యొక్క విజయప్రద సంగమం"

FSA/JIL/3/85 TEL

స్నానాలు చేస్తుంది. "నాకు ఇదివరకు వంట్లో ఎక్కడ చూసినా కీళ్ళనొప్పులే! ఎలాంటి చికిత్సా నొప్పుల్ని నయం చేయలేకపోయింది. అప్పుడు కొందరు శాండ్‌బాత్ ద్వారా నయంచేసుకోమని సలహా ఇచ్చారు. నేను అది ఆచరించి పూర్తి స్వస్థత పొందగలిగాను" అని చెబుతుందావిడ.

శాండ్ బాత్, కాఫీ బాత్‌లతోపాటు టర్కిష్ బాత్ కూడా జపాన్‌లో చాలా ప్రసిద్ధి చెందిన స్నానం!

## రచనకు ముడిసరుకు

'మన రచయిత్రులు రచనా వ్యాసంగాన్ని కుటీరపరిశ్రమగా చేశా'రని జోక్ చేసేవాళ్లు ఏమంటారోగానీ, అమెరికాలో రచనా వ్యాసంగం భారీపరిశ్రమగా వర్ధిల్లుతోంది. ఈ కాలంలో రచయిత తన పరిధిలో,తనఅనుభవాలనుంచి'బెస్ట్‌సెల్లర్' రచనను సృష్టించడమనేది కుదరనిపని. ఎయిర్‌పోర్ట్, హోటల్ లాంటి నవలలు రాయాలంటే సమాచార సేకరణకి ఇతరుల సహాయంపై ఆధారపడాల్సిందే! అమెరికాలో రచయితలకు అలా సహాయపడేందుకు 400 సంస్థలున్నాయి.

అక్కడ రచయితలకు తన రచనల నేపథ్యానికవసరమైన సమాచారాన్ని అందించే సంస్థల చిరునామాలు "ది వర్కింగ్ ఆఫ్ ది నేషన్" నాల్గవ సంపుటంలో దొరుకుతాయి. న్యూయార్క్‌లో 'ఎ.పి. న్యూస్ ఫీచర్స్', శాన్‌ఫ్రాన్సిస్కోలో 'క్రోమైల్ ఫీచర్స్' రచయితలకు సాయపడే సంస్థలుగా ప్రసిద్ధికెక్కాయి. 'కొలంబియా ఫీచర్స్' సంస్థ ప్రత్యేకంగా యువజనం, స్త్రీలకూ సంబంధించిన సమాచారాన్ని మాత్రమే అందజేస్తుంది. 'ది ఆర్టిస్ట్స్ అండ్ రైటర్స్ సిండికేట్', 'వాషింగ్‌టన్ పోస్ట్ రైటర్స్ గ్రూప్' సంస్థలు పేరుపొందిన, అనుభవజ్ఞులైన రచయితల సలహాలు, సూచనలను వర్ధమాన రచయితలకు అందేట్టు చేస్తాయి.

సముద్ర గర్భంలో అన్వేషణ జరిపే వారిపై నవల రాయాలనుకున్న రచయితకి అలాంటి వాతావరణంలో ప్రత్యక్షానుభవం వుండకపోయినంత మాత్రాన నిరుత్సాహపడనక్కరలేదు. ఇప్పటి నవలా రచనలో జీవితపు మెలోడ్రామా కంటే వివిధ విశేషాలను పాఠకుల మనసులు చూరగొనేలా చెప్పగల కళకు



# మా నలువురం ఒక అన్యోన్య కుటుంబం

మా కుటుంబానికి మొదటి చేరిక మా పెళ్లయిన రెణ్ణెల్లకే వచ్చింది. అదే, మిలమిలా మెరిసిపోయే కొత్త గోద్రెజ్. ఆ తర్వాత కొన్నేళ్లకి దీపక్ పుట్టాడు. వాడికిప్పుడు 12 ఏళ్లు. ఈ మా నలుగురం కలిసి మెలిసి ఎంత సరదాగా కాలం గడుపుతూ వస్తున్నామో!

గోద్రెజ్‌ని మా కుటుంబ సభ్యులలో ఒకరిగా మేము చూస్తున్నామంటే దీని మీద మాకంత విశ్వాసమన్నమాట.



అగ్రగామి అయిన ఈ రిఫ్రిజిరేటర్ కలకాలం నిలిచే విలువల ఆధారంతో తయారైనది. ఒక తరం నుంచి మరొక తరం దాకా నిలిచి పనిచేయగలది. అందుకే, గోద్రెజ్‌ను మా యింటికి తెచ్చుకున్నప్పుడే మాకు తెలుసు, ఇది బహుకాలం సాగే అనుబంధమని!

**బహుకాలం మీకు విశ్వాసపాత్రం**

**Godrej® రిఫ్రిజిరేటర్**

మేలైన శాస్త్ర పద్ధతిలో ఉత్పత్తులు
కలకాలం నిలిచే విలువలు

గిరాకీ పెరిగింది. ఆవిధంగా నవలలు రాసినవారిలో ఆర్థర్ హెయిలీ, జాక్వెలిన్ సుసాన్, కేథలిన్ విన్‌సార్‌లు సుప్రసిద్ధులు. అమెరికాలో సముద్రగర్భాన్వేషకులపై నవల రాయదలచుకున్న రచయిత, ఆ విషయ సేకరణచేసి అందించే సిండికేట్‌ని సంప్రదిస్తాడు. వాళ్లు ఆ రచయితతో ఓ ఒప్పందానికొచ్చాక అతనికవసరమైన సమాచారమంతటినీ అందిస్తారు. ఆ విధంగా రచయిత 'డైవర్స్' సముద్రపు లోతులకి ఎలా వెళతారో, వారికి నీటిలో వివిధ లోతుల్లో ఎదురయ్యే దృశ్యాలు, సముద్రంలో వారి సాహస కృత్యాలు, సముద్ర ప్రాణులు, అక్కడ లభించే పగడాలు, ముత్యాలు, సముద్ర లోతుల్లోని రంగులు,ధ్వనులు, వాసనలు— అన్నీ పాఠకుల కళ్లకుకట్టేలా వర్ణిస్తాడు. అవసరమైతే రచయితకు డైవర్లతో పరిచయం కల్పించడం లేదా వాళ్లు సముద్రంలో దిగినప్పుడు తీసిన వీడియో కేసెట్లని అందించడంకూడా సిండికేట్ చేస్తుంది. వీడియో దృశ్యాలను చూసి సంతృప్తిచెందనివాళ్లకి, స్వయంగా సముద్రంలోకి దిగే ఏర్పాట్లుచేస్తుంది.

## మినీవస్తు ప్రపంచం

నేడు అతిచిన్న వస్తువుల వుత్పత్తి ఎక్కువవడంతోపాటు, వాటికి గిరాకీ కూడా అధికంగానే వుంటోంది! ఆవిధంగా ప్రస్తుతం అరిచేతిలో పట్టేంత టేప్‌రికార్డర్లు, టెలివిజన్లు, రేడియోలు ఉత్పత్తి అవుతున్నాయి. ఇంగ్లండులోని మైక్రోఫిల్మ్ టెక్నీషియన్లు అంగుళంలో 16వ వంతు పరిమాణంలో బైబిలును రూపొందించారు. ఆ బైబిల్‌ని మైక్రోస్కోప్‌ద్వారా చూస్తేనే చదవగలరు.

అమెరికాలోని ఒక రేడియో తయారీ సంస్థ ప్రపంచంలోనే అతిచిన్నదైన రేడియోను తయారుచేసింది. అది అగ్గిపెట్టెకంటే చిన్నగా వుంటుంది. జపాన్ ప్రపంచంలో కెల్లా అతిచిన్న కెమేరాను తయారుచేసింది. 1.14 అంగుళాల పొడవు, 0.65 అంగుళాల మందంగల ఆ కెమేరా 53గ్రాముల బరువే వుంటుంది. గుండె ఆపరేషన్లు జరిపేటప్పుడూ, గూఢచారి కార్యకలాపాలకూ వుపయోగించేందుకు అత్యంతఆధునికంగా వుండేమరింత చిన్న కెమేరాలను వుత్పత్తి చేస్తున్నారు.

ఓ బ్రిటీషు ఎలక్ట్రానిక్ కంపెనీ ప్రపంచంలోనేఅతిచిన్నదైన టెలివిజన్‌ను తయారుచేసింది. తెర 2 అంగుళాలు, పొడవు 6, వెడల్పు 4, మందం 2 అంగుళాలూ వుండే దాని బరువు 28 అవున్సులు మాత్రమే!

రష్యన్లు సొంత వాహనంలావుపయోగించుకునే చిన్న హెలికాప్టర్‌ను రూపొందించారు. డజను భాగాలు మాత్రమేవుండే ఆ హెలికాప్టర్‌ను విడదీసి కాన్వాసు సంచిలోపెట్టి మోసుకుపోవచ్చు. తిరిగి దాన్ని హెలికాప్టర్‌గా బిగించడం నిముషాలమీద పని! దానిలో ఇంధనం నిండుగా వున్నపుడు ఏకబిగిన 50 మైళ్లు ఎగరవచ్చు. దాని అత్యధిక వేగం గంటకు 25 కిలోమీటర్లు!

ఇంగ్లండ్‌లోని ఛెషైర్‌కి చెందిన డాక్టర్ పోలార్డ్ అరచేతి పరిమాణంలో వుండే ఫిడేలును రూపొందించాడు. 5 అంగుళాలు మాత్రమేవున్నా దానినుంచి మామూలు పరిమాణంలో వుండే ఫిడేలు సంగీతమే వస్తుంది. *





చీకటి మలుపు
తాళ్లూరి నాగేశ్వరరావు

'భర్త రాకకోసం ఎదురుచూడటంలోనే కొంతమంది స్త్రీల జీవితాలు విపరీతం చేసుకుంటాయి' అనుకుంది ప్రియంవద ఆరోజు రాత్రి గోడమీది ఎలక్ట్రానిక్ వాల్‌క్లాక్ పన్నెండుసార్లు మూలిగ్గా.

సోఫాలో కూర్చుంది ప్రియంవద.

పక్కనే స్టాండింగ్ టేబుల్ లైట్ సాంద్రంగా వెలుగుతోంది. ఆ లైట్ కాంతి ఆమె ఒళ్లో ఎక్కువగా పడుతోంది. ఆ ఒళ్లో డెనిస్ రాబిన్స్ నవల పేజీలు తెరచివుంది. భర్త రాకకోసం తీవ్రంగా ఎదురుచూస్తూనే మధ్య మధ్య ఆలోచిస్తూనే నలభై రెండు పేజీలదాకా చదివింది. భర్త రాకకోసం ఆవిధంగా ప్రతి రాత్రీ ఎదురుచూస్తూ తెలుగు, ఇంగ్లీషు నవలలు ఆమె ఎన్నో చదివింది.

నలభైఎనిమిది అడుగుల పొడవూ, ఇరవైనాలుగు అడుగుల వెడల్పూగల ఆ పెద్ద డ్రాయింగ్‌రూమ్‌లో చీకటిని పారనీయకుండా ఆ లైటు కాంతి కాపలా కాస్తోంది. ఈశాన్య మూలనున్న అక్వేరియమ్‌లోని రకరకాలచేపలు కునుకు తీస్తూ, అప్పుడప్పుడూ తమ ఉనికిని తెలియజేయడానికన్నట్టు బద్ధకంగా కదలాడుతున్నాయి.

రేడియో, టి. వి., వి.సి.ఆర్, హాలు మూలలో మెరిసే ఇత్తడి కుండీల్లోవున్న ఇండోర్ మొక్కలు, విండోల పారిస్ కర్టెన్ గుడ్డలు వెలుగూ చీకటి ఛాయల్లో, నిశ్శబ్దంగా ఇంటి యజమానురాల్ని వీక్షిస్తున్నాయి. నేలమీదున్న ఖరీదైన పర్టికలర్ కాశ్మీర్ కార్పెట్ మెత్తగా నిద్రకొరిగింది.

ఆమె కూర్చున్న సోఫా పక్కనే పడుకున్న పెంపుడుకుక్క పామేరియన్ 'పాపని' అప్పుడప్పుడూ తలెత్తి అమ్మగారికేసి జాలిగా, సానుభూతిగా చూస్తోంది 'భారతదేశంలో భర్తను దైవంగా భావించే భార్యలపాట్లు ఇట్లాంటివే' అన్నట్టు.

వైట్ బ్యాగ్రౌండ్‌మీద సన్నజాజి మొగ్గల ప్రింటెడ్ కాటన్ చీర ధరించింది ఆమె. టువైటు లైట్ లోనెక్ జాకెట్ వేసుకుంది. భోజనానికిముందు రాత్రిపూట స్నానం చేయగానే ఆమె వైట్ నైలెక్స్ గానీ, కోటాగానీ, వెంకటగిరిగానీ, వైట్ బ్యాగ్రౌండ్ వున్న ప్రింటెడ్ కాటన్ చీరగానీ ధరిస్తుంది. అట్లాంటి చీరలంటే డాక్టర్ మల్లికార్జున్‌కు ఎంతో ఇష్టం. అతని ఇష్టప్రకారమే ఆమె ఆ చీరల్ని ధరిస్తుంది. అయితే ఆయన ఇంటికి ఏవేళప్పుడు వస్తాడో, ఏ స్థితిలో వస్తాడో వూహించడం కష్టం. ఒక్కొక్కప్పుడు డ్రాయింగ్ హాల్లోనే సోఫాలో ఏటవాలుగా పడుకుంటాడు బూట్లు విప్పకుండానే. మెట్లు ఎక్కగలిగినప్పుడు డ్రెస్సు మార్చకుండానే బెడ్‌పై చొప్పకట్టెలాగా వాలిపోతాడు. తాను ఎంత అందంగా, అప్పుడే విరిసిన మల్లెపువ్వులా, ఫారిన్ కాస్మెటిక్స్‌తో, పెర్‌ఫ్యూమ్స్‌తో ఆకర్షణీయంగా తయారైతే మాత్రం ప్రయోజనమేముంది? అడవిగాచిన వెన్నెలే. బెడ్‌మీద వాలిన మరుక్షణమే ఒళ్లుమర్చి నిద్రపోతాడు. అదంతా విస్కీ మహత్యం.

అసలు మనుషులు ఎందుకు మత్తు పానీయాలు తాగుతారో! వాటికి ఎందుకు బానిసలుగా తయారవుతారో! ఏదైనా మానసికవ్యథ వుంటేనో, ఆర్థిక ఇబ్బందులుంటేనో, ప్రేమలో విఫలమైతేనో, వ్యాపారంలో నష్టాలు నీడలా వెంటబడుతూంటేనో, దుఃఖాన్ని మర్చిపోవడానికో— ఆకస్మిక ఆనందాన్ని తట్టుకోవడానికో




ఏదో ఒక బలమైన కారణముండాలి. తనకు తెలిసినంతవరకూ ఆ కారణాలేవీ ఆయనకు లేవు. ఫ్రెండ్స్ కోసమో, తాగడంలోని మజా కోసమో, అలవాటుగానో ఆయన తాగుతూ వుండాలి. ఆతాగుడు మానితే, కనీసం కంట్రోల్‌లో పెట్టుకుంటే ఆయన ఎంతో ప్రయోజకుడవుతాడు. ప్రజలకు ఎంతో సమర్థంగా వైద్య సేవలు చేస్తాడు. సమాజంలో ఎంతో మంచి పేరు తెచ్చుకుంటాడు. కుటుంబంలో సుఖశాంతులు కుదుట బడతాయి. కాని...

ఆ తాగుడు వ్యసనాన్ని ఆయన విడిచిపెట్టలేదు. ఆ సైతాన్ ఆయన్ను వదిలిపెట్టి వెళ్ళినప్పుడే తనకీ, ఈ ఇంటికి విముక్తి...ఆ మంచిరోజు ఎప్పుడొస్తుందో? అసలు వస్తుందా తాను బతికివున్న కాలంలో!

బయట బజర్ మోగింది.

దిగ్గున లేచింది ప్రియంవద-ఆయన వచ్చారనుకుంటూ.

ఆమె ఒళ్ళో పుస్తకం జారి కిందబడింది.

ప్రియంవద గబగబా కారిడార్‌లోంచి బయటకు వెళ్ళింది-తలుపు తెరవడానికి. భర్త మళ్ళీ బజర్ నొక్కకముందే తలుపు తీయడం ఆమెకు అలవాటు ఎంత అపరాత్రి అయినప్పటికీ. ఆయనకు కోపం వస్తుందేమోనని ఆమెకు భయం. ఒకసారి తెల్లవారిఝామున మూడున్నరకు బజర్ మోగింది. సోఫాలో మేనువాల్చి నిద్రపోతూన్న ప్రియంవద గాబరాగాలేచి, పరుగెత్తబోయి గ్లాస్ టీపాయ్ మోకాలికి తగిలి కింద కూలబడింది. నడుం పట్టేసింది. నరానికి దెబ్బ తగలడంతో ప్రాణం జిల్లుమంది. ఆ నడుం నొప్పి నయం కావడానికి నెలరోజులు పట్టింది. ఆమె భర్తతో చెప్పలేదు. భర్త మందు ఇవ్వనూలేదు. పనిమనిషి ఆడెమ్మతో రెండు పూటలూ 'రిలాక్సిన్' రాయించుకుంది. అప్పట్నుంచీ ఎంతటి దిగ్భ్రాంతిలోనూ జాగ్రత్తపడుతోంది.

తలుపు తెరవగానే తుఫాను గాలిలాగా లోపలికొచ్చాడు డాక్టర్ మల్లికార్జున్. కోటు భుజాన వుంది. చేతిలో త్రీ ఫైవ్స్ పాకెట్టు, అగ్గిపెట్టె వున్నాయి. వుంగరాల జుత్తు కాస్త రేగివుంది. కళ్ళు ఎంత ఎర్రగా వున్నాయో స్పష్టంగా తెలియడం లేదు-లైటు కాంతి లేకపోవడాన.

"ఇప్పటిదాకా మేలుకొనే వున్నావా ప్రియా!" అన్నాడు మల్లికార్జున్ లోపలకు వస్తూ. ఆమాటల్లోని తడబాటును బట్టి ఆయన ఏ మోతాదులో మందు సేవించిందీ ఆమె గ్రహించింది.

మాట్లాడకుండా బయటి తలుపు బోల్టు వేసింది.

ఆమె డ్రాయింగ్ హాల్లోకి వచ్చేటప్పటికి సోఫాలో అడ్డంగా పడివున్నాడు మల్లికార్జున్.

వాల్‌క్లాక్ చూసింది ప్రియంవద.

పన్నెండూ నలభై.

ఒక విధంగా ఆయన పెందలాడే ఇంటికొచ్చినట్టు లెక్క.

"భోంచేశారా?" అని ఆమె పత్నీధర్మంగా అడగలేదు. సాధారణంగా రాత్రుళ్లు ఆయన ఇంట్లో భోజనం చేయడు. ఎప్పుడైనా చేసేట్టయితే ముందుగానే చెబుతాడు — "రాత్రికి ఇంట్లోనే భోంచేస్తాను" అని.

ఎనిమిదీ ఎనిమిదిన్నరకు నర్సింగ్ హోమ్‌నుంచి క్లబ్‌కు వెళతాడు. లేదా ఫ్రెండ్స్‌తో ఎక్కడికైనా మందు పార్టీకి

వెళతాడు. సూర్యోదయం లోపల ఎప్పుడైనా ఇంటికొస్తాడు. దాదాపు రోజూ క్లబ్‌లో పేకాట ఆడతాడు. ఆ పేకాటలో ఎంత సంపాయిస్తాడో, ఎంత పోగొట్టుకుంటాడో ఆమెకు తెలియదు. ఆ మాటకొస్తే ఆయనకే తెలియదు. ఒక్కోరోజు కోటు జేబులో వందరూపాయల కట్టలు వుంటాయి. మరింకోరోజు అయిదూ పది రూపాయల నోట్లు మాత్రమే వుంటాయి.

డబ్బు విషయంలో ఆయన చాలా లిబరల్. ఎవరైనా చేబదులు అడిగితే జేబులో ఎంత డబ్బు వుంటే అంతా ఇచ్చేస్తాడు. అవతలవ్యక్తి గుర్తుపెట్టుకొని తిరిగి ఇస్తేనేగాని, నోరు తెర్చి అడగడు. రోగుల దగ్గర ఫీజు వసూలు చేయడంలో కూడా అపారమైన ఉదారత్వాన్ని కనబరుస్తాడు. "బాబుగారూ! నేను పేదోణ్ని. ఈ పది రూపాయలకంటే ఇచ్చుకోలేను" అని పేద అరుపులు అరిస్తే, అంతే పుచ్చుకుంటాడు. ఆయనలోని ఆ బలహీనతను గుర్తెరిగి చాలా మంది ఉన్నవాళ్లుకూడా ఆయన వైద్యానికి తక్కువగానే ఖరీదుకట్టి ఫీజులు ముట్టజెప్పి దణ్ణాలు పెడతారు. ఆ ప్రియంవద నర్సింగ్‌హోమ్‌ను కొంత మంది ధర్మాసుపత్రిగా భావిస్తారు. పేకాట, తాగుడు, రేసులు - మొదలైన వ్యసనాలు గలవాళ్ల డబ్బు విషయంలో ఎక్కువ వుదారంగా వుండటం స్వాభావిక లక్షణమేమో!

సోఫాలో అడ్డంగా పడుకున్న మల్లికార్జున్ రెండు నిమిషాల్లోనే గురక పెట్టసాగాడు గాఢ నిద్రతో.

'మగవాళ్ళు ఎంత త్వరగా, సునాయాసంగా నిద్రపోగలుగుతారో' అనుకుంది ప్రియంవద-సోఫా పక్కన కూచ్చుని భర్త కాళ్ళ బూట్లను మెల్లగా విప్పుతూ.

కాళ్ళ సాక్సును కూడా తీసివేసింది.

తలకింద పిల్లోను పెట్టింది.

పక్కకు ఒత్తిగిల్లి పడుకున్నాడు మల్లికార్జున్. అయితే తప్పతాగి ఒళ్ళు మర్చి నిద్రపోతున్న అతను భార్య ఉపచర్యల్ని ఏమాత్రం గమనించలేదు.

ఆ తర్వాత ప్రియంవద సోఫా పక్కనే కాశ్మీరీ కార్పెట్‌పై మేను వాల్చింది. భర్త హాల్లో డ్రాయింగ్ రూమ్‌లో పడుకుంటే తానొక్కతే పైన బెడ్‌రూమ్‌లో ఎట్లా పడుకోగలదు?

ఆమె తలకింద దిండైనా లేదు. దూరంగా వున్న మరో సోఫాసెట్‌పై సంప్రదటి మెసిపిల్లో వుంది. దాన్ని తెచ్చుకోవడానికి బద్ధకమనిపించి అట్లాగే పడుకుంది.

అర్ధరాత్రి దాటిన వాతావరణం అతి నిశ్శబ్దంగా వుంది.

అప్పుడప్పుడు దూరంగా కుక్కల అరుపులు, కార్ల హారన్‌లు వినబడుతున్నాయి. గూర్ఖా వచ్చి రోడ్డుమీద లాఠీ కర్రతో చప్పుడు చేసి వెళ్లాడు. మళ్లీ తెల్లవారుఝామున నాలుగు గంటలకి మరోసారి వచ్చి తన డ్యూటీలోని అప్రమత్తతను గుర్తుచేసి వెళతాడు.

ప్రియంవదకు ఏమాత్రం నిద్రరావడం లేదు. ఆమె పక్కనే 'పామని' కడుపులో కాళ్లు పెట్టుకుని పడుకొనివుంది. దానికీ నిద్రవస్తున్నట్టులేదు. అప్పుడప్పుడూ తలెత్తి యజమానురాలికేసి చూస్తోంది. అంతలోనే మళ్లీ కళ్లు మూసుకొని పడుకుంటోంది.

తనకి ఎప్పుడు నిద్రపడుతుందో ఏమో! ఒకసారి పిల్లల బెడ్‌రూమ్‌లోకి

వెళ్లి చూసొద్దామని లేచింది ప్రియంవద. ఆ డ్రాయింగ్ హాలు పక్కనే వుంది పిల్లల బెడ్‌రూమ్. ఆమె ఆ గదిలోకి వెళ్లగానే 'పావని' కూడా చివుక్కున లేచి ఆమెతో పాటు ఆ గదిలోకి వచ్చింది.

బ్లూ కలర్ బెడ్‌లైట్ కాంతిలో డబుల్ బెడ్‌పైన అమ్మాయి సంధ్య, అబ్బాయి కిరణ్ ఈ ప్రపంచంతో నిమిత్తంలేనట్టు గాఢంగా నిద్రబోతున్నారు. ఒకళ్లపై మరొకళ్లు కాళ్లు వేసుకోగా, నెమ్మదిగా ఆ కాళ్లను సరిచేసి, తొలగిన బ్లాంకెట్‌ను వాళ్లపై సరిగ్గా కప్పింది. 'భగవంతుడు మానవ జన్మకిచ్చిన మహత్తరమైన వరమే నిశ్చింతగా నిద్రపోవడం' అనుకుంటూ మళ్లీ డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చింది. ఆమెతోపాటు 'పావని' కూడా వచ్చింది.

మళ్లీ కార్పెట్‌పై భర్త పడుకున్న సోఫా పక్కనే మేను వాల్చింది ప్రియంవద.

నిద్రపోవటానికి ప్రయత్నించింది. కాని కనురెప్పలు వాలలేదు. భూత భవిష్యత్ వర్తమానాల ఆలోచనలు మనస్సులో వలయాల్లా తిరగసాగాయి...

## 2



తనని మెడిసిన్ చదివించాలని నాన్నకు చిన్నప్పట్నుంచీ వుంది. అసలు అన్నయ్యను చదివించడానికి ప్రయత్నించాడు. కాని అన్నయ్య ససేమిరా చదవనన్నాడు.

"నా మాట వినవట్రా?" కోప్పడ్డాడు నాన్న.

"వింటాను. ఏ విషయంలో తండ్రి మాట వినాలో, ఏ విషయంలో ఆత్మ ప్రబోధం ప్రకారం నడుచుకోవాలో నాకు బాగా తెలుసు. ఆ విచక్షణాజ్ఞానం కొడుక్కి వచ్చాక తండ్రి తన భావాల్ని మొండిగా రుద్దడం వల్ల లాభంలేదు. నాకు మేథమెటిక్స్‌మీద మొదట్నుంచీ ఇంటరెస్టు వుంది. మేథమెటిక్స్ లేనిదే ప్రపంచంలో ఏసబ్జక్టూ అభివృద్ధికాదని నమ్మే వాళ్లల్లో నేనొకణ్ణి. నిత్యజీవితంలోకూడా మేథమెటిక్స్ పరిజ్ఞానం ఎంతో ఉపయోగపడుతుంది. అందుచేత నేను యం.పి.సి. గ్రూపు తీసుకుంటాను. ఇంజనీరింగ్ చదువుతాను" అన్నాడు అన్నయ్య నిష్కర్షగా.

"అది కాదురా! మన వంశంలో మెడిసిన్ చదివినవాళ్లు ఎవ్వరూలేరు. అది మంచి ప్రొఫెషన్‌రా!" అన్నాడు నాన్న.

"కావచ్చు. డాక్టరై విదేశాలుపోయో, సొంతంగా ప్రాక్టీసు పెట్టుకొనో రెండు చేతులా బోలెడు డబ్బు సంపాయించవచ్చు. కాని నా జీవితలక్ష్యం అదికాదు. మనుషుల ఆరోగ్యాలపై వ్యాపారం చేయడం నాకిష్టంలేదు" అన్నాడు అన్నయ్య కుండబద్దలు కొట్టినట్టుగా.

ఈరోజుల్లో పిల్లల అభీష్టాలకు వ్యతిరేకంగా, బలవంతాన తమకు నచ్చిన కోర్సుల్ని తల్లిదండ్రులు చదివిస్తూ పిల్లల చదువుల్ని పాడుచేస్తున్నారు. అందుకేనేమో నాన్న అంతగా పట్టుపట్టలేదు. అన్నయ్య యం.పి.సి.లో చేరి ఫస్టు క్లాసులో పాసై,ఆపైన బి.టెక్, యం.టెక్ చదివి, కలకత్తాలో యం.బి.ఎ. చేసి పెద్ద ఉద్యోగం సంపాయించాడు. పెళ్లాం




పిల్లలతో బెంగుళూరులో సుఖంగా, ప్రశాంతంగా వుంటున్నాడు.

అన్నయ్య మెడిసిన్ చదవకపోవడంతో నాన్న దృష్టి తనపై కేంద్రీకృతమైంది. తనని ఇంటర్‌లో బై.పి.సి.లో చేర్పించాడు. తనకి ఆ గ్రూపు ఏమాత్రం ఇష్టంలేదు. కాని నాన్న మాటకు ఎదురు చెప్పడమెలా? అందులో ఆడవాళ్లు ఎదురు చెబితే ఆయనకు విపరీతమైన కోపం వస్తుంది. ఇంటివ్యవహారాల్లో, బయటి వ్యవహారాల్లో ఆడవాళ్లు ఏ మాత్రం నోరెత్తకూడదనేది ఆయన సిద్ధాంతం. అమ్మ ఆయన మాటకు ఎదురుచెప్పడం తానెప్పుడూ చూడలేదు. అసలు అమ్మతో ఏ విషయాన్నీ నాన్న చర్చించేవాడుకాదు తను నోరెత్తకుండా మేరీస్టెల్లాలో బై.పి.సి. గ్రూపులో ఇంటర్‌లో చేరాల్సి వచ్చింది. ట్యూషన్‌కు కూడా నాన్న ఏర్పాట్లు చేశాడు. ప్రాక్టికల్సు మొదటి క్లాసులో తోటి విద్యార్థినులు కప్పను డిసెక్ట్‌చేయడం చూసి మూర్ఛబోయింది. మొహాన ఇన్ని చన్నీళ్లుచల్లి, లేబ్‌లో పావుగంట పడుకోబెట్టాక స్పృహవచ్చింది. జూఆలజీలెక్చరర్ శ్యామసుందరి అమ్మకు దూరపు బంధువు. ఆరోజు సాయంత్రం ఆవిడ ఇంటికొచ్చి అమ్మతోనూ, నాన్నతోనూ జరిగిన సంఘటనను గోరంతలు కొండంతలుగా చెప్పి, "మీ అమ్మాయిని ఆ గ్రూపునుంచి వెంటనే మార్పించండి. కప్పలూ, ఎలుకలూ, వానపాములూ, బొద్దింకలూ- ఇట్లాంటివాటిని ఏ భాగానికి ఆభాగంకోసి, స్టడీచేయాల్సి వుంటుంది. ప్రాక్టికల్స్‌లో ఆ నెత్తురు చూసి మీ అమ్మాయి మూర్ఛబోవడం మొదలెడితే, కొన్నాళ్ళకు సైకలాజికల్‌గా మతి భ్రమించి మూర్ఛలరోగం రావచ్చు" అందావిడ. దాంతో అమ్మ నెత్తీనోరూ బాదుకుంది. నాన్న మెత్తబడ్డాడు. గ్రూపు మారతానని కుండలో మొహందూర్చి చెప్పినట్టు మెల్లగా చెప్పింది తను. 'సరే' అన్నాడు నాన్న. ఆమర్నాడే ఆర్ట్సు గ్రూపులోకి మారడం జరిగింది.

ఇంటర్‌లో జనతా క్లాసులో పాసైంది తను. నాన్న ఏమీ అనలేదు. అసలు తనకు సబ్జక్టుపై అంత ఆసక్తి వుండేదికాదు. పాఠంచెప్పే లెక్చరర్‌కేసి కళ్లు అప్పగించి చూస్తూవుండేది. మనస్సు మాత్రం పలు ఆలోచనలతో ఎక్కడో వుండేది. పరీక్షలకు మొక్కుబడిగా చదివేది. క్లాసులో మంచిమార్కులు తెచ్చుకుందామనీ, ఫస్టు వద్దామనీ అసలు వుండేదికాదు. ఆ పట్టుదలతో ఎప్పుడూ క్లాసుపుస్తకాలు చదవలేదు.

బి.ఏ.లో కూడాహిస్టరీగ్రూపుతీసుకుంది. అప్పుడుకూడానాన్నఏమీ అభిప్రాయాన్ని వెలిబుచ్చలేదు. చదువులో, గ్రూపు ఎంపికలో తనకు స్వేచ్ఛ ఇచ్చాడు. క్లాసు పరీక్షల్లోగానీ, క్వార్టర్లీ, హాఫ్‌ఇయర్లీ, పబ్లిక్ పరీక్షల్లోగానీ మార్కులు ఎట్లా వస్తున్నాయోనని ఎప్పుడూ అడిగితెల్సుకోలేదు నాన్న. అసలు అమ్మకు ఆ అజ వుండేదికాదు. ఇంటివిషయాలూ, గేదెపాడి ఆవిడ చూసుకొనేది. ఇంటి ఖర్చులకోసం ఎంత అడిగితే అంత ఇచ్చేవాడు నాన్న. వాల్తేరులోనూ, ఢిల్లీలోనూ, కలకత్తాలోనూ అన్నయ్య చదువుతూన్నప్పుడు ఉత్తరంలో ఎంతసొమ్ము అడిగితే అంత పంపించేవాడు. తాను బి.ఏ. ఫైనలియర్ చదువుతూవుండగానే సంబంధాలు చూడమని అమ్మ పోరుకాడసాగింది. అమ్మ అలా చెప్పడం ఒకటిరెండుసార్లు తాను చెవులారావింది. అప్పుడనుకొంది



తనకి పెళ్ళివయస్సు వచ్చిందని.

"పెనమలూరులో ఓ మంచి సంబంధముందట. వాళ్ళ రెండో అబ్బాయి ఖరగ్‌పూర్‌లో ఇంజనీరింగ్ చేస్తున్నాడట. అతని వంతుకు పదెకరాలపొలం వస్తుందట. కుర్రాడు అందగాడట. బుద్ధిమంతుడట. మొన్న మీ చెల్లెలు అదేపనిగా చెప్పివెళ్ళింది. మనమ్మాయిని కళ్ళకద్దుకొని చేసుకుంటారట. కట్న కానుకల్ని అడిగే పనిలేదు" అంది అమ్మ ఓరోజు రాత్రి నాన్నకు భోజనం వడ్డించి.

నాన్న ఏం మాట్లాడలేదు.

"మీకుకాదూ చెబుతూంట! అమ్మాయి పెళ్ళిని గురించి ఇప్పట్నుంచే పట్టించుకోకపోతే, వయస్సుకాస్త ముదిరిందంటే పదిలక్షల కట్నం ఇచ్చినా పదివందలు జీతం తెచ్చుకొనే ఉద్యోగిరాడు"

"బి.ఏ పూర్తిగానీ" అన్నాడు నాన్న ముక్తసరిగా.

బి.ఏ పూర్తయింది.

ఎం.ఎ. చదవాలని తనకెంతో వుంది. ఈరోజుల్లో కనీసం పోస్టుగ్రాడ్యుయేషన్ అయినా పూర్తి చేయకపోతే ఓ చదువుకిందకే లెక్కరావడంలేదు. ఎం.ఎ.

పూర్తి చేశాక పెళ్ళి చేసుకోవచ్చు. అప్పుడే పెళ్ళికి తొందరేముంది?

అదే అభిప్రాయాన్ని ఒకరోజు ఉదయం నాన్న తీరిగ్గా వరండాలో కూర్చుని పేపరు చదువుకుంటూండగా తను వెలిబుచ్చింది.

"ఎం.ఏ. చదివి ఏం చేస్తావవ ఉద్యోగాలు చేస్తావా? ఊళ్ళేలుతా ఆడవాళ్ళు ఉద్యోగాలు చేయడం ఇంటా వంటా లేదు. అది మన సంప్రదాయంకాదు. నీ పెళ్ళిని గు అమ్మ మహా తొందరపడిపోతో



సంబంధాలు చూస్తున్నాను. నీకు అంతగా ఎం.ఎ. చదవాలని వుంటే చదువు. కాని ఏదైనా మంచి సంబంధం కుదిరితే చదువు మానుకోవాల్సి వస్తుంది. పెళ్ళయ్యాక నీ పెనిమిటి ఇష్టంగదా! పెళ్ళాం కాలేజీలో చదవడంకొంత మందికి ఇష్టం వుండొచ్చు, వుండకపోవచ్చు. ముందుగా ఎట్లా చెబుతాం? ఆలోచించుకో" అన్నాడు నాన్న.

తాను ఇరకాటంలో పడింది.ఎం.ఎ.లో చేరడమా, మానడమా అని. 'ఏం.ఏ. పూర్తయిందాకా పెళ్ళి చేసుకోను నాన్నా!' అని అందామనుకొందిగానీ, ధైర్యం లేక పోయింది. తనమీద అమ్మకంటే నాన్నకే ప్రేమాభిమానాలు మెండు. అసలు తనకు నాన్న పోలికలే ఎక్కువగా వచ్చాయట. ఆడపిల్లకు తండ్రి పోలికలు వస్తే అదృష్టం అబ్బుతుందట. చిన్నప్ప ట్నుంచీ తాను ఏం కోరినా కాదనేవాడు కాదు నాన్న. అలాగనిఆయనతో 'ఫ్రీ'గా మాట్లాడేదికాదు. కొన్ని విషయాల్లో ఆయన గంభీరంగా, పట్టుదలగా, మొండి వైఖరితో వుండేవాడు. నాన్న వస్తుతహా కోపిష్టి. ఆయనకు ఏక్షణంలో ఎంత ఎత్తున కోపం వస్తుందో, ఎందుకు వస్తుందో చెప్పడం కష్టం. ఆయన ఎప్పుడూ ఏదో ఒక విషయాన్ని గురించి ఆలోచిస్తూనే వుంటాడు. బహుశా వ్యాపా రాన్ని గురించి కావచ్చు. విజయవాడలో ఆయనకు ఎరువుల కంపెనీ వుంది. ఉదయం తొమ్మిది గంటలకు భోంచేసి బస్సులో వెళ్ళి రాత్రి తొమ్మిదింటికల్లా మళ్ళీ పోరంకి వస్తాడు.

తనకి ఎం. ఎ.లో చేరాలని వున్నా ఆ ప్రయత్నం మానుకుంది. ఎం.ఎ. చదవాలంటే ఏ తిరుపతో, విశాఖపట్నమో వెళ్ళాలి. తన ఒక్కదాన్నే అంతదూరం పంపించడు నాన్న! హాస్టల్లో వుంటా నన్నా వుండనివ్వరు. ఆడపిల్ల ఒంటరిగా చదవడం అనేదాన్ని అమ్మగానీ, నాన్న గానీ ఒప్పుకోరు. అందువల్ల ఎన్నో సమస్యలు వస్తాయని వాళ్ళ నమ్మకం. పెళ్ళిగాని ఆడపిల్ల నాలుగు గోడల మధ్య తల్లిదండ్రుల సమక్షంలో వుండేనే అన్ని విధాలా శ్రేయస్కరమని వాళ్ళ ఉద్దేశం. బయట ఒంటరిగా వుంటే గాలిలాంటి ఏ పుకారు వచ్చినా, సంబంధాలు కుదర వని వాళ్ళ భయం. అంటే ఒంటరిగా, దూరంగా, పొరుగు రాష్ట్రాల్లో చదువుకొనే ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కావనికాదు. తన క్లాస్‌మేట్స్‌లో విజయలక్ష్మి ఉజ్జయిని యూనివర్సిటీలో చేరింది. రాధాకుమారి సాగర్ యూనివర్సిటీలోనూ, భగదీశ్వరి జబల్‌పూర్ యూనివర్సిటీలోనూ చేరారు. వాళ్ళు పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీలు పుచ్చుకొని, కాలేజీల్లో లెక్చరర్లుగా చేరారు. తర్వాత పెళ్ళిళ్ళు చేసుకొని తమతమ జీవితాల్లో స్థిరపడిపోయారు.

బి.ఎ. అయిపోయాక కాలక్షేపంగా నవలలు, వీక్లీస్, మంత్లీస్ చదవడం మొదలెట్టింది. సినిమాలన్నా, సినిమా పత్రికలు చదవడమన్నా మొదట్నుంచీ అంతగా మోజులేదు. కాని తన వయస్సు వాళ్ళకు అదే పెద్ద ఎట్రాక్షన్. ఎక్కడ కల్సుకున్నా వాళ్ళ కబుర్లు అవే!

"నువ్వేం సినిమా చూశావు?"

"అందులో హీరోహీరోయిన్లు ఎట్లా యాక్టు చేశారు?"

"ఫలానా సినిమా పరమ బోర్"

"ఫలానా హీరోకీ, హీరోయిన్‌కూ-ఫైవ్‌స్టార్ హోటల్లో పర్మనెంటుగా సూట్ వుందట. వాళ్ళక్కడ కల్సుకుంటూ





వుంటారట నిజమేనా?"

"ఫలానా హీరోయిన్ పెళ్ళి చేసుకో బోతోందట"-

ఇలాంటి గాసిప్పూ, గాలికబుర్లంటే తనకి మొదట్నుంచీ ఆసక్తి వుండేదికాదు. లిటరేచర్‌పైనే అభిమానముండేది. కాల్పనిక సాహిత్యాన్ని గురించి ఎవరైనా చర్చిస్తే తనకు ఆసక్తిగా వుండేది.

బి.ఎ. అవగానే తనకి సంబంధాలు చూడటంలో నాన్న ఎక్కువ శ్రద్ధ కనబర్చసాగాడు. ఆయన రాత్రిపూట భోంచేసేటప్పుడు అమ్మ ఆ ప్రస్తావన రోజూ తీసుకొచ్చేది. ఏదో ఒకసంబంధం చెప్పేది. నాన్న 'ఊఁ!' కొట్టేవాడు. అంతకుమించి ఆసక్తిగా వివరాలు ఏమీ అడిగేవాడుకాదు. అమ్మ చెప్పే సంబంధాల్లో ఎక్కువగా ఇంజినీర్లకు, బిజినెస్ చేసేవాళ్ళకు సంబంధించినవి. ఓసారి ఒక మంచి సంబంధాన్ని అమ్మ మొహం చాటంత చేసుకుని చెప్పింది. పిల్లవాడి తండ్రి సినిమా ప్రొడ్యూసరట. కొడుకు ఇంజనీరింగ్ చదివి సినిమా ప్రొడక్షన్‌లో దిగాడట. ఒక సినిమాకు ప్రొడ్యూసరట. మరో సినిమాను సొంతంగా డైరెక్టు చేస్తున్నాడట. ముప్పై నలభై లక్షల నగదు వుందట. విజయవాడ దగ్గరే పదివేల గజాల ఇళ్ళ స్థలం కూడా వుందట ఆ వివరాలన్నీ విని నాన్న అన్నాడు గంభీరంగా-

"మనకు ఇంజినీర్లూ వద్దు, సినిమా ప్రొడ్యూసర్లూ వద్దు, పెద్దపెద్ద ఉద్యోగాలు చేస్తూన్నవాళ్ళూ వద్దు. నా దృష్టంతా మెడిసిన్ చదువుకున్న వాళ్ళ మీద వుంది. అబ్బాయిని మెడిసిన్ చదివించలేకపోయాం. మెడిసన్ చదివిన అమ్మాయిని కోడలుగా చేసుకోలేక పోయాం. మన అమ్మాయికి మెడిసిన్ చెప్పించలేకపోయాం. కనీసం అల్లుడినయినా మెడిసిన్ చదివినవాణ్ని తెచ్చుకుంటే నా మనస్సు కొంత తృప్తిపడుతుంది. అందుచేతనే మెడిసిన్ చదివిన వాళ్ళ కోసం చూస్తున్నాను. రెండు మూడు సంబంధాలు సంప్రదింపుల్లో ఉన్నాయి. ఈ నెలాఖరుకు ఏదో ఒకటి కుదరొచ్చు. మీరేమీ తొందర పడకండి"

ఆరోజు నుంచీ అమ్మ నాన్న దగ్గర సంబంధాల ప్రసక్తి తీసుకురాలేదు.

పదిరోజుల తర్వాత నాన్న ఓ మధ్యాహ్నం హడావుడిగా ఇంటికొచ్చి సాయంత్రం అయిదు గంటలకు అమ్మాయిని చూడటానికి వస్తున్నారు. అన్ని ఏర్పాట్లు గొప్పగా చేయాలి" అన్నాడు.

వాళ్లు సాయంత్రం అయిదు గంటలకు కచ్చితంగా వచ్చారు కారులో. పెళ్లికొడుకు, పెళ్లికొడుకు తల్లి, అన్నయ్య, పెళ్లికొడుకు మేనమామ. హాలులో పెళ్లిచూపుల తతంగం ఏర్పాటు చేశారు. జీవితంలో మొదటిసారిగా తను పెళ్లిచూపుల తతంగానికి తయారు కావాల్సి వచ్చింది. అమ్మ తనని తయారుచేయడం నాలుగు గంటలనుంచే మొదలెట్టింది. ధర్మవరం పట్టుచీర, మాచింగ్ జాకెట్టు, తనకు చేయించిన నగలు, అమ్మ నగలు, కాసుల పేరు, వొంకెల వడ్డాణం, పాపిట చెయిన్, డైమండ్ పోగులు మామిడి పిందెల నెక్‌లెస్, చేతులకు నాలుగు జతల రాళ్లగాజులు- అంతా పల్లెటూరి అలంకరణ. పోరంకి విజయవాడకు చాలా దగ్గర అయినప్పటికీ అక్కడి మనుషులు, అలవాట్లు, ఆచారాలు, మనస్తత్వాలు, నాగరికత పల్లెటూరికి చెందినవే. తనకు ఎంతో

ఎబ్బెట్టుగా తోచింది.

"అమ్మవారికి పెట్టినట్టు ఇన్ని నగలు దేనికమ్మా? ఈ రోజుల్లో ఎంత సింపుల్‌గా వుంటే అంత మంచిది" అంది తను. కాని అమ్మ వినిపించుకోలేదు.

"నీకు తెలియదే! రోజులు మారినా బంగారానికి విలువ పెరిగింది కానీ, ఏమాత్రం తరగలేదు. ఈరోజుల్లో కూడా ఎన్ని నగలు పెట్టుకుంటే అంత గొప్ప. మొన్న రైస్‌మిల్ అసోసియేషన్‌లో వల్లూరిపాలెంవారి పెళ్లి జరిగింది. ఆ మున్సబు కూతురు డాక్టరీ చదివింది. అంత చదువు చదివినా రెండు గజాల బంగారు జరీ 'కొంగు'గల కంచిపట్టు చీర ధరించి, ఎనభై సవర్ల వొంకెల పడ్డాణం, కాసులపేరు, మూడు పేటల చంద్రహారం, చేతులకు రాళ్ల వొంకెలూ, ఆరు జతల కడియపు గాజులూ, కాళ్లకు బంగారు రాళ్ళ పట్టాలూ, మెట్టెలూ పెట్టుకొని సాక్షాత్తూ ఐశ్వర్యలక్ష్మిలా కనబడింది. పెళ్లిలోని అమ్మలక్కల కళ్లంతా ఆమె మీదే. ఈరోజుల్లో ఈ మాత్రపు నగలు మన ఇళ్లల్లో ఈడొచ్చిన ప్రతి ఆడపిల్లా పెట్టుకుంటోంది. దీనికే అబ్బురపడుతున్నావు" అని నాలుగు విసుర్లు విసిరింది.

తాను ఏం మాట్లాడలేకపోయింది. ఇష్టం లేక పోయినా ఆ బంగారపు తొడుగునూ, పట్టుచీర బరువునూ ధరించింది.

పెళ్లిచూపులు అయిపోయాయి.

మల్లికార్జున్‌కేసి వోరగా ఒక్కసారే చూసింది. అదే సమయంలో అతనూ తనకేసి చూశాడు. ఇరువురి చూపులూ కల్సుకున్నాయి. తాను ఎంతో సిగ్గుపడింది.

అతను అందగాడే. తెల్లగా, పొడుగ్గా వున్నాడు. కోలమొహం. పక్క పాపిట. నుదురు మీదకు వాలే వొత్తుగా, వొంకులుగా వున్న జుత్తు. కళ్లు ఆకర్షణీయంగా వున్నాయి. గుండ్రటి కళ్లు. చెక్కిళ్లు పల్చన. భుజాలు వెడల్పు. ప్రథమ వీక్షణంలోనే తన మనస్సులో అతను హత్తుకుపోయాడు. అతని పర్సనాలిటీలో మగతనం కొట్టొచ్చినట్టుగా కనబడింది.

అయితే ఆ పెళ్లిచూపుల్లో తనూ, అతనూ ఏం మాట్లాడుకోలేదు.

'అమ్మాయిని పలకరించు' అన్నాడు అతని మేనమామ. 'పలకరించటానికేముంది?' అన్నట్టు పెదవులు దాటకుండా చిరునవ్వు నవ్వాడతను.

తను తలొంచుకుంది.

"నీకిష్టమేనా అమ్మాయ్?" అన్నాడు నాన్న – తను హాలులోంచి గదిలోకి వెళ్లాక.

అవునన్నట్టు తను తలాడించింది.

తర్వాత పెద్దవాళ్లు మాట్లాడుకున్నారు.

శుభముహూర్తం పెట్టడమైంది.

మల్లికార్జున్‌తో తన పెళ్లి విజయవాడలోనే చాలా వైభవంగా జరిగింది.

తన పెళ్లికి నాన్న యాభైవేలదాకా ఖర్చుచేశాడు. పెట్టుబడులకింద ఎంతో మొత్తం ఖర్చయింది. ఆడబిడ్డ లాంఛనాలు, ఇతర బంధువులకు బట్టలు. అయితే మల్లికార్జున్ తరఫువారు పెట్టుబడుల కింద అంత ఖరీదైన చీరలు, బట్టలు పెట్టలేదని అమ్మకు కష్టం వేసింది. పైపెచ్చు తమ వైపు చుట్టాలు వాళ్ల మర్యాదలకు, మాటలకు ఎగతాళి పట్టించారు. పెళ్లికూతురు చీర కూడా రెండువేల రూపాయల లోపు ఖరీదు గలదే. తన అసంతృప్తిని అమ్మ ఎవరి దగ్గరో వెలిబుచ్చింది. ఆ విషయం నాన్న చెవులకు సోకింది.




నాన్న అమ్మను కోప్పడ్డాడు.

"ఇట్లాంటిస్వల్పవిషయాల్లోనేఆడవాళ్ల బుద్ధులు బయటపడేది. వాళ్ళ జిల్లా ఆచారం ప్రకారం వాళ్లుపెట్టారు. మన జిల్లా ఆచారం ప్రకారం మనంపెట్టాం. ఎక్కువ తక్కువలని అనుకోవడం దేనికి? మరెవ్వళ్ళతో అనకు. బంధుత్వం కలిశాక ఇలాంటి లొసుగులతో మనస్తత్వాన్ని బయటపెట్టుకోవడం దేనికి? మనమే పల్చనైపోతాం"

తర్వాత అమ్మ ఆ వూసెత్తలేదు.

డాక్టర్ మల్లికార్జున్‌తో పెళ్ళికావడం అందరూ తన అదృష్టంగా భావించారు.

"నీకేమే! డాక్టరు భార్యవు. సొసైటీలో నీ స్టేటస్ పెరిగిపోతుంది. డబ్బుకు బాధవుండదు. ప్రైవేటు ప్రాక్టీసు పెట్టుకున్నా రోజుకు వెయ్యో, పదిహేను వందలు మీ ఆయన సంపాయించవచ్చు. ఎంత గొప్పవాడికైనా రోగాలొస్తాయి. ఆ రోగం వచ్చినవాడు డాక్టరు దగ్గరకు రాకుండా వుండడు. గవర్నమెంట్ సర్వీసులో చేరితే బోలెడు ఇన్‌ఫ్లుయన్స్" అని ఒక ఫ్రెండ్ అంటే, మరో ఫ్రెండ్-"ఈ రోజుల్లో డాక్టర్లపని నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుందే. బిజినెస్‌లో కంటే ఎక్కువ డబ్బులొస్తున్నాయి. ఓ నర్సింగ్ హోమ్ పెట్టుకుంటే పదితరాలకు సరిపడా సంపాయించుకోవచ్చు" అంది.

డాక్టర్ ప్రొఫెషన్ గురించి తానెప్పుడూ ఆలోచించలేదు. బంధువుల్లో జబ్బుచేస్తే చూడటానికి విజయవాడలో రెండుమూడు నర్సింగ్‌హోమ్‌లకు వెళ్ళింది. అవి రోగులతో నిండివున్నాయి. డాక్టర్లు కూడా చాలా బిజీగా వున్నారు. వాళ్లు రెండుచేతులా సంపాయిస్తున్న విషయం తనకు తెలుసు. ఆ సంపాదనా కాంక్షలో, తాపత్రయంలో డాక్టర్లు రోగుల అనారోగ్యాలపై నిజంగా వ్యాపారం చేస్తున్నారని కూడా తాను విన్నది. గవర్నమెంట్ ఆస్పత్రుల్లో రోగులుండే గదులు అధ్వాన్నంగా వుంటాయి. వాటిల్లో ఆరోగ్యవంతులెవరూ వుండలేరు. కామన్ బాత్‌రూమ్‌లు, లేవటరీలు. పైగా అవి పరిశుభ్రంగా వుండవు. గదులు ఇరుగ్గా వుంటాయి. పేషెంట్ బెడ్‌పోతే, సిరిచాప వేసుకోవడానికి మాత్రం ఖాళీ వుంటుంది. గాలిరాదు.కరెంట్ లేకపోతే ఆ గదుల్లోంచి బయటకు పరుగెత్తుకు రావాల్సిందే. గాలీ, వెలుతురు ఉండవు. రోగికి ప్రత్యక్ష నరకమే. ఆపరేషన్ థియేటరని బోర్డు ఉంటుందిగానీ, లోపల ఫిష్ మార్కెట్ లాగా వుంటుంది. ఆపరేషన్ చేయడం మెకానికల్ ప్రాసెస్. ఆ తర్వాత రోగి మొహం పెద్ద డాక్టరు చూడడు. అసిస్టెంట్లూ, కాంపౌండర్లూ, నర్సులూ పట్టించుకోవాలి. పేషెంట్ పరిస్థితి ప్రమాదకరంగా వుంటేనేగానీ డాక్టరు తొంగిచూడడు. అందుకే ప్రయివేటు నర్సింగ్‌హోమ్స్‌కు అంత గిరాకీ!

మొదటిరాత్రే తను అడిగింది మల్లికార్జున్‌ను-

"మీరు గవర్నమెంట్ సర్వీసులో చేరతారా?ప్రైవేటు ప్రాక్టీసు పెడతారా?" అని.

ఆయన తనని ఎదురు ప్రశ్న వేశాడు-

"ఏం చేయమంటావు?"

"మీ ఇష్టం...నేనెట్లాచెప్పేది?" అంది తను.

"నీ అభిప్రాయమేమిటి ప్రియా! నువ్వు ఏం చేయమంటే అదే చేస్తాను" అన్నాడాయన.

తన అభిప్రాయానికి విలువనిచ్చి

సందుకు మనస్సులో మహానందపడింది. ఆడవాళ్ళల్లో ఆ బలహీనతను కొంత మంది మగవాళ్లు కనిపెట్టి స్వప్రయోజనాలకు వినియోగించుకుంటారు. పురుషుని పొగడ్తకు స్త్రీ సులభంగా లొంగిపోతుంది.

అయినా తాను నిర్మోహమాటంగా చెప్పింది-

"ఇది మీరు నిర్ణయించుకోవాల్సిన విషయం. ఉద్యోగంలో చేరినా, వృత్తి చేపట్టినా మీరు చేయాల్సిందేగాని నాదేముంది? నిమిత్తమాత్రురాల్ని. విధి నిర్వహణ మీది"

చిరునవ్వు నవ్వాడు మల్లికార్జున్.

"ఉద్యోగంలో చేరాలనిలేదు. గవర్నమెంట్ సర్వీసులో స్వేచ్ఛ వుండదు. రూల్సు, రెగ్యులేషన్లు, పైఅధికార్ల అభిప్రాయాలూ, అభిమానాల ప్రకారం సర్వీసు చేయాల్సి వుంటుంది. సొంత అభిప్రాయాలకు తావు వుండదు. పుస్తకాల్లో వున్నట్లే వైద్యం చేయాల్సి వుంటుంది. ప్రైవేటు ప్రాక్టీసు పెడతాను. నేను మెడిసిన్ ఎందుకు చదివానో తెలుసా?"

తెలీదన్నట్టు తలాడించింది తను.

"మాది పల్లెటూరు. పట్నానికి దగ్గర్లో వున్నప్పటికీ ఆ పల్లెటూర్లో సౌకర్యాలు అతితక్కువ. మాది వెనకబడిన గ్రామం. గ్రామతగాదాలవల్ల అదేమంత అభివృద్ధి కాలేదు. పంచవర్ష ప్రణాళికలవల్ల దేశమంతటా గ్రామీణాభివృద్ధి అంతో ఇంతో జరుగుతున్నా మా వూరుమాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నసామెతగా తయారైంది. అనేక విషయాల్లో మా వూరు వెనుకబడేవుంది. ప్రభుత్వంవారి ఆస్పత్రిలేదు. స్కూలులేదు. ఊళ్ళో మట్టిరోడ్లు తప్ప సరైన పక్కారోడ్లులేవు. విద్యుద్దీపాలులేవు. అంతా మెట్టభూమి. డబ్బున్న కొద్దిమంది ఆసాములు మాత్రమే వరిఅన్నం తినేవారు. వర్షాలపై పొలాల పంటలు ఆధారపడి వుండేవి. నా చిన్నతనంలో పొగాకు,మిర్చి పండేవి. ఇప్పుడైతే కాటన్ పండుతున్నదిగానీ, ఆ రోజుల్లో రైతుల పరిస్థితి దయనీయంగా 'ఎండాకాలం ఎచ్చి వానాకాలం పచ్చి'గా వుండేది.

"మాది ఒక రకంగా పేదకుటుంబమే. ఉమ్మడి కుటుంబంనుంచి వేర్లుపడ్డాక నాన్నకు ఆరెకరాల భూమి మాత్రమే వచ్చింది. నాలుగెకరాలు కౌలుకు తీసుకొని పొగాకు పండించేవాడు. మా అమ్మా, నాన్నా, అక్కా పొద్దున్న ఇంత జొన్నకూడు తిని పొలం పనులకు వెళ్ళేవాళ్లు. మావూళ్ళోఆడవాళ్లు పొలంపనులకు వెళ్ళడంఆనవాయితీ.ఎవ్వరూ విడ్డూరంగా చూసేవాళ్ళుకాదు. నాగరికత విషయంలో కూడా మా వూరు బాగా వెనకబడివుందనే చెప్పొచ్చు. నేను చదువుకొనేందుకు సైకిలుమీద రోజూ గుంటూరు వెళ్ళి వచ్చేవాణ్ని.

"మాకు దున్నపోతుల బండివుండేది. ఎడ్లతో వ్యవసాయంచేసే స్తోమత నాన్నకు లేదు. మా అన్నయ్య వీధిబడిలో చదివి, పొలం పనుల్లోకి దిగాడు. వాడికి మొదట్నుంచీ చదువుమీద ధ్యాసవుండేది కాదు. స్కూలు ఎగ్గొట్టి పొలం వెళుతూ వుండేవాడు. అంచేత మా నాన్న వాడి మనస్సు కనిపెట్టి 'నీకు అక్షరంముక్క అబ్బే గీతలేదురా! ఎందుకొచ్చిన లాయిలెస్సా! శుభ్రంగా పొలంపనులు నేర్చుకో నాకు చేదోడుగా వుంటావు. ఇంట్లో ఒకళ్లు చదువు వెలిగిస్తేచాలు' అన్నాడు. మా అన్నయ్య ఎగిరి గంతేసి, ఆ రోజే

పలకా బలపం వీధిలోకి గిరవాటేశాడు. పూర్తిగా పొలం పనుల్లోకి దిగిపోయాడు. గొడ్లచావిడి బాగుచేయడం, దున్న పోతుల్ని చెరువుకి తీసుకెళ్ళి కడగడం, పొలంపోవడం, కలుపుతీయడం, గొర్రు



వేయడం, మిరపనారు నాటడం, పొగాకు బేరన్ పన్లుచూడటం మొదలైన పనులతో పక్కా రైతుబిడ్డగా మారిపోయాడు.

"నాకు పొలం పనులమీద ఏమంత ఇంటరెస్టులేదు. ఎప్పుడైనా స్కూలుకు సెలవులు ఇచ్చినప్పుడు నాన్నకూ, అన్నయ్యకూ పొలం అన్నం పట్టుకెళ్లేవాణ్ని. సాయంత్రం పూట షికారుగా అప్పుడప్పుడూ డొంకలో ఒక్కణ్నే నడిచి వెళుతూ వుండేవాణ్ని. చుట్టూ పచ్చని ఆకుతోటలు. చల్లనిగాలి, డ్యూటీ దిగిపోతున్న ఎర్రని సూర్యుడు, ఊదా రంగు ఆకాశం, అస్తమిస్తోన్న సూర్యుని ఎరుపుదనాన్ని మింగివేయాలని తహతహలాడుతోన్నట్టుచిరుమబ్బులు.సాయంత్రపు ప్రకృతి సౌందర్యాన్ని చూడటం నాకెంతో ఇష్టం.

"ఒకరోజు సాయంత్రం అట్లా షికారుకు వెళ్ళి దొరవారి చెరువు గట్టున నేరేడు చెట్టుకింద కూర్చుని దూరంగా తాటి తోపులోంచి అస్తమిస్తోన్న సూర్యుని సోయగాన్ని తిలకిస్తున్నాను. అప్పుడు డొంకలో దుమ్ము రేపుకుంటూ దున్నపోతుల బండి వేగంగా వస్తోంది.

ఆ బండి మాదే.

ఆ బండిని తోలేది మా అన్నయ్యే.

చివుక్కున లేచి డొంకలోకి వెళ్ళాను. ఈతచెట్ల గుబురుదగ్గర నిలబడ్డాను. అన్నయ్య బండి ఆపాడు నన్ను చూసి. 'తమ్ముడూ! బండి ఎక్కు. అయ్యకు కాలిలో గడ్డపలుగు దిగింది' అన్నాడు



భయంతో కూడిన ఆదుర్దాతో.

గభాలున వసికట్టరపుచ్చుకు ఒక్క అంగలో బండి ఎక్కాను. జల్లలో పర్చిన చెత్తలో నెత్తురు ముద్దలోపడి వున్నాడు నాన్న. ఎడంకాలికి కప్పిన సీర్కావి పైపంచ నెత్తురుతో తడిసిపోయింది. నెత్తురు ఆగడానికి గుడ్డను తడిపి చుట్టారు. గాయంపై ఎండిన తాటి పువ్వును అద్దారు. నాకు విపరీతమైన భయం వేసింది.

'ఎట్లా తగిలిందిరా దెబ్బ? 'అన్నాను.

'గనుం తప్పుతున్నాం.. మధ్యలో రాయి అడ్డొచ్చి గడ్డపలుగు జారి అయ్య కాలికి పొడుచుకుంది' అన్నాడు అన్నయ్య.

చెర్నాకోలతో దున్నల్ని కొడుతూ బండిని వేగంగా నడుపుతున్నాడు అన్నయ్య.

ఊళ్ళో ఆస్పత్రి లేదు. పక్క ఊరిలో ఎల్.ఎఫ్. డిస్పెన్సరీ వుందిగానీ అక్కడ డాక్టరు వుంటాడో లేదో! కాంపౌండరువున్నా, టించర్ అయొడిన్ తప్ప మరో మందు వుండదు.

'ఎక్కడకు తీసుకెళదాం?'

'ఊళ్లోకి. నంబి ఆచార్యుల దగ్గరకు'

'నంబి ఆచార్యులు మధ్యాహ్నం బుడంపాడు పోయినట్టుంది- వచ్చాడో, లేదో. పొద్దున్న గుడి దగ్గర కనబడి చెప్పాడు. రాత్రికో, రేప్పొద్దున్నోగాని రానన్నాడు'

అన్నయ్య దున్నల్ని అదిలించడం మానేశాడు.

'మరెక్కడకు పోదాం?'

ఓ నిముషంలో సగంసేపు ఆలోచించాను.

'గుంటూరు తీసుకెళదాం'

'అప్పుడుదాకా నాన్నను బండిలోనే వుంచుదామా?'

'రోడ్డుమీదకుపోతే ఏదైనా బస్సు రావచ్చు. బస్సులో త్వరగా తీసుకు వెళ్లొచ్చు'

'ఏమో...తెనాలి బస్సులు గంటకు ఒకటి చొప్పున వస్తాయి. వచ్చినా ఖాళీ వుంటాయో లేదో'

'ముందు చూద్దాం. రోడ్డు దగ్గరకు పోనివ్వు'

అన్నయ్య తలాడించి, దున్నల్ని తోరు చేశాడు.

తెనాలి- గుంటూరు రోడ్డు దగ్గరకు వచ్చేటప్పటికి సూర్యాస్తమయమైంది. బస్సు వచ్చి గంటకు పైనే అయిందట.

పాతికమంది దాకా ప్రయాణీకులు బస్సు కోసం ఎదురుచూస్తున్నారు. బస్సు వచ్చినా అంతమందిని తోసుకొని ఎక్కడం కూడా కష్టమే. ఏం చేద్దాం? అన్నట్టు అన్నయ్య నా వంక చూశాడు. దూరంగా రోడ్డుపక్కన దున్నపోతుల బండిని ఆపాం.

అంతలో ఓ జట్కాబండి వచ్చింది అక్కడికి. దాని చుట్టూ జనం మూగారు. నాలుగు రూపాయలు ఎక్కువ ఇస్తానని చెప్పి నాన్నను ఆ జట్కాలోకి మార్చాం. అరగంటలో పాత గుంటూరు చేరింది జట్కా. ఒక ప్రయివేట్ నర్సింగ్ హోమ్‌కు తీసుకెళ్లాం. డాక్టరు వున్నాడు. వెంటనే ఎ.టి.యస్. ఇంజక్షన్ ఇచ్చాడు. గాయానికి కట్టుకట్టాడు. గాయం బాగా లోతుగా వుంది. యాంటిబయోటిక్స్ కాప్సెల్స్ ఇచ్చాడు. ప్రతి మూడు గంటలకు ఒకటి చొప్పున వేసుకోమన్నాడు. కాని నాన్న ఒక పట్టాన మందులు మింగలేదు.

'నేను పుట్టి బుద్ధెరిగిన తర్వాత




ఆస్పత్రి మొహం ఎప్పుడూ చూడలేదురా! ఈ మందులు మింగను. జొరమొస్తే నంది ఆచార్యుల కషాయమే మింగేవాణ్ని. కాదు. ఖర్మకొద్దీ గాయం తగిలింది కానీ రాయిలాంటివాణ్ణి. ఈ ఆస్పత్రి మందులు నాకు పడవురా' అంటూ నాన్న మొండి కేశాడు. అయినా అన్నయ్యా, నేనూ బలవంతాన కాప్సిల్స్ మింగించాం.

'గాబరా పడాల్సిన పనిలేదు. వారం రోజుల్లో గాయం మాను పడుతుంది. మనిషిలో రక్తం బాగా పోయింది. ఎక్కిద్దాం' అన్నాడు డాక్టరు. ఆ రాత్రి అక్కడేవున్నాం నేనూ, మా అన్నయ్యా.

రాత్రి పదిగంటల ప్రాంతానికి అమ్మా, అక్కయ్యా వచ్చారు.

కాని నాన్న బతకలేదు.

తెల్లవారుజామున చనిపోయాడు. ఎట్లా చనిపోయాడో డాక్టరు కరెక్టుగా చెప్పలేక పోయాడు. గాయానికి భయపడి, హార్ట్ ఎటాక్ వచ్చి వుంటుందని తేల్చాడు డాక్టరు. వైద్యంలో ఏదో లోపం, అశ్రద్ధ వున్నాయనిపించింది. అప్పుడే ఓ నిర్ణయానికొచ్చాను. ఊళ్ళో వైద్య సదుపాయాలు లేకపోవడంవల్ల నాన్న చనిపోయాడు. వెంటనే తగిన చికిత్స చేయిస్తే నాన్న బతికేవాడు. కాబట్టి మెడసిన్ చదివి, డాక్టర్నై, ఊళ్లో ప్రజలకు వైద్యసేవలు చేయాలి...అని నిర్ణయించుకున్నాను. ఆ ఉద్దేశంతోనే మెడిసిన్ చదివాను"

"అంటే మీ ఊళ్ళోనే ప్రాక్టీసు పెడతారా?" అంది తను అమాయికంగా.

"ఇప్పుడు మావూరు పూర్వంలాగా లేదు. ఓ యం.బి.బి.యస్. డాక్టరు హాస్పిటల్ పెట్టాడు. గవర్నమెంట్ హాస్పిటల్ కూడా వుందనుకో. నేను అక్కడ ప్రాక్టీసుపెడితే అవతలి డాక్టరుకొచ్చే పదిమంది రోగుల్ని పంచు కోవడమే అవుతుంది"



డాక్టర్ మల్లికార్జున్ విజయవాడలోనే ప్రాక్టీసు పెట్టాడు. మొదట్లో గుంటూర్లో ప్రాక్టీసు పెడదామనే ఆలోచన ఆయన కొచ్చింది. అక్కడ పెడితే తన ఊరి వాళ్ళే గాకుండా, పరిసరగ్రామాలవాళ్ళు గుంటూరులో తనకు తెల్సిన వాళ్ళు తన దగ్గరకు రావచ్చని అభిప్రాయపడ్డాడు. కాని నాన్నకు అల్లుడు విజయవాడలోనే ప్రాక్టీసు పెట్టాలనివుంది. అందుచేత ఒక రోజు మధ్యాహ్నం అన్నాడు ఆయనతో.

"మీకు ప్రయివేట్ ప్రాక్టీసు పెట్టా లనే వుందిగా"

"అవునండీ. గవర్నమెంట్ సర్వీసు నాబోటి స్వేచ్ఛా భావాలున్నవాళ్ళకు సరిపడదు. వైద్యసేవకంటే పైఅధికార్లతో కుస్తీ పట్టడంతోనూ, కిందివాళ్ళను అదుపులో పెట్టడంలోనూ ఎక్కువకాలం వృథా అవుతుందని ఆ మధ్య పదేళ్ళు సర్వీసుగల ఒక గవర్నమెంట్ డాక్టరు చెప్పాడు. కాబట్టి ప్రయివేటు ప్రాక్టీసు పెట్టుకుందామని వుంది. ప్రయివేటు ప్రాక్టీసులో వ్యక్తిగతసామర్థ్యం రాణించే అవకాశముంది. నేర్చుకుంది ఆచరణలో పెట్టవచ్చు. అనుభవం, స్పెషలైజేషన్

ద్వారా వృత్తిలో పేరు గడించవచ్చు. కేవలం సంపాదనే నా ప్రధాన ధ్యేయం కాదనుకోండి. మెడిసిన్ చదువుకున్నందుకు ఆ విద్య ద్వారా పదిమందికి చిత్తశుద్ధితో సేవ చేయగలిగితే జీవితాశయం చంద్రునికో నూలుపోగు రీతిగా కొంతైనా నెరవేరుతుంది."

అవునన్నట్టు నాన్న తల ఆడించాడు. కొన్ని క్షణాల తర్వాత మళ్ళీ అన్నాడు నాన్న, "ఎక్కడ పెట్టాలని ప్రాక్టీసు?"

"గుంటూరులో"

నాన్న రెండు నిముషాలపాటు దీర్ఘంగా ఆలోచించాడు. ఆయన ముఖ కవళికల్లో అదో రకమైన సీరియస్‌నెస్ వచ్చింది. మామగారి ఆలోచనా ఉద్విగ్నతను గమనించిన అల్లుడు రవ్వంత కంగారు పడ్డాడు.

"విజయవాడలో ఎందుకు పెట్ట కూడదు?"

మల్లికార్జున్ కనుబొమలు దగ్గరకు చేర్చి కొన్ని క్షణాలపాటు ఆలోచించాడు. మామగారి మనోభావాన్ని గ్రహించినవాడై అంతలోనే తనకుతాను రాజీపడి "పెట్టొచ్చు" అన్నాడు పొడిగా.

"మీ అభీష్టానికి వ్యతిరేకంగా చెప్పడం లేదు. గుంటూర్లోకంటే విజయవాడలో డాక్టర్లూ, నర్సింగ్‌హోమ్‌లూ, వైద్య సౌకర్యాలూ తక్కువగా వున్నాయని నా ఉద్దేశం. అంతేకాకుండా జనాభా దృష్టితో చూసినా విజయవాడలో జనసమ్మర్దం ఎక్కువ. ప్రాక్టీసుకు మంచి అవకాశాలుంటాయి"

"మీ ఇష్టం" అన్నాడు మల్లికార్జున్.

నాన్న ఎంతో సంతోషించాడు అల్లుడు తన ఇష్టాన్ని మన్నించినందుకు.

 

అందులో ఆయనగారి లౌక్యం,ముందు ఆలోచన లేకపోలేదు. తర్వాత తనకు తోచింది. సొంతంగా ప్రాక్టీసు పెట్టాలంటే అన్ని హంగులూగల నర్సింగ్ హోమ్ కావాలి. ఆపరేషన్ థియేటర్ కావాలి. రోగులుండటానికి ఆధునిక సౌకర్యాలతో రూమ్స్ ఉండాలి. వీటన్నింటికీ బోలెడు డబ్బు అవుతుంది. బ్యాంకువాళ్లు అప్పుగా కొంత ఇచ్చినా పెట్టుబడిగా రెండు మూడు లక్షలు కావాలి. అంత డబ్బు ఆయన దగ్గర ఎక్కడిది? అందు చేతనే మామగారి అభీష్టానికి తలొగ్గాడు.

సూర్యారావుపేటలో మెయిన్‌రోడ్డుకు అతి సమీపంలో ఒక పెద్ద బిల్డింగ్ అద్దెకు తీసుకొని నర్సింగ్‌హోమ్‌ను ఏర్పాటు చేశాడు నాన్న. దానికి కావాల్సిన ఎక్విప్‌మెంట్, ఫర్నిచర్, ఆపరేషన్ థియేటర్ పరికరాలు, సామాన్లు అన్నీ నాన్నే సమకూర్చాడు సొంత డబ్బుతో. నర్సింగ్ హోమ్‌కు అవసరమైన సిబ్బందిని కూడా నాన్నే చేర్చాడు. అన్ని ఏర్పాట్లూ పూర్తయిన తర్వాత నాన్న చేతనే మల్లికార్జున్ ఆ నర్సింగ్‌హోమ్‌కు ప్రారంభోత్సవం చేయించాడు. ఆ ప్రారంభోత్సవానికి పట్టణంలోని రెండు మూడొందల పెద్ద మనుషులని ఆహ్వానించాడు. ఆ నర్సింగ్‌హోమ్‌కు 'ప్రియంవదా నర్సింగ్ హోమ్' అని పేరు పెట్టారు.

అట్లా పేరు పెడతాడని తనకు చూచాయగానైనా తెలీదు. నాన్నకుకూడా తెలుసో, లేదో!

"నా పేరెందుకు పెట్టారు?" అంది తను మల్లికార్జున్‌తో

"అది నీ నర్సింగ్‌హోమ్ కాబట్టి!" అన్నాడు మల్లికార్జున్ చిరునవ్వుతో.

ఆ చిరునవ్వు వెనుకగల తాత్పర్యం తనకు అర్థంకాలేదు.

"అంటే"

"నిన్ను పెళ్ళిచేసుకున్నందుకు కట్నంగా మీ నాన్న నాకు ఆ నర్సింగ్ హోమ్‌ను బహూకరించాడు. అది స్త్రీ ధనం లాంటిది కాబట్టి, దానికి నీ పేరే పెట్టాను. దానికి నేను సంరక్షకుణ్ణి. ఆ నర్సింగ్‌హోమ్ పరువు ప్రతిష్ఠల్ని నిలబెట్టాల్సిన కర్తవ్యం, బరువుబాధ్యతలు నాపైన వున్నాయి" అన్నాడుడాక్టరు మల్లికార్జున్.

ఆయన ఉద్దేశానికి ఎంతో మురిసిపోయింది. మనసులో ఆయన మెళ్ళో మల్లె పూదండవేసి నమస్కరించింది. ఆయనది ఎంత ఉదాత్త హృదయం! భార్యపట్ల ఎంతటి ప్రేమానురాగాలు! ఎంత గౌరవం! ఎంత అభిమానం! అనుకుంది. కాని తనలో ఆ మురిపెమూ, ఉదాత్త భావమూ సంతోషగర్వాలూ ఎక్కువ కాలం చోటుచేసుకోలేకపోయాయి.

నర్సింగ్‌హోమ్ తెరిచిన వారం రోజులకే ఆయన ప్రాక్టీసు అందుకుంది. మొదట్లో టవున్లోవున్న నాన్న మిత్రులూ, శ్రేయోభిలాషులూ, బంధువులూ. ఆ నర్సింగ్‌హోమ్ కొచ్చేవారు మొదటి నెలలోనే ఆరు ఆపరేషన్లు చేసి 'మంచి డాక్టరు'గా పేరు తెచ్చుకున్నాడు మల్లికార్జున్. పేషంట్లు వుండే రూమ్‌లు నీట్‌గా, ఆరోగ్యంగా, గాలి ధారాళంగా వచ్చేట్టు, వెలుతురుకు కొరతలేనట్టు వుండటంతో త్రిస్టార్ హోటల్ గదుల్లా వున్నాయనే పేరుపడింది. ప్రతి రూమ్‌కూ అటాచెడ్ బాత్‌రూమ్, సీలింగ్‌ఫ్యాన్, కప్‌బోర్డు, నలుగురు కూర్చునే సోఫాసెట్, పేషెంట్ బెడ్, దానిపై పాలమీగడలాంటి తెల్లని పరిశుభ్రమైన బెడ్‌షీట్, రోగికి తోడుగావుండే మనిషి పడుకోవడానికి మరో బెడ్, రోగి బెడ్‌పక్కనే టీపాయ్. ఫర్నిచర్ అంతటికీ తెలుపు పెయింట్‌తో కళకళలాడేవి.

కన్సల్టేషన్‌రూమ్, కాంపౌండర్‌గది, నర్సులుండేగది, రిసెప్షన్‌రూమ్. పేషెంట్ల కోసంవచ్చే మనుషులు కూర్చోవడానికి ఫోమ్ సోఫాలు, గ్లాస్ టీపాయ్‌లమీద కాలక్షేపానికి చదువుకొనే తెలుగు, ఇంగ్లీషు పత్రికలు, అధునాతన ఎక్విప్‌మెంటుతో, పరికరాలతో, విశాలంగా, నీట్‌గావున్న ఆపరేషన్ థియేటర్-ఇన్ని హంగులూ, ఆర్భాటాలూ ఆ నర్సింగ్‌హోమ్‌కు ఉండబట్టి టవున్లోనూ, చుట్టుపక్కల గ్రామాల్లోనూ ఎంతోమందిని ఆకర్షించింది. అదీగాక మల్లికార్జున్ హస్తవాసి మంచిదనే పేరుపడింది. టవున్లో ఇద్దరు డాక్టర్లు 'లాభంలేదు' అని పెదవి విరిచిన ఒక రోగినీ తన ట్రీట్‌మెంట్‌తో బతికించి బట్టకట్టించాడు. ఓవర్‌డ్రింకింగ్ వల్ల లివర్ పూర్తిగా చెడిపోయి మృత్యుముఖంలోవున్న ఓ ప్రముఖ పారిశ్రామిక వేత్తగారి ఒక్కగానొక్క కొడుకుని బతికించి మళ్ళీ జీవితంలో విస్కీ, బ్రాందీలమొహం చూడకుండా చేశాడు. ఒక లవ్ ఎఫెయిర్‌లో ఇరుక్కొని, ప్రేమికుడు మరో యువతిని పెళ్ళిచేసుకొంటూ శుభలేఖ పంపగా, జీవితంపై విరక్తిపుట్టి ఆత్మహత్యకు సీసాడు స్లీపింగ్ పిల్స్ మింగిన ఓ కాలేజీ విద్యార్థినిని బతికించాడు.

అట్లా ఎన్నో కేసుల్ని. నయంచేయడంతో డాక్టర్ మల్లికార్జున్ పేరు అనుకొన్న దానికంటేముందుగా పాపులర్ అయింది. ఆర్థికంగా అన్ని వర్గాలకి చెందినవాళ్లూనర్సింగ్‌హోమ్‌కురాసాగారు. నాన్న ప్రారంభోత్సవం చేసిన అల్లుడి




నర్సింగ్‌హోమ్ మూడు మాసాల్లో నే మంచిపేరు తెచ్చుకుని ఆనోటా ఆనోటా పాకిపోవడంతో నాన్న ఎంతో మురిసిపోయాడు. అయితే పేరూ ప్రాక్టీసూ ఉన్నంతజోరుగా డబ్బు రావడంలేదు.

రోగుల దగ్గర్నుంచి డబ్బు రాబట్టడంలో మల్లికార్జున్ కచ్చితంగా వుండలేకపోతున్నాడు. బిల్లు వందరూపాయలుంటే- "బాబుగారూ! నేను పేదోణ్ని, రెక్కలమీద బతికేవోణ్ణి. అంత ఇచ్చుకోలేను. ఈ ఇరవైరూపాయలతో సరిపెట్టుకోండి బాబుగారూ! మీమేలు జన్మలో మర్చిపోను" అని ఎవరైనా రెండుచేతులు జోడించి నమస్కారంచేస్తే ఇచ్చినంతే పుచ్చుకొనేవాడు.

ఒకరోజు నాన్న ఉండబట్టలేక తనతో అన్నాడు. "అమ్మాయ్! నర్సింగ్ హోమ్‌ను గురించి నువ్వేమైనా పట్టించుకుంటున్నావా?"

తనకి అర్థంకాలేదు.

"ఏం?" అంది అమాయకంగా.

"నున్నకు నున్న హళ్ళికి హళ్ళి లాగావుంది అల్లుడుగారి ప్రాక్టీసూ, వచ్చే ఆదాయం. ఖర్చులు చూస్తే కొండవీటి చేంతాడు లాగా వున్నాయి. ఆదాయం గొర్రెతోక చందంగా వుంది. ఈ లెక్కన నర్సింగ్ హోమ్ నడిపితే ఏడాదికి పదివేలు చొప్పున నష్టం వస్తుంది. పదేళ్లలో లక్ష రూపాయలకు నష్టం చేరుకుంటుంది. మనం ఏపని చేసినా మనలో ఆర్థిక దృష్టి ప్రధానంగా వుండాలి. అల్లుడిలో అది లోపించినట్టు కనబడుతూంది. నువ్వయినా చెప్పమ్మా!"

తాను ఏం చెప్పగలదు? జీవితాన్ని గురించి, జీవితవిధానాన్ని గురించి, జీవిత లక్ష్యాలను గురించి ఆయనకు కొన్ని అభిప్రాయాలున్నాయి. వాటిల్లో తాను జోక్యం కలిగించుకుంటే ఆయనకు ఇట్టే కోపం వస్తుంది.

"నువ్వే చెప్పిచూడు నాన్నా! నా నా మాటను ఆయన అంతగా ఖాతరు చేయకపోవచ్చు" అంది తను ఓ నిముషం ఆలోచించి.

నాన్న విస్తుపోయాడు.

"అదేంటమ్మా! మీ ఆయన నీ మాట వినకుండా నా మాట వింటాడా? భర్త ఏదైనా తప్పుడు మార్గాన వెళుతుంటే సరైన మార్గంలో పొమ్మని చెప్పే ధైర్యం భార్యకుండాలి. ఆ ధైర్యం భార్యకు లేదని భర్త గ్రహిస్తే తన మార్గమే సవ్యమైందని అదే మార్గంలో మరింత ముందడుగు వేస్తాడు. నువ్వు చదువుకున్న దానివి. సంస్కారం గలదానివి. విచక్షణా శక్తి ఉన్నదానివి. నేను విడమర్చి చెప్పనక్కర్లేదు" అన్నాడు నాన్న.

నాన్న చెప్పిన దాంట్లో ఎంతో నిజముందని తాను తర్వాత అనుభవపూర్వకంగా తెలుసుకుంది...

మొదట్లో కొన్నాళ్లపాటు తాను పోరంకిలోనే వుంది. మల్లికార్జున్ కూడా రోజూ ఉదయం అక్కడ నుంచే నర్సింగ్ హోమ్‌కు వెళ్లి, రాత్రి పూట వచ్చేవాడు. కాని అందువల్ల కొన్ని ఇబ్బందులు ఏర్పడ్డాయి. డాక్టరు ఆవశ్యకత ఇరవైనాలుగు గంటలూ వుండేది. ఎమర్జన్సీ కేసు వచ్చినప్పుడు టెలిఫోన్ ద్వారా నర్సు తెలియజేస్తే అప్పటికప్పుడు వెళ్లడానికి వీలుండేది కాదు. అందుచేత "విజయవాడలోనే మనం వుందాం" అన్నాడు మల్లికార్జున్ ఒకరోజు. తాను కాదనలేకపోయింది.

అయితే నాన్నకు వేరే కాపురం



పెట్టడం ఇష్టం లేదు.

"ఓ కారు కొనిస్తాను. నర్సింగ్‌హోమ్ ఎంతదూరం? పావుగంటలో వెళ్లొచ్చు" అన్నాడు నాన్న.

అప్పుడు తనకు ఆరో నెల. అమ్మ కూడా అభ్యంతరం చెప్పింది.

"అమ్మాయికి కాన్పు అయ్యేవరకూ

ఇక్కడే వుండండి" అంది అమ్మ గట్టిగా.

మల్లికార్జున్ కాదనలేకపోయాడు. అత్తామామలంటే ఆయనకు గౌరవం. వాళ్ళ మాటలకు సాధారణంగా ఎదురు చెప్పేవాడు కాదు మల్లికార్జున్.

ఓ నెలరోజుల్లోనే నాన్న పద్మినీ కారు కొనిచ్చాడు. మల్లికార్జున్ రోజూ ఆ కారులో నర్సింగ్‌హోమ్‌కు వెళ్లివస్తూండే వాడు. వచ్చేటప్పుడు ఒక్కోరోజు అర్ధరాత్రి అయ్యేది. ఎమర్జన్సీ కేసులున్నాయని చెప్పేవాడు. తాను ఏం మాట్లాడేది కాదు.

ఒక రోజు మల్లికార్జున్ రాత్రి ఒకటి న్నరకు ఇంటి కొచ్చాడు. అంతదూరాన



...రు హారన్‌విని, తనే గేటు తలుపు తెరి ...ంది. నాన్నగానీ, అమ్మగానీ ఎక్కడ ...స్తారోనని అప్పటిదాకా తాను మేల్కొనే ...ంది. ఆయన కారు గారేజిలో పెట్టి ...కబడే అడుగులతో ఇంట్లోకొచ్చాడు. ...క్క వాసన గుప్పున కొట్టింది. తాను ...ల్కొని వుందో, నిద్రలో వుందోనన్న ...మమానం వేసేంత ఆశ్చర్యమేసింది!

బెడ్ మీద తన పక్కనే పడు కున్నాడు.

ఆ వాసన తెరలు తెరలుగావస్తోంది. ఆ వాసనను తాను ఎప్పుడూ పసిగట్టలేదు. ఆయన గంభీరంగా, ఏం మాట్లాడకుండా తప్పుచేసి పట్టుబడ్డ దోషబుద్ధితో మెదలకుండా పడుకున్నాడు, అవతలికి వొత్తి గిల్లి.

"మీనుంచిఏదో కొత్తవాసనవస్తోందే?" అంది తను.

ఆయన మాట్లాడలేదు.

మళ్లీ అడిగింది.

నిద్రనటించాడు.

కాని తను పట్టువిడలేదు. మళ్లీ మళ్లీ అడిగింది.

ఆయనకు కోపం వచ్చింది.

"అవును. ఓ ఫ్రెండ్ కొత్తగా నర్సింగ్‌హోమ్ ఓపెన్‌చేసి పార్టీ ఇచ్చాడు. అందులో నలుగురితోబాటు నేనూ ఓ పెగ్గు విస్కీ పుచ్చుకున్నాను... తప్పా?" అన్నాడు దూకుడుగా.

తనకి కళ్ళ నీళ్ల పర్యంతమైంది.

భర్త తొలిసారిగా తాగి ఇంటికొచ్చినప్పుడు భార్య పడే ఆవేదన వర్ణనకు అందదు. అట్లాంటి ఆవేదననే తాను ఆరాత్రి అనుభవించింది. పిచ్చి పిచ్చి ఆలోచనలతో తెల్లవార్లూ నిద్రపోలేదు. అమ్మకూ, నాన్నకూ తెలిస్తే? వాళ్ళ పరువు వూళ్లో ఏంకావాలి? ఫలానా వారి అల్లుడు తాగుబోతని ముద్రపడితే నాన్న వూళ్లో తలెత్తుకొని తిరగ్గలడా? ఇరుగూ పొరుగూ అమ్మలక్కలముందు అమ్మ నూడగలదా...? ఏవేవో ఆలోచనలతో తెల్లవార్లూ జాగారం చేసింది తను.

మొదటి కాన్పులో తనకు సంధ్య పుట్టింది. సంధ్య పుట్టిన మూడు నెలలకు విజయవాడలో సూర్యారావు పేటలో ఓ ప్రత్యేకమైన టూబెడ్‌రూమ్ ఇల్లు తీసుకొని వేరే కాపురం పెట్టడం జరిగింది. నర్సింగ్‌హోమ్‌కు అది రెండు ఫర్లాంగుల దూరం. నడిచి కూడా వెళ్లొచ్చు. కాని ఆయన ఎప్పుడూ కారులోనే వెళ్లేవారు. నడిచి వెళ్లే డాక్టర్ను చూస్తే రోగులకు గౌరవం వుండదు కాబోలు!

అమ్మ, నాన్న అప్పుడప్పుడూ వస్తూ వుండేవాళ్లు. అసలు నాన్న రోజూ విజయవాడ వచ్చేవాడు కాబట్టి, రెండ్రోజులకు ఒకసారైనా ఇంటికొచ్చి మంచి చెడ్డలు కనుక్కుంటూ వుండేవాడు. పనిమనిషిని పోరంకినుంచే అమ్మ పంపించింది.

తాము విజయవాడలో కాపురం పెట్టాక ఆయన పూర్తిగా చెడిపోయాడు. మొదట్లో వారానికో, రెండు వారాలకో ఓసారి డ్రింక్ తీసుకొనే ఆయన దాదాపు రోజూ మొదలెట్టాడు.

తాను అలిగింది.

ఏడ్చింది.

పోట్లాడింది.

నెత్తీనోరూ బాదుకుంది.

ఏం లాభంలేకపోయింది.

"రేపట్నుంచే మానేస్తాను"

"ఇదే ఆఖరిరోజు"

"ఈ సొసైటీలో ఇలాంటి వ్యవహారాలు తప్పవు. లేకపోతే పరిచయాలు పెరగవు"

—ఈవిధంగా ఏదో చెప్పుకుంటూ వచ్చేవాడు.

ఆయన్ను మార్చడం తనవల్ల కాదని తెల్సుకుంది. అయితే ఆయన తాగుడు అలవాటు విషయం నాన్నకు తెల్సినట్టు లేదు. ఎప్పుడూ తనముందు ఆ ప్రస్తావన తీసుకురాలేదు.

ఒకరోజు సాయంకాలం ఆయన ఇంట్లో దుకాణం పెట్టాడు. గుంటూరు మెడికల్ కాలేజీనుంచి ఒక ప్రొఫెసరూ, హైదరాబాద్ గాంధీ మెడికల్ కాలేజీ నుంచి మరో ప్రొఫెసరూ, విజయవాడలో లీడింగ్ ప్రాక్టీసుగల ఒక డాక్టరూ





డ్రాయింగ్ రూమ్‌లో కూర్చున్నారు-రెండు స్కాచ్ బాటిల్స్ పెట్టుకొని. సోడాలు, నాన్ వెజిటేరియన్ పదార్థాలూ బాయ్‌తెచ్చాడు. అతనే సర్వ్ చేస్తున్నాడు.

వాళ్ళంతా ఇంటికొచ్చిన అయిదు నిముషాల తర్వాత మల్లికార్జున్ ఇంట్లోకి వచ్చి తనని అడిగాడు.

"ప్రియా! ఇవాళ మనింటికి చాలా గొప్పగొప్పవాళ్లు వచ్చారు. ఎప్పుడూ రారు. నాకు కావాల్సినవాళ్లు. తీర్థ ప్రసాదాలతో వాళ్ళకు మర్యాద చేయాల్సిన డ్యూటీ నాపైన వుంది. ఇంట్లో డ్రింక్‌పార్టీ పెడుతున్నాను. నువ్వు పర్మిషన్ ఇవ్వాలి"

తాను కోపంతో వణికిపోయింది.

"వీల్లేదు" అంది-ఆ కోపాన్ని గొంతులో ప్రదర్శిస్తూ.

"ఎందుకని?" అన్నాడు మల్లికార్జున్.

"నాకసహ్యం. ఇష్టంలేదు. వాళ్లు ఎంత పెద్దవాళ్ళయినా, తాగుబోతులు తాగుబోతులే" అంది కఠినంగా.

"నా గురువులు, స్నేహితులకు సచ్ఛీలతో మర్యాద చేయడం నా ధర్మం. మాటవరసకు నిన్ను పర్మిషన్ అడిగానుగానీ నీ ఇష్టానిష్టాలతో నాకు పనిలేదు. ఇంట్లోనే వాళ్లకు డ్రింకు ఇచ్చి తీరాల్సిందే" అంటూ డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్లాడు మల్లికార్జున్.

తనకు తాటి ప్రమాణాన కోపం, ఉక్రోషం, ఉద్విగ్నత వచ్చాయి. ఏం చేయలేక అశక్తతను తిట్టుకుంటూ ఏడుస్తూ బెడ్‌పై బోర్లా పడింది.

గ్లాసుల మోత-

సోడాలు ఓపెన్ చేయడం-

నవ్వులతో ఛీర్స్ చెప్పుకోవడం-అంతా వింటూనే వుంది. కాని ఏం చేయగలదు-కన్నీటిలో దిండుని తడపటంతప్ప.

అదే సమయంలో బయట బజర్ మోగింది.

తాను వినలేదు. విన్నా పట్టించుకోలేదు.

మూడు నిముషాల తర్వాత "అమ్మాయ్!" అన్న నాన్న గొంతు వినబడింది.

ఉలిక్కిపడి, చివుక్కున లేచింది. అవాక్కయి స్తంభించిపోయింది. ఆవేళప్పుడు నాన్న ఇంటికెప్పుడూ రాడు.

తను దిగ్భ్రాంతితో తల్లకిందులైపోయింది.

డ్రాయింగ్‌రూమ్‌లో కొనసాగుతూన్న తాగుడు తంతును నాన్న చూసి వుంటాడు. అందుకే ఆయన పిలుపులో అంత గాంభీర్యం తొణికిసలాడింది.

పరువు ప్రతిష్ఠలకు ప్రాణాన్ని సహితం లెక్కచేసే మనిషికాదు నాన్న. తాగుడు, జూదం, వ్యభిచారం-ఇలాంటి వ్యసనాల్ని ద్వేషించే వ్యక్తి. సమాజంలో మనిషి విలువల్ని ఆ వ్యసనాలు హీనస్థితికి దిగజారుస్తాయని ఆయన విశ్వాసం. కుటుంబంలో ఏవ్యక్తి ఎలాంటివ్యసనానికి బానిసైనా ఆయన సహించలేరు. అట్లాంటి పెద్దమనిషి సమాజంలో గౌరవంగల వ్యక్తి అల్లుడు ఇంట్లో మందుపార్టీ జరగడమా? నాన్న చూసి ఏమనుకున్నాడు? తన అల్లుడు ఎంత నీచస్థితికి దిగజారాడో, తన కూతురు బతుకు ఎంత దయనీయస్థితికి వచ్చిందో అంచనావేసి ఉండడా? ఇలాంటి దుర్భర దృశ్యాన్ని తాను చూడవల్సిన ఖర్మ పడుతుందని కలలోనయినా అనుకొని ఉంటాడా? ఆయన కుటుంబ సంప్రదాయం, వంశచరిత్ర, ఆచార వ్యవహారాల విశిష్టత, శీల సంపద,

మర్యాదా మన్నన- ఇవన్నీ అల్లుడి దుష్ప్రవర్తన వల్ల మురుక్కాలువ పాలు కావల్సిందేనా? ఈ తప్పు డాక్టర్ మల్లిఖార్జున్‌ది కాదు- ఆయన భార్య అయిన తనది. తన ఉదారత్వంవల్ల, నిర్లిప్తతవల్ల, భర్తను అదుపులో పెట్టుకోలేని అసమర్థతవల్ల- ఈ ఘోరం జరుగుతున్నది. దీని కంతటికీ తనే కారణం..., తనే కారణం! తను పిచ్చి ఆవేశం కోపోద్రేకాల నూటఆరు డిగ్రీల ఉష్ణోగ్రతలో రెచ్చిపోయింది. శరీరమంతా కంపించి, మెదడు మొద్దుబారింది. తాను ఏం చేయబోతున్నదో, ఏది మంచో, ఏది చెడో, ఎట్లా నడుచుకోవాలో, ఎట్లా నిగ్రహించుకోవాలో, ఏది మర్యాదో, ఏది అమర్యాదో ఏమీ ఆలోచించలేని ఆవేశపు స్థితిలో చకచకా డ్రాయింగ్ రూమ్‌లోకి నడిచి వెళ్ళింది.

ప్రొఫెసర్లూ, మేధావులూ, గొప్పవారూ జోక్స్‌తో, నవ్వులతో, ఎరుపు ఎక్కిన కళ్ళతో, సిగిరెట్ల పొగతో మస్తిష్కాలకు నిషా ఎక్కిస్తున్నారు. ఆ దృశ్యానికి ఒంటినిండా తేళ్లూ, మండ్రగబ్బలూ పాకినట్లయింది.

వాళ్ళముందు కదిలివచ్చిన కనకదుర్గలా తాను ప్రత్యక్షమైంది.

అందరూ తన భీకర రూపాన్ని చూసి అప్రతిభులయ్యారు.

భర్త మొహం ఎట్లావుందో తాను చూడలేదు.

టేబుల్ మీదున్న బాటిల్స్‌నూ, గ్లాసుల్నీ, ప్లేటనూ విసిరికొట్టింది. అవి మొజాయిక్ ఫ్లోర్‌మీదపడి పగిలిపోయాయి. గాజు పెంకులు, ముక్కలు చెల్లాచెదురయ్యాయి. సీసాల్లోని, గ్లాసుల్లోని విస్కీ నేలపాలయింది. ప్లేట్లు చప్పుడు చేశాయి.

"ప్రియా!" అంటూ మల్లికార్జున్ వీరావేశంతో గావుకేక పెట్టాడు.

అక్కడున్న మేధావులు అనుకోని ఆ విపరీత సంఘటనకు దిగ్భ్రాంతులై ఒకరి మొహాలు మరొకళ్లు రెప్పలార్పకుండా చూసుకున్నారు.

నిశ్శబ్దం నీలుక్కుపోయింది.

నాన్న అక్కడికొచ్చి డైనింగ్ టేబుల్ పక్కన నిలబడ్డాడు. ఆయన మొహాన్ని తను చూడలేకపోయింది. గబగబా బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి, బెడ్‌పైన బోర్లాపడుకొని భోరున ఏడ్చింది.

పది నిముషాల తర్వాత నాన్న గదిలోకి వచ్చాడు.

"ఎంతపని చేశావమ్మాయ్! పిచ్చి ఆవేశానికిది సమయంకాదు. సీసాలు పగలగొడితే అలవాట్లు అంతరించిపోవు. వాళ్ళు బాగా చదువుకున్న వాళ్లు. సమాజంలో మేధావంతులుగా చెలామణి అవుతున్నారు. వాళ్ళ మనస్సుల్లో మార్పు రావాలిగానీ, మన మర్యాదను మంట గల్పుకోరాదు" అన్నాడు నాన్న.

తాను ఏడుస్తూనేపడుకొంది. ఎప్పటికో నిద్రబోయింది.

ఎవరి దారిన వాళ్లు వెళ్ళిపోయారు.

నాన్న కూడా వెళ్ళిపోయాడు.

మల్లికార్జున్ నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళిపోయాడు.

తెల్లవారాకగానీ తాను గ్రహించలేదు- వెర్రి ఆవేశంలో తాను చేసిన మూర్ఖపు పని.

ఆరోజునుంచీ మల్లికార్జున్‌లో పెద్ద మార్పు వచ్చింది. తనతో కొన్నాళ్ళు మాట్లాడటం మానేశాడు. ఇంట్లో తక్కువ




సేపు ఉండసాగాడు. ఎక్కువగా నర్సింగ్ హోమ్‌లోనే గడపసాగాడు. ఒక్కోరోజు లంచ్‌కి కూడా ఇంటికొచ్చేవాడుకాదు. రాత్రుళ్లు ఆలస్యంగా ఇంటికి రావడం మొదలెట్టాడు. క్లబ్‌కెళ్ళడం అలవాటు చేసుకున్నాడు. పేకాటలోకి దిగాడు. రోజూ తాగేవాడు.

ఆ మరుసటి సంవత్సరం కిరణ్ పుట్టాడు.

ఆయన అలవాట్లలో మార్పులేదు.

యూట్రస్ క్యాన్సర్ వచ్చి సంవత్సరం స్నర తర్వాత అమ్మ చనిపోయింది.

ఆ తర్వాత ఆర్నెల్లకు హార్ట్‌ఎటాక్‌తో నాన్న పోయాడు.

తాను డాక్టర్ మల్లికార్జున్ భార్యగా మిగిలిపోయింది.

ఆయన ప్రాక్టీసు మూడుపువ్వులూ ఆరుకాయలుగా వుంది.

వెయ్యిగజాల స్థలంలో పెద్ద భవంతి కట్టాడు. అందులో తనూ, సంధ్య, కిరణ్ వుంటున్నారు.

భూతభవిష్యత్ వర్తమాన కాలాల చట్రంలో బిగిసిన తన జీవితాన్ని గురించి అలా సింహావలోకనం చేసుకుంటూనే ప్రియంవద నిద్రపోయింది.

## 4



టెలిఫోన్ మోగింది.

మల్లికార్జున్‌కు మెలకువ రాలేదు.

టెలిఫోన్ మోగుతూనే వుంది.

ప్రియంవదకు మెలకువరాలేదు.

టెలిఫోన్...

చివ్వున లేచింది ప్రియంవద. మొదట్లో కలలో టెలిఫోనేమో అనుకుంది. కాని నిజంగానే సోఫా పక్కన టీపాయ్ మీదున్న టెలిఫోన్ ఎడతెరిపి లేకుండా మోగుతోంది.

రిసీవర్‌ను తీసుకుంది ప్రియంవద.

"హలో"

అవతల ఒక స్త్రీ గొంతు.

"ఉన్నారు. నిద్రలో వున్నారు"

"..."

"...."

"మీ పేరు చెప్పండి"

"..."

"అర్జంట్ కేసా?నిద్ర లేపమంటారా... తప్పదా?"

రిసీవర్‌ను కుడి చేత్తో పట్టుకొని మల్లికార్జున్‌ను ఎడంచేత్తో తట్టి లేపింది ప్రియంవద.

అతను విసుక్కుంటూ లేచాడు. రిసీవర్ను అందుకున్నాడు.

"హల్లో"

"..."

"ఓహో... అహ! వెంటనే రమ్మంటారా ... తప్పదా? అంత సీరియస్సా? సరే...డాక్టరీ వృత్తిలోకి దిగాక అర్ధరాత్రయినా, అపరాత్రయినా, తెల్లవారుజామైనా పేషెంట్ల కోసం రాక తప్పుతుందా? వస్తాను ... పదినిముషాల్లో" అంటూ మల్లికార్జున్ రిసీవర్ను భార్యకు అందించాడు.

దీర్ఘంగా ఆవులించి. వొళ్లు విరుచుకుని, చేతులు ఝాడించి, సోఫాలోంచి లేచాడు డాక్టర్ మల్లికార్జున్.

"బయటికెళ్లాలా?" అంది ప్రియంవద తానూ లేస్తూ.

"వెళ్లాలి. అవతల ఒక పేషెంట్‌కు గుండెపోటు అట. ఆలస్యం చేస్తే గుండె ఆగిపోవచ్చు" అంటూ గదిలోకి వెళ్ళి మెడికల్ కిట్ తీసుకొని గబగబా వెళ్లాడు మల్లికార్జున్.

అతని కారు బయటికెళ్ళాక గేటు వేసి, తలుపు బోల్టువేసి ఇంట్లోకి వచ్చింది ప్రియంవద. పిల్లల గదిలోకి వెళ్ళి కిరణ్‌ను కావలించుకొని పడుకుంది.

'ఏం ప్రాక్టీసో పాడో! ఎవరు ఫోన్ చేసినా పెళ్లాం, పిల్లల్ని వదిలి వెంటనే వెళ్ళిపోవాలి. ఆ ఫోన్లు చేసేవాళ్ళకు అర్ధాంతరంగానే రోగాలు వస్తాయి కాబోలు. డాక్టరనే వ్యక్తికి భార్య, పిల్లలు వుంటారనీ, వాళ్లు రాత్రుళ్లు అందరి మానవుల్లాగానే నిశ్చింతగా, విశ్రాంతిగా నిద్రపోవాలనే జ్ఞానం వాళ్ళకెందు కుండదు?' అనుకుంది ప్రియంవద.

* * *

తెల్లవారుఝామున మూడుగంటలవేళ.

డాక్టర్ మల్లికార్జున్ కారు ఏలూరు రోడ్డు మీద దూసుకుపోతోంది. రోడ్లన్నీ ట్రాఫిక్‌లేక నిద్రపోతున్నాయి - అటూ ఇటూ వున్న వీధి దీపాలు కాపలా కాస్తుండగా. ఇంకా హోటళ్ళ తలుపులు తెరుచుకోలేదు. రోడ్డు పక్కన అక్కడక్కడా రిక్షావాళ్ళు రిక్షాలు ఆపుకొని, వాటిల్లో కాళ్లు ముడుచుకుని పడుకొని నిద్రపోతున్నారు.

గవర్నరుపేట సెంటరునుంచి మలుపు తిరిగి వంతెనమీదుగా గాంధీనగర్ వైపు మళ్ళించాడు కారు. రోడ్డుమీద ఒక్కడూ లేడు. రెండు క్రాస్ రోడ్లు దాటాక మూడో క్రాస్ రోడ్డులో ఎడంపక్కకు తిప్పి ఒక డాబా ముందు పేవ్‌మెంట్ పక్కన కారు ఆపాడు మల్లికార్జున్. ఆ డాబాలోకి కారుపోయే గేటులేదు. ముందు చిన్న ఇనపగేటు వుంది. ఆ గేటులోంచి మనుషులు మాత్రమే ఇంట్లోకి పోవచ్చు.

ఆ గేటు మీద చిన్న బోర్డు వుంది. దానిమీద 'అఖిలేశ్వరీదేవి' అని మాత్రమే వుంది. డిగ్రీగాని, డిజిగ్నేషన్‌గాని ఏమీ లేవుగానీ అఖిలేశ్వరీదేవి తెలియనివారు లేరు. ఆమె సంఘసేవకురాలు. ఆ వార్డులో మునిసిపల్ కౌన్సిలర్‌గా రెండుసార్లు ఎన్నికైంది. పట్టణ పార్టీకి సెక్రటరీ. అయితే ఎం.ఎల్.ఎ.గా ఎప్పుడూ నిలబడ లేకున్నా ప్రభుత్వంలో ఆమెకు మంచి పలుకుబడివుంది. వారానికోసారైనా కారులో రాజధాని నగరం వెళ్ళివస్తూ వుంటుంది. ఆ జిల్లాకు చెందిన మంత్రి దగ్గర, మరో ఇద్దరు ముగ్గురు మంత్రుల దగ్గర ఆమెకు మంచి పలుకుబడివుంది. అధికార్లను బదిలీలు చేయించడంలోనూ, లైసెన్సులు, పర్మిట్లూ సంపాయించడంలోనూ ఆమె ఘటికురాలు. బి. ఏ. చదివింది. యల్.యల్.బి. ఓ సంవత్సరం చదివి మానేసింది. లాయర్‌గా స్థిరపడాలని ఆమె జీవితాశయం. కాని ఆ జీవితాశయాన్ని వచ్చే జన్మకు వాయిదా వేసుకుంది.

అఖిలేశ్వరీదేవి భర్త వామనమూర్తికి ఓ రెడీమేడ్ దుస్తులషాపు వుంది. అతనూ బి.ఏ.దాకా చదువుకున్నాడు. ఉద్యోగం దొరక్కపోవడంతో, ఈ రోజుల్లో 'వ్యాపారం పురుషలక్షణం' అనే ధ్యేయంతో తక్కువ పెట్టుబడితో ఆ షాపు తెరిచి క్రమేణా అభివృద్ధిచేసుకున్నాడు.

పేరుకు ఇద్దరూ భార్యాభర్తలేగాని రోజులో వాళ్లు ఇంట్లో మొహామొహాలు




చూసుకొనే సమయం బహుతక్కువ. వామనమూర్తి అక్షరాలా చిల్లర వ్యాపారి. అఖిలేశ్వరి తన జీవితాన్ని సమాజసేవకు అంకితంచేసి ఆ టవున్లో పది కాలాలపాటు ప్రజల మనసుల్లో నిలిచిపోవాలనే కాంక్షగల స్త్రీ. ఊళ్ళో ఏ దుర్ఘటన జరిగినా ఆమె రంగంలోకి దిగి తన సేవాతత్పరతను చాటుకుంటూ వుంటుంది. అగ్నిప్రమాదం జరిగితే బాధితుల సహాయనిధిని వసూలుచేసి పునరావాసానికి తోడ్పడుతుంది. మురికి వాడల అభివృద్ధి సమితికి ఆమె అధ్యక్షురాలు. ఏ పేటలో మంచినీటి ఇబ్బంది వచ్చినా, ఏ పేటలో రోడ్లు సరిగ్గా లేకపోయినా పట్టణపౌరులకు తోడ్పడుతుంది.

ఏదో పనిమీద రోజూ ఆమె ఇంటికి అనేక రకాలైన మనుషులు అనేక రకాలైన పనులకోసం, సహాయాలకోసం, సిఫార్సుల కోసం వస్తూనేవుంటారు. ఇంటికొచ్చిన వాళ్ళందరికీ వాళ్ళ వాళ్ళ సాంఘిక, ఆర్థిక స్థాయిల ప్రకారం కాఫీ, టీ, 'ఓవల్టీన్' కూల్ డ్రింక్స్ ఇస్తూనే వుంటుంది.

ఎదుటివాళ్ళను నమ్మించేటట్లుగా, తానుచెప్పింది మంత్రముగ్ధులై వినేటట్లుగా, పని తాను కోరింది చేసేటట్లుగా మాట్లాడటం ఆమెకి వున్న గొప్ప వరం. వేదిక ఎక్కితే రాజకీయాల్ని వృత్తిగా పెట్టుకొని బతికేవాళ్ళకంటే ఘనంగా, అనర్గళంగా మాట్లాడగలదు. సమాజంలో స్త్రీకి జరుగుతూన్న అన్యాయాల దగ్గర్నుంచీ అంతర్జాతీయంగా రాజకీయాల్లో ప్రస్తుతం ఏర్పడుతూన్న పరిణామాలవరకూ ఆకుకు అందకుండా పోకకు చెక్కు చెదరకుండా మాట్లాడగలదు. పదిమందిలో కులాసాగా కబుర్లకు దిగితే ఏ సబ్జక్టుమీదనైనా సజీవంగా, హాస్యోక్తులతో, సంభాషణా చాతుర్యంతో మాట్లాడుతుంది.

ఆమె సంపాదన గురించి టవున్లో అనేకమంది అనేక రకాలుగా అనుకుంటూ వుంటారు.

వాళ్ళకి వీళ్ళకి తన పలుకుబడితో లైసెన్సులు, పర్మిట్లు, కాంట్రాక్టులు ఇప్పించి అందులో కొంత కమీషన్ పుచ్చుకొంటుంది.

అధికార్ల బదిలీలకు అయిదువందల దగ్గర్నుంచీ, వెయ్యిరూపాయల వరకూ పదవి స్థాయినిబట్టి తీసుకుంటుంది.

వరద బాధితులు, అగ్నిబాధితులు మొదలైనవారి సహాయ నిధులకోసం వసూలుచేసే మొత్తాల్లో పదిశాతం సొంత ఖర్చులకు మిగుల్చుకుంటుంది.

మూడేళ్ళక్రితం ఆమె ఒక ఇంగ్లీష్ మీడియమ్ కాన్వెంట్ పెట్టింది. ఒక పెద్ద బిల్డింగ్‌ను అద్దెకు తీసుకొని విద్యాశాఖా మంత్రిని, డైరెక్టర్ ఆఫ్ స్కూల్ ఎడ్యుకేషన్‌ని పిలిపించి ఆ కాన్వెంట్‌కు గొప్పగా ప్రారంభోత్సవం చేయించింది. ఆ ప్రారంభోత్సవానికి ముగ్గురు ఎం.ఎల్.ఏలనూ, ఇద్దరు ఎం. ఎల్.సి.లను, పట్టణంలోని అనేకమంది ప్రముఖుల్ని పిల్చింది. ఆ కాన్వెంట్‌ను స్థాపించిన సంవత్సరంలోనే నూటయాభైమంది స్టూడెంట్స్ చేరారు. మొదట్లో ఉచితంగా స్టూడెంట్ మెరిట్ మీద చేర్చుకున్నా, తర్వాత తర్వాత బిల్డింగ్ ఫండ్ నెపంతో ఒక్కొక్క స్టూడెంట్‌కు అయిదువందల రూపాయలు డొనేషన్ తీసుకొన్నదని కొంతమంది చెప్పుకున్నారు. ఆ కాన్వెంట్ నిర్వహణలో ఆమె రెండు చేతులా డబ్బు వెనకవేస్తు

న్నదని కొంతమంది అగుబ్బుగా చెప్పుకో పడంలో ఆశ్చర్యంలేదు.

అఖిలేశ్వరీ దేవికి భగవంతుడు మరో పరం ఇచ్చాడు. అది ఆమె పర్సనాలిటీ. సహజంగా ఆమె సౌందర్యవతి. అందుకు రెట్టింపుగా సౌందర్య పోషకాలతో ఆ సౌందర్యానికి మెరుగులుదిద్దుతూ, తా తెల్లగులాబిలా వుంటుంది. వయసు ముప్ఫైరెండేళ్ళు మాత్రమే.

అఖిలేశ్వరీదేవి తన అపూర్వ సౌం ర్యాన్ని, ఆకర్షణీయమైన లావణ్యాన్నీ ఉపయోగించి కొంతమంది దగ్గర అసాధ మైన పనుల్ని సాధించుకొస్తుంగని కూడ కొంతమంది అనుకుంటారు.

స్త్రీ పాతివ్రత్యంపట్ల ఆమెకు సనాత భావాలులేవు. లాడ్జీల్లోనూ, ఇళ్ళల్లోను



పర పురుషుల సాంగత్యంలో పు స్త్రీలను పోలీసులు వ్యభిచార నిరో చట్టంకింద పట్టుకొని స్టేషన్‌కు తీసుకె ఆమె తన పలుకుబడితో వాళ్ళను వెనే విడుదల చేయించిన దృష్టాంతా లున్నాయి.



తన భార్యను గురించి వామనమూర్తి ఎప్పుడూ పట్టించుకోడు.

"మీఆవిడ రాత్రి పదకొండుగంటలకు స్టేట్ గెస్టహౌస్‌లో మంత్రిగారి రూమ్‌లోకి వెళ్ళడం చూశాను" అని ఒక మిత్రుడు చెబితే, నిర్లిప్తంగా చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

"మీ ఆవిడకు హైద్రాబాద్‌లో ద్వారకా హోటల్లో పర్మినెంట్‌గా ఒక రూమ్ వున్నట్టుంది. ఆ రూమ్‌లోకి పగలూ రాత్రీ ఎవరెవరో వస్తూపోతూంటారు" అని మరో మిత్రుడు ప్రత్యక్షంగా చూసిన విషయం చెబితే, "దాండేముంది? ఆమెతో పని వున్నవాళ్ళు వస్తూ పోతూవుంటారు.

ఆమె జీవితవిధానం వేరు. నా జీవిత విధానం వేరు. ఒకళ్ళ జోలికొకళ్ళం మరొకళ్ళం పట్టించుకోం" అన్నాడు వామనమూర్తి.

తన భార్య గురించి ఎవరైనా చెడుగా చెప్పినా, మంచిగా చెప్పినా 'తనకేం సంబంధంలేదు' అన్నట్టు చిరునవ్వు నవ్వటాన్ని అతను అలవాటు చేసుకున్నాడు.

డాక్టర్ మల్లికార్జున్‌కు అఖిలేశ్వరీ దేవితో పరిచయమై సంవత్సరమే అయింది. ఆ పరిచయం అర్నెల్లలో కొమ్మలూ రెమ్మలుగా వృద్ధిచెంది మనస్సులూ, శరీరాలూ కల్సేంత ప్రగాఢమైంది.

ఒకరోజు సాయంకాలం ఆరుగంటల ప్రాంతంలో ఒక మెడికల్ జర్నల్‌లో లివర్‌కాన్సర్‌కు గల కారణాల్ని గురించి ఒక వ్యాసం చదువుకుంటూ వుంటే హఠాత్తుగా ప్యారిస్ పెర్‌ఫ్యూమ్ సువాసన గుప్‌మంది. ఆశ్చర్యంగా డోర్‌కేసి చూశాడు.

స్వింగ్‌డోర్‌లోంచి తెల్లటి హైహీల్స్‌ను ధరించిన పాలజాతి లాంటి పాదాలు కనబడ్డాయి. ఆ పాదాలకు వెండి పట్టాలు వున్నాయి. ఆపైన సంపెంగపువ్వు రంగు వెంకటగిరిచీర అరచేతివెడల్పు బోర్డరుతో వెండిజరీ చీర కుచ్చెళ్ళు.

ఎవరో పేషెంటు తనకోసం వచ్చిందనుకొని, 'కమిన్' అన్నాడు డాక్టర్ మల్లికార్జున్.

దివినుండి భువికి దిగివచ్చిన దేవతలా లోపలకొచ్చింది స్ప్రింగ్‌డోర్ తెప్పుకొని ఓ అందమైన, ఆరోగ్యమైన, ఆకర్షణీయమైన, ఆహ్లాదకరమైన స్త్రీ. ఆమెవెంటే ఓ పద్దెనిమిదేళ్ళ యువతి కూడా లోపలికొచ్చింది.

"కూర్చోండి"

ఆమె కూర్చుంది.

ఆమె వెంటవచ్చిన యువతి ఆమె కనుసైగ చేసిన తర్వాతనే కూర్చుంది. ఆ యువతి అంత అందంగాలేదు. సన్నగా ఎండిన మొక్కకు కాటన్‌చీర కట్టినట్టుగా ఉంది.

గదిలో మరెవ్వరూలేరు.

కాంపౌండరు పక్కగదిలో మందు సీసాలు సర్దుతున్నాడు.

రూమ్‌నంబర్ టెన్‌లో ఒక సిజేరియన్ డెలివరీ జరిగిన స్త్రీకి టెంపరేచర్ చూడటానికి నర్సు వెళ్ళింది.

బయట డాక్టరుకోసం నిరీక్షిస్తున్న రోగులున్న అలికిడేమీ లేదు.

ఆమెకేసి చూశాడు డాక్టర్ మల్లికార్జున్.

విండో గ్లాస్ నుంచి సాయంకాలపు సూర్యుని ఆఖరి ఎండపొడ పడుతోంది. ఆ పొడకు బంగారుఛాయలో ఏపిల్‌పండు రంగులో వున్న కుడిబుగ్గ మెరుస్తోంది. చెవిరింగు యొక్క బంగారునీడ ఆ బుగ్గపై మనోజ్ఞమైన రూపును కల్పిస్తోంది.

డాక్టర్ మల్లికార్జున్ పెదాలు కదల్చకుండానే కళ్ళతో ఆమె అందాన్నీ, వయస్సునూ, లావణ్యాన్నీ అంచనా వేస్తున్నాడు.

ఆ యువతి బెదురుచూపులుచూస్తోంది– అప్పుడే జంతుప్రదర్శనశాలలోకి పట్టుకు రాబడ్డ లేడిపిల్లలాగ.

"నా పేరు వినేవుంటారు" అందామె డాక్టర్ మల్లికార్జున్ కళ్ళలోకి నిలువుగా చూస్తూ.

డాక్టర్ మల్లికార్జున్ కొంచెం కంగు తిన్నాడు. ఆమె పేరు అతను వినలేదు, అంతకు ముందెప్పుడూ ఆమెను




చూడలేదు.

"అఖిలేశ్వరీదేవిని. మున్సిపల్ కౌన్సిలర్‌ను. అన్నింటికంటే ముఖ్యం ఈ టవున్లో సోషల్‌వర్కర్‌ను. స్త్రీ పురుషులు,యువతీయువకులు,ఉన్నవారు, లేనివారు ఎవరు ఎలాంటి ఇబ్బందుల్లో వున్నా ఆ ఇబ్బందుల్ని తొలగించడానికి శక్తివంచన లేకుండా తోడ్పడటమే నా జీవితధ్యేయం. ఈ పట్టణంలో నన్ను చూడనివాళ్ళు వుంటే వుండొచ్చుగానీ, నాపేరు విననివాళ్ళు బహు అరుదు. మీరు నర్సింగ్‌హోమ్ తెర్చి ఎక్కువకాలం అయినట్టులేదు. ఏమైనా ఎదుటివారి టైం వేస్ట్ చేయడం నాకు నచ్చదు. మన దేశంలో పొరుగింటికెళ్ళి మంచినీళ్ళు అడగటానికి పది నిముషాలపాటు తమని గురించీ, తమ కులగోత్రాదుల్ని గురించి, తమ కుటుంబపు పుట్టుపూర్వోత్తరాల్ని గురించి చెప్పిగానీ మంచినీళ్ళు అడగరు. నాది ఆ తత్వంకాదు. వచ్చిన పనిచెప్పి, చేయించుకుపోవడమే నా పద్ధతి" అంది అఖిలేశ్వరీదేవి.

"మీరొచ్చిన పని?" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్.

"బస్సుస్టాండ్‌కు ఎందుకెళతాం? బస్సెక్కడానికి. రైల్వేస్టేషన్‌కు ఎందుకెళతాం? రైలెక్కడానికి. అలాగే డాక్టర్ దగ్గరకు ఎందుకు రావడం? వైద్యం కోసం. అయితే నాకు జబ్బేమీలేదనుకోండి. ఇతరులకోసం పాటుబడటమే నాజబ్బు. ఈ అమ్మాయిని చూడండి. పాపం పేదపిల్ల. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళూ అని నమ్మే అమాయకురాలు. బి.ఎ. ఫైనలియర్ చదువుతోంది. ఓ అబ్బాయిని ప్రేమించింది. ఆ అబ్బాయి పెళ్ళిచేసుకుంటానని ప్రమాణాలు చేశాడు. ఏడుకొండలవాడిసాక్షిగా చేతిలో చేయివేశాడట. మగవాడి మాటలకు ప్రతి దశలోనూ స్త్రీ ఈ ప్రపంచంలో మోసపోతుంది. చెల్లిగా, భార్యగా, తల్లిగా కసాయివాణ్ని మేక నమ్మినట్టుగానే పురుషుణ్ని స్త్రీ నమ్ముతుంది. ఆవిషయం మగవాళ్ళకంటే ఆడవాళ్ళకే ఎక్కువ తెలుసు అనుకోండి. ఈ అమ్మాయి ఆ కుర్రవాడి తియ్యటి కబుర్లు నమ్మి, తన శరీరం మీద స్త్రీత్వపు హక్కుల్ని ఓ రోజు వదులుకుంది. ఫలితంగా నెల తప్పడం... ఇది సింపుల్ లవ్ స్టోరీ. కాని దీనివెనుక ఈ పిల్ల భగ్న జీవితముంది. ఆ కుర్రవాడు అడ్రసు చెప్పకుండా మాయమయ్యాడు-తండ్రికి ఇక్కడినుంచి ట్రాన్స్‌ఫర్ రావడంతో. ఈ పిల్ల బావిలోదూకి ఆత్మహత్య చేసుకోబోతూంటే రక్షించాను. బతుకుపై ఆశ కల్పించాను. మగవాడి మోసానికి ఆడది ఆహుతి కాకూడదనేది నా సిద్ధాంతం. స్త్రీవల్ల మగవాడు మోసపోవచ్చు. కాని ఆ మగవాడు తన జీవితాన్ని ముగించుకోవడంలేదు. కాని స్త్రీకి ఆ దుస్థితి ఏర్పడుతున్నది. ఎందుకు? పురుష సమాజం గీసిన గీట్లు, పెట్టిన ఆంక్షలు, ప్రతిఘటించే శక్తి, బలం, ధైర్యం స్త్రీకి లేకపోవడాన. ఈ అమ్మాయి మళ్ళీ బతకాలంటే ఆ పాప ఫలాన్ని తుడముట్టించాలి. దాన్ని నామరూపాలు లేకుండా చేయాలి. ఈ అమ్మాయి నాకు బంధువుకాదు. మా వీధిలోవుండే ఓ బడిపంతులు మూడో కూతురు. తల్లిదండ్రులకు తెలిస్తే ఈ పిల్లను బతకనివ్వరు. ఈ పిల్ల బతకాలంటే, ఈ పిల్లకు బతుకు భిక్షపెట్టాలంటే, ఈపిల్ల ఎవర్నో ఒకర్ని పెళ్ళిచేసుకుని

పసుపూ కుంకుమలతో పచ్చగా బతకాలంటే మీరు సాయంచేయాలి. ఎంత డబ్బు కావాలంటే అంత యిస్తాను. ముల్లు వచ్చి అరిటాకుమీద పడ్డా, అరిటాకు వచ్చి ముల్లుమీద పడ్డా నేరం అరిటాకుదే అనే ఈ సమాజంలో ఇట్లాంటి అభాగ్యుల్ని బాగుచేయడంలో డాక్టరుగా మీకూ సామాజిక కర్తవ్యం వుందంటాను...ఏమంటారు?"

జడి వాన కురిసి ఆగినట్లయింది ఆమె మాట్లాడటం ఆపివేయడంతో.

"ఎన్నో నెల?" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ ఆ అమ్మాయిని.

ఆ అమ్మాయి సిగ్గుతో సాంఘికనేరం చేసి పట్టుబడ్డ అవమానంతో డాక్టరుగారి మొహం చూడలేక గోడవైపు చూసింది.

అఖిలేశ్వరీదేవి చెప్పింది.

ఆరోజు సాయంకాలమే నర్సింగ్ హోమ్‌లో అబార్షన్ చేయించాడు డాక్టర్ మల్లికార్జున్. అప్పటివరకూ అఖిలేశ్వరీ దేవి నర్సింగ్‌హోమ్‌లోనే వుంది.

"చాలా థాంక్స్ అండీ! ఫీజు ఎంతో చెబితే ఇస్తాను" అంటూ హాండ్‌బాగ్ తెరిచింది అఖిలేశ్వరీదేవి.

డాక్టర్ మల్లికార్జున్ చూపు ఆమె మొహంనుంచి రొమ్ములమీదకు జారింది.

"మీరు ఫీజు ఏమీ ఇవ్వనక్కర్లేదు. ఈ అమ్మాయి జీవితానికి మీరు ఒక రకంగా సహాయపడితే నేను మరోరకంగా సహాయపడ్డాను. దీనికి ఫీజు దేనికండీ! కేవలం డబ్బు సంపాదనకోసమే నేను ప్రాక్టీసు చేయడంలేదు" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్.

"మీలాంటి సహృదయులూ, సదుద్దేశపూరితులూ అయిన డాక్టర్ని ఈపట్టణంలో ఎవ్వర్నీ చూడలేదు" అంది అఖిలేశ్వరీదేవి కృతజ్ఞతాపూర్వకంగా రెండు చేతులూ ఎత్తి.

ఆమె రెండు చేతులూ ఎత్తినప్పుడు ఆమె పల్చని పైటలోంచి వక్షోజాల సైజు సవాల్ చేస్తున్నట్టుగా కనబడింది.

చూపుల్ని మల్లికార్జున్ ఒక పట్టాన మరల్చలేకపోయాడు.

తన వక్షోజాల సోయగాన్నీ, సౌందర్యాన్నీ, సైజునీ డాక్టరుగారు తీవ్రమైన తమకంతో చూస్తున్నాడని గ్రహించిన అఖిలేశ్వరీదేవి సిగ్గును నటిస్తూ, వోరగా చూస్తూ పైటను సర్దుకొంది.

ఆ తర్వాత వారం రోజులకు మళ్లీ అఖిలేశ్వరీదేవి నర్సింగ్ హోమ్‌కు వచ్చింది.

అప్పుడు రాత్రి ఎనిమిదిన్నర!

ఓసారి రూమ్స్‌కు రౌండ్‌కివెళ్లి, ఇంటికెళ్లి పోదామనుకుంటున్నాడు డాక్టర్ మల్లికార్జున్. అదే సమయంలో అఖిలేశ్వరీదేవి వచ్చింది- పాల నురుగు లాంటి తెల్లటి వాయల్ చీర, స్లీవ్‌లెస్ బ్లౌజు ధరించి, ఫారిన్ కాస్మెటిక్స్, పెర్‌ఫ్యూమ్స్‌తో యవ్వనపు మెరుపుల్ని విరజిమ్ముతూ. డాక్టరు దగ్గరకు వచ్చిన పేషెంట్‌లా లేదు ఆమె. ప్రియుని దగ్గరకు సర్వాలంకార భూషితమై వచ్చిన వన్నెల విసనకర్రలా వుందామె.

ఆమెను ఆ వేషధారణలో చూసిన డాక్టర్ మల్లికార్జున్ జ్వలితుడయ్యాడు. రెప్పార్పకుండా ఓ నిముషం పాటు ఆమెకేసే చూసి, "కూర్చోండి" అన్నాడు.

"నేను కూర్చుని కబుర్లు చెప్పడానికి రాలేదు"

"మరి?"

"పేషెంట్‌గా వచ్చాను. ట్రీట్‌మెంట్





ఇవ్వాలి మీరు"

"తప్పకుండా. అయితే అటు టేబుల్ మీద పడుకోండి"

అంగుళం ఎత్తు యూఫోమ్‌తో అమర్చిన తెల్లటి అల్యూమినియమ్ టేబుల్ ఫైడ్ పైన పడుకుంది అఖిలేశ్వరీదేవి.

టేబుల్ లైట్ వేశాడు డాక్టర్ మల్లికార్జున్.

వంద కాండిల్స్ మిల్కీ లైటు కాంతిలో ఆమె శరీర లావణ్యం అత్యద్భుతంగా వుంది. ఆమె వెల్లకిలా పడుకోవడంతో శరీరపు ఎత్తుపల్లాలు పురుషత్వాన్ని ఛాలెంజ్ చేసేట్టుగా వున్నాయి. ఆ రొమ్ములు, ముడతలు పడని నడుం, జఘనసౌందర్యం, తొడల పొందిక- తమకంగా చూస్తూ కొన్ని క్షణాలపాటు ఏం మాట్లాడలేదు డాక్టర్ మల్లికార్జున్.

"మీరు డాక్టరా, మోడల్స్ చూసి బొమ్మలువేసే ఆర్టిస్టా?" అంది అఖిలేశ్వరీదేవి నవ్వుతూ. గతుక్కుమన్నాడు డాక్టరు.

"ఏంలేదు ... నా జబ్బు లక్షణాల్ని అడక్కుండా నా శరీరాన్ని అదే పనిగా చూస్తుంటేనూ!"

"చెప్పండి....మీ జబ్బేమిటో, దాని లక్షణాలేమిటో?"

"లక్షణాలు చెబుతాను. ఆ జబ్బు పేరేమిటో మీరే చెప్పాలి.

"ఆల్ రైట్. జబ్బు లక్షణాలేమిటి?"

"తింటే ఆయాసం ... తినకపోతే నీరసం"

"ఓస్....ఇంతేనా?"

"తినాలని వుంటుంది. తినలేను"

"ఇంకా"

"నడవాలని వుంటుంది...నడవలేను"

"ఇంకా"

"వేళకే పడుకుంటాను. కాని ఎంతసేపటికీ నిద్రరాదు. ఏవేవో ఆలోచనలు నిద్రపట్టినా అరగంటకే మెలకువ వస్తుంది. ఆపైన గంట ఆలోచిస్తే గానీ నిద్రరాదు"

"ఇంకా"

"అప్పుడప్పుడూ గుండెల్లో దడ... కృష్ణా బ్రిడ్జిపై ఎక్స్‌ప్రెస్ పోతున్నట్టు"

"మరింకా"

"రెండ్రోజులకోసారి తలనొప్పి వస్తుంది. వచ్చినప్పుడల్లా గంటసేపు వుంటుంది. క్రోసిన్ వేసుకున్నా, నవాల్జిన్ వేసుకున్నా, మరేది వేసుకున్నా గంటదాకా తగ్గదు"

"ఊ!"

"ఎక్కువ తింటే అరగదు. తక్కువ తింటే ఆకలివేస్తుంది."

"ఆఁ!"

"ప్రతినెలకూ ఓసారి జ్వరం వస్తుంది. జ్వరం వచ్చేముందు జలుబు చేస్తుంది."

"జలుబు చేసేముందు ఐస్‌క్రీంగానీ, కూల్‌డ్రింక్స్‌గానీ సేవిస్తారా?"

"ఎప్పుడయినా"

"అప్పుడప్పుడూ హాట్ డ్రింక్స్ ఏమైనా తాగుతారా?"

"అప్పుడప్పుడేం కర్మ, రోజూ తాగుతాను."

ఆశ్చర్యంతో డాక్టరు మల్లికార్జున్ కళ్లు రెండు సెంటీమీటర్ల వెడల్పు అయ్యాయి.

"అంటే వేడి వేడి పాలు, టీ, కాఫీ..."

ఫక్కున నవ్వింది అఖిలేశ్వరీదేవి- డాక్టరుగారి పరిజ్ఞానపు అమాయకత్వానికి.

"అవికాదండీ...హాట్ డ్రింక్స్ అంటే విస్కీ, బ్రాందీ, జిన్, రమ్, వైన్... ఆమాత్రం మీకు తెలియద్దా?"

చిరునవ్వు నవ్వుకున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

"డ్రగ్స్ అలవాటేమైనా వుందా?"

"అంటే"

"స్లీపింగ్‌పిల్స్, మార్ఫియా, పెథిడ్రిన్ మొదలయినవి"

"ప్చ్"

"మీ వయస్సెంత?"

"ముప్పై రెండో, మూడో. ఎంత వయస్సున్నట్టు కనబడతాను" అంది అఖిలేశ్వరీదేవి వుండబట్టలేక.

"అంతే వున్నట్టు కనబడతారు."

ఆమె మొహం కొంచెంగా చిన్నబోయింది.

"పిల్లలెంతమంది?"

"ఇద్దరు. ఒకబ్బాయి, ఒకమ్మాయి."

"ఆపరేషను చేయించుకున్నారా పిల్లలు పుట్టకుండా"

"ఆఁ!"

"మీవారు ఏంచేస్తారు?"

"మావారు చేసేపనికీ, నా ఆరోగ్యానికీ సంబంధమేమిటి?" ఎదురుప్రశ్న వేసింది అఖిలేశ్వరీదేవి.

"ఏంలేదు... తెల్సుకుందామని"

చెప్పింది అఖిలేశ్వరీదేవి.

ఆమె బి.పి. చూశాడు. నార్మల్‌గానే వుంది.

నాడి పట్టుకుచూశాడు. డెంపరేచర్ ఏమీ ఉన్నట్టులేదు.

"లేచికూర్చోండి"

లేచి టేబులుమీద కూర్చుంది అఖిలేశ్వరీదేవి.

"లక్షణాలన్నీ చెప్పాను. జబ్బు పేరు చెప్పండి"

"జబ్బు పేరు ముఖ్యమా, ట్రీట్‌మెంట్ కావాలా?"

ముసిముసిగా నవ్వింది అఖిలేశ్వరీదేవి. ఆ నవ్వు అంతరార్థం బోధపడలేదు డాక్టర్ మల్లికార్జున్‌కు. ఆమెకేసి చూశాడు.

ఆమె నెమ్మదిగా పైట తొలగించింది.

జాకెట్ హుక్స్ తీసివేసింది.

జాకెట్ విప్పింది.

లోపల నల్లటి ఫారిన్ బ్రా.

బెల్ట్ వదులుచేసింది.

తెల్లగా, దూదిపింజల్లావున్న రొమ్ములు పెద్ద సైజులో.

ఆశ్చర్యంతో, రెప్పలువాలని కళ్ళతో అప్రతిభుడై చూస్తూ నిలబడ్డాడు డాక్టర్ మల్లికార్జున్.

వంద కాండిల్స్ మిల్కీ లైటుకాంతి ఆమె రొమ్ములపై బడుతూ ఆ వక్షోజాల సొగసును త్రీ-డిలో చూపుతోంది.

కాని, ఆ ప్రవర్తన ఏమిటో అతనికి అర్థం కావడంలేదు. ఆమె సెక్స్ పిచ్చితో మతిభ్రమించిన స్త్రీయా? లేక తనలో కోర్కెల్ని రేకెత్తించడానికి అట్లా అసాధారణంగా ప్రవర్తిస్తున్నదా?

రెండు రొమ్ముల మధ్య లోయలో కుడిచేతి నడిమివేలు పెట్టి చూపిస్తూ- "ఇక్కడ చూశారా?" అంది అఖిలేశ్వరీదేవి.

అక్కడ చూశాడు. పెసరగింజంత తెల్లటిమచ్చ వుంది. అది పూర్తిగా తెల్లగా లేదు. ఎరుపునుంచి తెలుపులోకి మారే దశలో వుంది.

"ఈ వైట్ స్పాట్ ఇంకా పెద్దదవుతుందంటారా?"

ఆ స్పాట్‌ను దగ్గరగా చూశాడు.

"డర్మిటాలజిస్టుకు చూపెట్టారా?"

"చూపెట్టాను"

"ఏమన్నాడు?"





"ప్రస్తుతానికి ఆగిపోయింది. తెల్లటి మచ్చలు వొళ్ళంతా వ్యాపించే ప్రమాదం లేకపోలేదన్నాడు అప్పట్నుంచీ నాకు చచ్చే భయంగా వుంది"

"ఎన్నాళ్ళయింది ఆ వైట్ స్పాట్‌ను మీరు కనిపెట్టి?"

"మూడేళ్ళయింది"

"అప్పట్నుంచీ అలాగేవుందా?"

"ఆ!"

"ట్రీట్‌మెంట్ ఏం ఇచ్చాడు?"

"కొన్నాళ్ళు ఏదో ఆయింట్‌మెంట్ రాసి సన్‌లైట్‌కు ఎక్స్‌పోజ్ చేశాను. అది పెరగలేదు. పూర్తిగా తగ్గిపోలేదు"

డాక్టర్ మల్లికార్జున్ వాటర్ సింక్ దగ్గరకెళ్ళాడు. చేతుల్ని సబ్బుతో వాష్ చేసుకొని, నాప్‌కిన్‌తో తుడుచుకున్నాడు.

ఈ లోపల అఖిలేశ్వరీదేవి జాకెట్టు వేసుకొని టేబిల్‌మీదనుంచి కిందకు దిగింది.

కొన్ని మందులు రాసి ఇచ్చి వాటిని ఉపయోగించే పద్ధతిని చెప్పాడు. ఒక ఆయింట్‌మెంట్‌ను కూడా రాసి ఇచ్చాడు.

"మీ ఫీజెంత?" అంది అఖిలేశ్వరీదేవి హాండ్‌బాగ్ తెరుస్తూ.

చిరునవ్వు నవ్వాడు డాక్టర్ మల్లికార్జున్.

"చెప్పండి"

"మీరు ఫీజు ఇవ్వనక్కరలేదు"

"అదేమిటి?" అంది కనుబొమలపై ఆశ్చర్యాన్ని వొలికిస్తూ.

"ఇదివరకు తీసుకోలేదు. ఇప్పుడూ తీసుకోను"

"మీది ధర్మాసుపత్రా?"

"కొంతమందికి ధర్మాసుపత్రి. మరి కొంతమందికి డబ్బులు చెల్లించే ఆస్పత్రి. నేను అందరి దగ్గరా డబ్బు తీసుకోను. డబ్బు తీసుకోనివారి జాబితాలో మీరూ ఉన్నారు"

"భలేవారే" అంది నవ్వుతూ.

అఖిలేశ్వరీదేవి వెళ్ళిపోబోతూ, "ఒక స్మాల్ రిక్వెస్టు" అంది.

"చెప్పండి"

"ఏంలేదు. మీరు నాకు ఉచితవైద్యం చేస్తున్నారు. మీరు మా ఇంటికోసారి వచ్చి ఉచిత ఆతిథ్యం స్వీకరించాలి"

"తప్పకుండా"

"ఫోన్ చేసి డేట్ ఫిక్స్ చేస్తాను"

"ఓ.కె."

ఆ తర్వాత నాలుగు రోజులకే అఖిలేశ్వరీదేవి ప్రియంవద నర్సింగ్‌హోమ్‌కు ఫోన్ చేసింది. ఆరోజు రాత్రి ఎనిమిది గంటలకు తన ఇంటికి రమ్మంది. భర్త వ్యాపారరీత్యా బెంగుళూరు వెళ్లాడట. తనొక్కతే ఇంట్లో వుందట. తప్పకుండా రమ్మంది. ఆమె మనస్సు తన కోర్కెతో ముడిపడటంతో "తప్పకుండా వస్తాను" అని చెప్పాడు డాక్టర్ మల్లికార్జున్.

ఆరోజు ఎనిమిది గంటలకు నర్సింగ్ హోమ్‌నుంచి నేరుగా అఖిలేశ్వరీదేవి ఇంటికెళ్ళాడు డాక్టర్ మల్లికార్జున్.

వాకిట్లోనే మల్లెపూలమాలలాంటి చిరునవ్వుతో మల్లికార్జున్‌ను ఆహ్వానించింది.

నేరుగా బెడ్‌రూమ్‌లోకి తీసుకెళ్ళింది.

బ్లాక్‌లేబుల్ విస్కీ ఇచ్చింది

నాన్‌వెజిటేరియన్ భోజనం పెట్టింది.

అరగంటసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పి, అతన్ని నవ్వించింది. తానూ నవ్వింది.

ఆ పైన బెడ్‌మీదకు ఆహ్వానించింది.

అర్ధరాత్రి వరకూ ఆమెతో గడిపి చుట్టూ ప్రపంచాన్ని మర్చిపోయాడు డాక్టర్ మల్లికార్జున్.



అఖిలేశ్వరీదేవితో అట్లా పరిచయమై అచిరకాలంలోనే సన్నిహితంగా అభివృద్ధి చెందింది.

* * *

పేవ్‌మెంటు పక్కనే కారు ఆపిన డాక్టర్ మల్లికార్జున్ చిన్న ఇనుప గేటు లోంచి లోపలికెళ్ళాడు.

ఇంటి తలుపులు తెరిచే వున్నాయి. అయితే ఇంట్లో ఎవరూ మేల్కొన్నట్టు అలికిడి లేదు. లోపల హాల్లో బెడ్‌లైట్ వెలుగుతోంది. హాల్లో ఎవ్వరూ లేరు. ఆ హాల్లోంచి పైరూమ్‌కు మెట్లు వున్నాయి. పైరూమ్ అఖిలేశ్వరీదేవి బెడ్‌రూమ్.

డాక్టర్ మల్లికార్జున్ మెట్లెక్కి నెమ్మదిగా పైకి వెళ్ళాడు. బెడ్‌రూమ్‌లో నీలిరంగులో జీరోవాట్ బల్బు వెలుగుతోంది. బెడ్‌పై ఆమె ఒక్కతే పడుకొని వుంది. పక్కన భర్త లేడు.

బెడ్‌రూమ్ వాకిట్లోకి డాక్టర్



మల్లికార్జున్ రాగానే–"కమిన్ డార్లింగ్" అంది అఖిలేశ్వరి మధురమైన స్వరంతో. ఆ స్వరం రోగి స్వరంలా లేదు. విరహ వేదనతో జవజవలాడిపోతున్న ప్రియురాలి పిలుపులా వుంది.

లోపలికెళ్లాడు డాక్టర్ మల్లికార్జున్.

"ఏమైంది?"

"ఎవరికి?"

"ఫోన్ చేశావు...గుండెల్లో నొప్పి వచ్చిందని?"

ఫక్కున నవ్వింది అఖిలేశ్వరీదేవి .. ఎదుటివ్యక్తి అమాయకత్వాన్ని అవహేళన చేస్తున్నట్టుగా.

"ఆమాత్రం గ్రహించలేదా డార్లింగ్! పదకొండున్నరదాకా ఓల్డ్ మాంక్ రమ్ తాగాను థమ్సప్‌లో కలుపుకొని. ఆపైన

జింజర్ ప్రాన్స్‌తో భోంచేశాను. మా ఆయన సరుకుతెచ్చుకోవడానికి మద్రాసు వెళ్ళాడులే. నిద్రపట్టలేదు. ఓ పావుగంట సేపు ఏదో నవల చదివాను. అది సెక్స్ నవల. అందులో హీరోయిన్ మొగుడు మెడికల్ రిప్రజెంటేటివ్. నెలకు ఇరవై ఆరు రాత్రుళ్లు అతను ఇంట్లో వుండడు. నా వయసుదే అతని భార్యకూడా. ఏం చేస్తుంది? పక్కింట్లో వుంటూన్న కాలేజీ లెక్చరర్‌తో సంబంధం పెట్టుకుంటుంది. ఆ లెక్చరర్ భార్య టెలిఫోన్ ఆపరేటర్. ఆమెకు నెలకు ఇరవై ఒక్కరోజులు నైట్ డ్యూటీ. ఆరోజు ఆ లెక్చరర్ వూళ్లో వుండడు. స్పాట్ వేల్యుయేషన్ మీద యూనివర్శిటీకి వెళ్లాడట. ఆ హీరోయిన్ విరహబాధను వర్ణిస్తూ ఓ పేజీ రాశాడు ఆ రచయిత"

"చివరకు ఏంచేస్తుంది ఆహీరోయిన్?"

"చదవలేదు. ఇంతలో నాకు మీరు జ్ఞాపకం వచ్చారు. ఆ నవలను అవతల పారేశాను. మీకు టెలిఫోన్ చేశాను. మీ రాకకోసం మీనమేషాలు లెక్కిస్తూ ఎదురు చూస్తున్నాను. ఇంతలో మీరొచ్చారు. ఇప్పుడు నా విరహాగ్నిపై తొలకరిజల్లు పడ్డట్లయింది" అంటూ లేచింది అఖిలేశ్వరీదేవి బెడ్‌మీదనుంచి.

ఆమె నైటీలో వుంది.

"ఇదేం బావుండలేదు" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ బెడ్‌పై కూర్చుంటూ.

"ఏది డార్లింగ్?"

"మనం ఇట్లా పబ్లిగ్గా కల్సుకోవడం"

"నాది ప్రైవేట్ హౌస్. సొంత ఇల్లు"

"కావచ్చు. కాని ఇంతరాత్రివేళ నా కారు మీ ఇంటిబయట వుండటాన్ని ఈ వీధివాళ్ళంతా చూస్తారుగా. వాళ్ళేమను కుంటారు?"

"అఖిలేశ్వరీదేవిగారికి ఏ గుండెపోటో వచ్చింది కాబోలు– డాక్టరుగారు వచ్చారు అనుకుంటారు. అంతకుమించి వాళ్ళే మైనా అనుకుంటే వాళ్ల పాపాన వాళ్ళే పోతారు. మన పుణ్యానికి ముప్పులేదు" అందామె ఎకసక్కెంగా.

తాను మితిమీరి ప్రవర్తిస్తున్నాదేమో, దీపం చుట్టూ పురుగులా చేరుతున్నాదేమో సన్న ఆలోచన మల్లికార్జున్‌కు మొదటి సారి వచ్చింది. దాంతో అతని మొహం సీరియస్ అయిపోయింది. కొన్ని క్షణాల పాటు మాటా పలుకూ లేకుండా కూర్చోబెట్టిన బొమ్మలా కూర్చుండి పోయాడు.

కాని ఆ మౌనాన్ని అఖిలేశ్వరీదేవి భరించలేకపోయింది.

"రా డార్లింగ్! రాత్రి వయస్సు ముదిరిపోతోంది" అంటూ అతని పక్కన వాలి, అతన్ని మీదకు లాక్కుంది అఖిలేశ్వరీదేవి.

మర్నాడు సూర్యుడు ఫర్లాంగుదూరం పైకి ఎక్కేవరకూ డాక్టరు మల్లికార్జున్ పద్మినీ కారు అఖిలేశ్వరీదేవి ఇంటిముందు పేవ్‌మెంటు పక్కనే వుంది.




మధ్యాహ్నం ఒకటిన్నరకు ఇంటి కొచ్చాడు డాక్టర్ మల్లికార్జున్ భోజనానికి.

తెల్లవారుఝామున మూడుగంటలకు బయటికెళ్ళిన భర్త అప్పటిదాకా ఎక్కడున్నాడు? నర్సింగ్ హోమ్‌లోనే వున్నాడా, మరెక్కడైనా వున్నాడా? ఉంటే ఆ చోటెక్కడ? మొదలైన ప్రశ్నలతో ప్రియంవద మనస్సు చికాకైంది. కాని ఆ చికాకును ఆమె మొహంలోగానీ, మాటల్లోగానీ, చేష్టల్లోగానీ ఎక్కడా ప్రదర్శించలేదు.

'ఇప్పటిదాకా ఎక్కడున్నారు?' అని భార్య ప్రశ్నిస్తే ఏం సమాధానం ఇవ్వాలో నర్సింగ్‌హోమ్‌నుంచి కారులో ఇంటికి బయలుదేరేటప్పుడే ఆలోచించుకొని సిద్ధంగా పెట్టుకున్నాడు.

భర్తకు భోజనంవడ్డించింది ప్రియంవద.

తానుకూడా వడ్డించుకొని పక్కనే కూర్చుంది ప్రియంవద.

టొమేటాతో కూడిన పెరుగుఆహార కలుపుకుంటూ ఆమె మొహంలోకి చూశాడు మల్లికార్జున్.

ప్రియంవద మొహం మబ్బు విడిచిన వెన్నెల్లా ప్రశాంతంగా వుంది. స్త్రీ మనస్సును అర్థం చేసుకోవడం ఓ పెన్ హార్ట్ సర్జరీకంటె కష్టమైంది అనుకున్నాడు మల్లికార్జున్

భోజనాలయ్యేవరకూ ఆమెగానీ, అతనుగానీ మాట్లాడుకోలేదు. అయితే వాళ్ళ మొహాల్లో గాంభీర్యం, కోపతాపాల వెచ్చదనం ఏమాత్రంలేవు.

భోజనం చేశాక మల్లికార్జున్ మేడపైకి వెళ్లాడు బెడ్‌రూమ్‌లోకి.

డైనింగ్ టేబుల్ సర్ది అరగంట తర్వాత ప్రియంవద మేడపైకి బెడ్‌రూమ్‌లోకి వచ్చింది. అప్పుడు మల్లికార్జున్ పడుకొని ఇంగ్లీషు పేపర్లోని హెడింగ్స్ చూస్తూ వున్నాడు. అతనికి పేపరు చదవడానికి తీరికవుండదు. కాని ఇంగ్లీషు, తెలుగు దినపత్రికల్ని రోజూ తిరగవేస్తాడు. ఆసక్తికరమైన వార్తలుంటే కొంచెం దృష్టి నిలిపి చదువుతాడు. లేకపోతే ఓ గంటసేపు నిద్రపోతాడు.

బెడ్‌రూమ్‌లోకి వచ్చిన భార్యను చూసి పేపరునుంచి మొహం తప్పించలేదు మల్లికార్జున్. తాను ఎదురుచూస్తూన్న ప్రశ్నను భార్య అడుగుతుందని వూహించాడు. సమాధానాన్ని మనసులో మళ్ళీ ఓసారి మననం చేసుకున్నాడు.

"పిల్లల ప్రోగ్రెస్ కార్డులు నిన్న స్కూల్లో ఇచ్చారు. రాత్రి మీకు చూపించడం కుదరలేదు. చూడండి" అంటూ రెండు గ్రీన్ కార్డుల్ని ఇచ్చింది ప్రియంవద.

తీసుకొని రెండు నిముషాలపాటు తీక్షగా చూశాడు మల్లికార్జున్.

"సంధ్య ప్రోగ్రెస్ బాగానేవుంది. దానికి సైన్స్‌లో ఎనభైకి పైగానే మార్కులొచ్చాయి. ఇప్పట్నుంచే దాని దృష్టి మెడిసిన్‌పైకి మళ్లించాలి... ఏమంటావు ప్రియా?" అన్నాడు మల్లికార్జున్ త్రీ ఫైవ్స్ సిగరెట్టు వెలిగిస్తూ.

"దానికి మెడిసిన్ వద్దులెండి!" అంది ప్రియంవద. ఆమె మాటల్లో ఏదో నిష్ఠూరం తొణికిసలాడుతోంది.

మల్లికార్జున్ మనస్సు చివుక్కుమంది.

"ఏం?"

"ఒక డాక్టరు భార్యగా నేను ఎంత సుఖపడుతున్నానో నాకు తెలుసు, లోకులకుతెలుసు. అది డాక్టరైతే, దానిభర్త ఏమాత్రం సుఖపడతాడు? డాక్టరు మగవాడైనా, ఆడదైనా వృత్తికి అంటుకుపోతే సంసారానికీ, తామనారుమీద నీటిబొట్టుకూ తేడా వుండదు"

మల్లికార్జున్ పిల్లల ప్రోగ్రెస్ కార్డుల్ని బెడ్‌మీద పెట్టి, మళ్లీ ఇంగ్లీషు పేపర్లో మొహం దూర్చాడు. తాను ఏమైనా మాట్లాడితే తన ప్రవర్తనను వ్యంగ్యంగా వ్యాఖ్యానిస్తూ ఎత్తిపొడుపు కత్తెర రాళ్లను విసురుతుందని అతని భయం.

కొన్నిక్షణాల నిశ్శబ్దం తర్వాత అంది ప్రియంవద - "ఆ కార్డులపై సంతకాలు చేయండి"

"నేనెందుకు! నువ్వు చెయ్యొచ్చుగా!"

"చేయలేక కాదు. మీరే చేస్తే బావుంటుంది"

"ఇందులో బాగోగులేమున్నాయి? తల్లి చేస్తే ఏం, తండ్రిచేస్తే ఏం?"

"నేనూ అట్లాగే అనుకొని ఇంత కాలం పిల్లల ప్రోగ్రెస్ కార్డులపై సంతకాలు చేస్తూ వచ్చాను...కాని నిన్న సంధ్య అడిగింది''

"ఏమని"

"అందరి కార్డులపైన వాళ్ళవాళ్ళ డాడీలు సంతకాలు పెడతారట. నా కార్డుపైన నువ్వెందుకు సంతకం పెడుతున్నావు మమ్మీ అంది. నేనేం చెప్పేది? కన్నపిల్లల స్కూలు ప్రోగ్రెస్ కార్డులపైన సంతకంపెట్టే తీరిక తండ్రికి లేదని చెప్పేదా? అందుకే మీచేత సంతకాలు పెట్టిస్తానని వాళ్ళకు చెప్పాను. పొద్దున స్కూలుకు వెళుతున్నప్పుడు ఆ కార్డులపై డాడీ సంతకాలు పెట్టావా మమ్మీ అని సంధ్య అడిగింది. లేదన్నాను. కిరణ్ ఏమన్నాడో తెలుసా?"

ఏమన్నాడన్నట్టు భార్యకేసి బరువుగా చూశాడు మల్లికార్జున్.

"అసలు నాన్న మనింట్లోనే వుంటున్నాడా?చూసి వారంరోజులైంది అన్నాడు దానికి నేనేం సమాధానం చెప్పేది? మీరు ఇంటికి వచ్చేటప్పటికి వాళ్లు గాఢనిద్రలో వుంటారు. వాళ్లు స్కూలుకు వెళ్లేటప్పుడు మీరింకా నిద్రలోనే వుంటారు. తండ్రీ పిల్లలు పరస్పరం మొహామొహాల్ని చూసుకోవడం ఆదివారంనాడేగదా" అంది ప్రియంవద. ఆమె మాటల్లో కాఠిన్యం కొట్టొచ్చినట్టుగా దొర్లుతోంది.

మల్లికార్జున్ జవాబుకోసం వెతుక్కుంటూ పేపర్లో మొహం దాచుకున్నాడు. తర్వాత నెమ్మదిగా కళ్లు మూసుకొని నిద్రపోయాడు.

పిల్లల ప్రోగ్రెస్ కార్డుల్ని పుచ్చుకొని మెట్లు దిగి కిందకు పోయింది ప్రియంవద. వాటిమీద మల్లికార్జున్ సంతకాలు చేయలేదు. చేద్దామనుకున్నాడు. కాని మర్చిపోయాడు.

సాయంత్రం నాలుగున్నరకు నిద్రలేచాడు మల్లికార్జున్. బాత్‌రూమ్‌లోకి వెళ్ళి స్నానం చేశాడు. బట్టలు మార్చుకున్నాడు. నర్సింగ్‌హోమ్‌కు బయలుదేరుతూ మెట్లు దిగి డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చాడు.

ప్రియంవద కాఫీ అందించింది.

గబగబా మూడు గుక్కల్లో కాఫీతాగి కప్పు, సాసర్ను భార్యకు అందించాడు.

"ఎక్కడకు?"

"నర్సింగ్ హోమ్‌కు"

ప్రియంవద మాట్లాడలేదు. ఆమె మొహం గంభీరమైంది. ఆ గాంభీర్యతకు కారణమేమిటో మల్లికార్జున్‌కు బోధపడలేదు.

''ఏం?"

"ఇవాళ సంధ్య బర్త్‌డే. ఉదయం దానికి గ్రీటింగ్స్ చెప్పనందుకు ఎంతో బాధపడింది"

మల్లికార్జున్ మనస్సు చివుక్కు

 

మంది. దాని మనస్సు సుతిమెత్తన. ఇట్లాంటి మర్యాదలంటే దానికెంతో ఇష్టం.

"సారీ...గుర్తులేదు"

"ఏడుగంటలకు బర్త్‌డే పార్టీని ఇంట్లో ఏర్పాటు చేశాను. పదిమంది పిల్లల్ని సరదాపడి పిల్చుకుంది. కేక్ తెప్పించాను. అది కేక్ కట్‌చేసే సమయానికి మీరుంటే ఎంతో సంతోషిస్తుంది''

కొన్ని క్షణాలపాటు ఆలోచించాడు మల్లికార్జున్.

"నిజమే. నాకూ వుండాలనే వుంది. కాని అవతల నర్సింగ్‌హోమ్‌లో రెండు ఎమర్జెన్సీ కేసులున్నాయి. పొద్దునే ఆపరేషన్ చేశాను. వాళ్ళ కండిషన్ ఎట్లా వుందో చూడాలి. వీలైతే ఏడు గంటలకు వస్తాను. ఆరూ ముప్పావుకు నర్సింగ్ హోమ్‌కు ఫోన్‌చేసి గుర్తుచేయి..వస్తాను" అంటూ వెళ్ళాడు డాక్టరు మల్లికార్జున్.

కారు గేటు దాటే వరకూ వరండా మెట్లమీద నిలబడి దిగాలుపడి చూస్తూనే వుంది ప్రియంవద.

ఆరూముప్పావుకు డ్రాయింగ్ హాలులో సంధ్య బర్త్‌డే పార్టీ ఏర్పాటయింది. ఆ పిల్ల ఫ్రెండ్సంతా వచ్చారు రకరకాల గిఫ్ట్ ప్యాకెట్లతో.

డ్రాయింగ్ హాలంతా రంగురంగుల కాయితాలతో, రబ్బరు బెలూన్లతో అలంకరించబడింది.

మధ్యలో చిన్న టేబుల్‌పైన బర్త్‌డే కేక్‌ను పెట్టారు. ఆ కేక్‌పై ఆ పిల్ల వయస్సును తెలిపే చిన్నచిన్న క్యాండిల్స్‌ను అమర్చారు. పక్కనే పళ్ళెంలో పెద్ద చాకును వుంచారు కేక్‌ను కట్ చేయడానికి.

టేప్‌రికార్డర్‌నుంచి ఇంగ్లీషు మ్యూజిక్ వస్తోంది.

అక్కడ చేరిన పిల్లలంతా హుషారుగా, సంతోషంగా గంతులేస్తూ చప్పట్లు కొడుతున్నారు. వాళ్ళ సంతోషాన్ని కొన్ని నిముషాలపాటు చూసి తానూ ఎంతో సంతృప్తిపడింది ప్రియంవద. కాని ఆ సంతోషంలో, సంతృప్తిలో భాగం పంచుకోవడానికి ఆ సమయంలో భర్త అక్కడ లేకపోవడం ఎంతో లోపంగా కనబడింది ప్రియంవదకు. వెంటనే ఆమె నర్సింగ్‌హోమ్‌కు ఫోన్ చేసింది.

''హల్లో''

''.......''

"డాక్టరుగారున్నారా?"

''.......''

''ఆపరేషన్ థియేటర్లో వున్నారా? ఇంటి దగ్గర్నుంచి ఫోన్ వచ్చిందని కబురుచేస్తారా?''

"..........."

"అరగంటదాకా ఆపరేషన్ పడుతుందా?... బయటికొచ్చేసరికి గంట అవుతుందా?" దీర్ఘంగా నిట్టూర్పు విడుస్తూ రిసీవర్ను పెట్టేసింది ప్రియంవద.

''మమ్మీ! డాడీ వస్తున్నారా? టైం అవుతోంది" అంది సంధ్య.

"తర్వాత వస్తార్లే సంధ్యా! టైంకు కేక్ కట్‌చేయి. నేనున్నాను. తమ్ముడున్నాడు. నీ ఫ్రెండ్స్ వున్నారు" అంది ప్రియంవద సోఫాలోంచి లేస్తూ. ఆమె మొహంలో తెచ్చిపెట్టుకున్న చిరునవ్వు తప్ప, సహజమైన చిరునవ్వు లేదు.

* * *

ఉదయం పదకొండు గంటల వేళ.

అప్పుడే కోలక్టమీ ఆపరేషన్‌చేసి కన్సల్టింగ్ రూమ్‌లోకివచ్చి కూర్చున్నాడు డాక్టర్ మల్లికార్జున్. బయట పేషెంట్లు

ఎవ్వరూ లేరు... ఆ రోజుకు అది మూడో ఆపరేషన్.

యం.యస్ చేయకపోయినప్పటికీ డాక్టర్ మల్లికార్జున్‌కు మంచి సర్జన్‌గా పేరొచ్చింది. గాస్ట్రోజెజునోస్టమీ, థైరాయిడెక్టమీ, హిస్టరెక్టమీ, ఎపెండిసైటిస్, లేబరాటమీ మొదలైన ఆపరేషన్లను ఎంతో నైపుణ్యంగా చేస్తాడు. అతని క్లాస్‌మేట్ లక్ష్మణమూర్తి ఎనెస్తిటిస్టు వున్నాడు. మేజర్ ఆపరేషన్ జరిగినప్పుడల్లా అతన్ని పిలిపిస్తాడు. పేషెంట్ చేతనే ఫీజు ఇప్పిస్తాడు.

'మెయో క్లినిక్ జర్నల్' తిరగవేస్తున్నాడు మల్లికార్జున్ సిగిరెట్టు వెలిగించి.

నర్సు సీతాలక్ష్మి వచ్చింది.

"సార్! రూమ్‌నెంబర్‌నైన్‌లో పొద్దున ఆపరేషన్ జరిగినావిడకు మీరు రాసిచ్చిన మందులు దొరకలేదట టవున్లోఎక్కడా"

ప్రిస్క్రిప్షన్ తీసుకుచూశాడు. మరో షీటుమీద 'సెఫోలాస్పోరిన్'రాసి ఇచ్చాడు. "అవి తెప్పించి, నాలుగు గంటలకు ఒకటి చొప్పున వేసుకోమని చెప్పు. సెలైన్ వాటర్ లెవల్ చూస్తూండు. సాయంత్రం టెంపరేచర్ చూసి, కేసుషీట్‌మీద నోట్ చేయి"

"అలాగేసార్"

"రూమ్ నంబర్ సిక్స్‌లో లేబర్ లీడర్ రామస్వామి ఎలా వున్నాడు?"

"బాగానే వున్నాడు సార్. రేపు డిశ్చార్జి చేయవచ్చు. ఇవాళ మంచిరోజట! సాయంకాలం ఆరు తర్వాత డిశ్చార్జి చేయమని వాళ్ళావిడ ప్రాధేయపడుతోంది. డాక్టరుగార్ని కనుక్కొని చెబుతానని చెప్పాను. ఏం చెప్పమంటారు?"

"ఎన్నాళ్ళయింది ఆపరేషన్ చేసి?"

"వారం రోజులైంది"

"డిశ్చార్జి చేయండి"

నర్సు వెళ్ళగానే రిసెప్షనిస్టు మిస్ తులసి ఓ బిల్లు పట్టుకొచ్చింది. ఆమెవెంటే ఓ నలభై అయిదేళ్ళ స్త్రీ వచ్చింది. మంగళగిరి ముతక చీర ధరించింది. సగం నెర్సిన జుత్తు వేలుముడి వేసుకుంది.

"ఏం?"

"సార్...రూమ్‌నంబర్ త్రీలో పేషెంటును డిశ్చార్జి చేస్తున్నాం. బిల్లు మొత్తం తొమ్మిది వందల డెబ్భై అయింది. అంత ఇచ్చుకోలేం, ఏడొందలిచ్చుకుంటాం అంటోంది ఆయన భార్య"

"అవును బాబూ! నిరుడు గాలివానకు పంటంతా నేలపాలైంది. ఈ డబ్బయినా పెళ్ళినాటి గాజులు తాకట్టు పెట్టి తెచ్చా. మీరు దయ చూపాలి. ధర్మాత్ములు" అందామె- ఓపరికాన్ని మొహంలో స్పష్టంగా ప్రదర్శిస్తూ.

ఆమె మొహంకేసి చూడలేకపోయాడు డాక్టర్ మల్లికార్జున్.

"సర్లే, ఇచ్చినంతపుచ్చుకో"అన్నాడు మల్లికార్జున్ రిసెప్షనిస్టుతో.

ఆవిడ రెండు చేతులెత్తి కృతజ్ఞతా పూర్వకంగా దణ్ణం పెట్టింది.

స్ప్రింగ్ డోర్ తెప్పుకొని ఓ లావుపాటి వ్యక్తి వచ్చాడు. వయస్సు యాభైపైనే ఉంటుంది. నల్లగా తుమ్మమొద్దును జ్ఞప్తికి తెచ్చే భారీ కాయం. దానికి తగ్గట్టు తెల్లటి చలవ చేసిన ఖాదీధోవతి లాల్చీ ధరించాడు. మెడలో మందపాటి బంగారు గొలుసు వుంది. ఆయన్ని చూడగానే ఎవరైనా దీర్ఘవ్యాధికి గురైన వ్యక్తని ఇట్టే చెప్పొచ్చు.

"కూర్చోండి"

మల్లికార్జున్ ఎదురుగావున్న గోద్రెజ్ ఫోం కుషన్ కుర్చీలో కూర్చున్నాడు





మూలుగుతూ.

ఆయన మోకాలికి బాండేజీవుంది.

''చెప్పండి''

''వారంరోజుల్నుంచి విపరీతమైన తలనొప్పండి. ఏడుగురు డాక్టర్ల దగ్గరకు వెళ్ళాను. పదకొండు రకాల టేబిలెట్స్ మింగాను. తలనొప్పి మాత్రం రవ్వంత తగ్గలేదు. మా బావమర్ది రాయవెల్లూరు తీసుకెళతానంటున్నాడు. మా పెద్దబ్బాయి బొంబాయి తీసుకెళతానంటున్నాడు. ఇదేదో మాయరోగంలా వుంది డాక్టరు గారూ!''

''మీ పేరేమిటి?''

"రఘురామయ్య"

"ఏం చేస్తుంటారు?"

"సినిమా డిస్ట్రిబ్యూటర్ని. అప్పు డప్పుడూ సొంతంగా సినిమాలు కూడా తీస్తుంటానులెండి! ఎవరైనా సినిమా తీద్దామని మొదలెట్టి చేతిలో చమురు లేక మధ్యస్థంలో ఆగిపోతే, ఏదో రేటుకాడికి కొని రిలీజు చేస్తుంటాను. అదృష్టం బావుంటే అలాంటి పోరంబోకు బొమ్మల పైనే ఎక్కువ సొమ్ము మిగులుతుంది"

"మీ వయస్సెంత?"

"మొన్న సంక్రాంతికి యాభైమూడెళ్ళి యాభైనాలుగొచ్చాయి"

"మీకేమైనా జబ్బులున్నాయా?''

ఆయన పెద్దగా నవ్వాడు నల్లని కొండ విచ్చుకున్నట్టు.

"బోలెడన్ని. నాకెన్నెళ్లో అన్ని రకాల జబ్బులున్నాయి. డయాబిటీస్, బి.పి, రొమాంటిక్ పెయిన్స్, హార్ట్ కాన్ స్ట్రిక్షన్, పిస్టులా, అరికాళ్ల మంటలు ఇదలైనవి మచ్చుకు కొన్ని. ఈమధ్యనే తలనొప్పి జబ్బు కొత్తగా వచ్చింది"

''సిగరెట్ తాగుతారా?"

"అది తాగేవాళ్ళ పక్కన కూడా నిలబడను"

"మద్యం ఏమైనా పుచ్చుకుంటారా?"

"మజ్జిగ తప్ప మరేమీ పుచ్చుకోను"

కొన్ని క్షణాలపాటు కనుబొమలు చిట్లించి ఆలోచించాడు మల్లికార్జున్. సర్జరీలో అతనెంత సిద్ధహస్తుడో రోగ లక్షణాన్ని కనిపెట్టడంలోనూ, మందుల్ని నిర్ణయించడంలోనూ అంతే నిపుణుడు. ఆ కేసు అతనికి ఒక పట్టాన అంతుపట్ట లేదు.

"మీరు మోకాలికి కట్టు ఎందుకు కట్టుకున్నారండీ?" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ - తలనొప్పికీ, మోకాలి కట్టుకూ లంకె ఏమైనా వుందేమోనన్న సందేహంతో.

"నేను కట్టుకోలేదండీ!"

"మరి?"

"మోకాలిమీద చిన్న కురుపులేస్తే కొత్తగా ప్రాక్టీసు పెట్టిన మా వీధిలో ఓ కుర్ర డాక్టరు కట్టాడండీ! ఆ మోకాలి కట్టుకూ, నా తలనొప్పికీ ఏమైనా కనెక్షన్ వుందా అండీ!"

ఆలోచనలో పడ్డాడు డాక్టర్ మల్లి కార్జున్. కొన్ని క్షణాల తర్వాత "ఉంది" అన్నాడు.

రఘురామయ్య మొహం నీళ్ళపై బడ్డ ఎండలా మెరిసిపోయింది.

"ఏమిటండీ అది?"

"ఆ కురుపుకు ముందు మీకు తల నొప్పి వుందా?"

"లేదు"

"ఆ కురుపు నరంమీద లేచింది. దాని నొప్పి తలదాకా పాకింది. ఆ కురుపు తగ్గితేగాని మీ తలనొప్పి తగ్గదు. కాబట్టి ఆ కురుపు తగ్గటానికి కాప్సెల్స్ రాసి

ఇస్తాను. తలనొప్పి దానంతట అదే తగ్గుతుంది. రేపు మళ్ళీ ఇదే సమయాని కొచ్చి తలనొప్పి ఎట్లావుందో చెప్పండి"

రఘురామయ్య ప్రిస్క్రిప్షన్ కాగితం అందుకుంటూ గంగిరెద్దులా తల ఆడించాడు. జేబులోంచి పర్సుతీసి "ఫీజెంతో చెప్పండి" అన్నాడు.

డాక్టర్ మల్లికార్జున్ చిరునవ్వు నవ్వాడు.

"తొందరేంలేదు. రేపు ఇద్దురుగాని"

రఘురామయ్య లేచివెళ్ళాడు నమస్కారం పెట్టి.

మరునాడు అదే సమయానికి ఆయన



మళ్ళీ ప్రియంవద నర్సింగ్‌హోమ్‌కు వచ్చాడు చిరునవ్వు నవ్వుతూ.

"ఎట్లావుంది తలనొప్పి?"

"ఇవాళ సూర్యోదయంతో పోయిందండి"

"మోకాలిమీద కురుపు?"

"అదీ తగ్గిందండీ!" అంటూ జేబులోంచి పర్సు తీశాడు. ఆ పర్సులోంచి అయిదు వంద రూపాయల నోట్లన



తీశాడు.

"తీసుకోండి మీ ఫీజు" అంటూ ఆ మొత్తాన్ని ఇవ్వబోయాడు.

డాక్టర్ మల్లికార్జున్ ఆశ్చర్య పోయాడు.

"అంత చిన్న జబ్బుకు ఇంత పెద్ద ఫీజా?"

"అదేమిటండీ డాక్టరుగారూ! అది చిన్న జబ్బా? ఏడుగురు డాక్టర్లను కన్సల్ట్ చేశాను. మా బావమర్ది రాయ వెల్లూరు వెళ్ళాలన్నాడు. మా పెద్ద బ్బాయి బొంబాయి పోదామన్నాడు. ఆ ఊళ్లు పోతే ఎంత డబ్బు ఖర్చయ్యేదో చెప్పండి! ఆ ఖర్చును మీరు తగ్గించారు.

నా సంతోషంకొద్దీ ఇస్తున్నా తీసుకోండి. నాది నడమంత్రపు సిరిలెండి"

"సామెత ప్రకారం మాట్లాడుతున్నారే"

"ఆఁ!... అవును. నడమంత్రపు సిరి-నరాలమీద వుండు. ఏదైనా కానివ్వండి. నా స్టేటస్ ప్రకారమే డాక్టర్లకు ఫీజు ఇస్తాను"

"కాని నా వైద్యం ప్రకారమే నేను పేషెంట్లదగ్గర్నుంచి ఫీజు పుచ్చుకుంటాను" అంటూ పాతిక రూపాయలు మాత్రమే పుచ్చుకున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

రఘురామయ్య మొహం కొంచెం చిన్నబోయింది. అయినా చిరునవ్వు తెచ్చుకుని, పొగడల పూలహారాన్ని అతని మెడలో వేసి సెలవు పుచ్చుకున్నాడు.

* * *

డాక్టర్ మల్లికార్జున్ నర్సింగ్‌హోమ్ తెరవకముందు ఆ ఏరియాలో మరో రెండు నర్సింగ్‌హోమ్‌లున్నాయి. కాని ప్రియంవద నర్సింగ్‌హోమ్ తెరిచాక ఆ నర్సింగ్‌హోమ్‌లలో రష్ బాగా తగ్గిపోయింది. బెడ్‌లు ఖాళీగా వుండసాగాయి.

డాక్టర్ మల్లికార్జున్‌కు సర్జరీలోగల సామర్థ్యం వల్లనైతేనేమి, అతని హస్తవాసిమీద రోగులకు నమ్మకం కుదరడంవల్లనైతేనేమి, రోగులఆర్థికస్థితిగతుల్నిబట్టి ఫీజు తీసుకోవడంవల్లనయితేనేమి, ప్రియంవద నర్సింగ్‌హోమ్‌కు రోగులు విపరీతంగా ఎగబడుతున్నారు. ఆ రష్‌ను తట్టుకోవడం మల్లికార్జున్‌కు కష్టమైపోయింది. తనకు సహాయంగా నెలజీతం మీద ఒక డాక్టర్ను, ఒక లేడీడాక్టర్ను నియమించాడు.

అంతకుముందున్న ఒక నర్సింగ్‌హోమ్ రోగులురాక తగ్గిపోవడంతో మూతబడింది. ఆ డాక్టరు తన స్వంత ఊరికిమార్చాడు తన నర్సింగ్‌హోమ్‌ను.

అయితే కొత్తగా మరో రెండు నర్సింగ్‌హోమ్‌లు ప్రియంవద నర్సింగ్‌హోమ్‌కు సమీపంలోనే వెలిశాయి. ఒకటి డాక్టర్ మల్లికార్జున్ క్లాస్‌మేట్ అహోబలరావుది. అతను కొంతకాలం గవర్నమెంట్ సర్వీసుచేసి, బదిలీల బాధ పడలేక స్థిరంగా సొంతప్రాక్టీసు చేసుకుందామనే ఉద్దేశంతో భార్యపేరున ఓ నర్సింగ్‌హోమ్ తెరిచాడు. నీరజ నర్సింగ్‌హోమ్‌ను తన క్లాస్‌మేట్ అయిన డాక్టర్ మల్లికార్జున్‌తోనే ప్రారంభోత్సవం చేయించాడు.

"నేను నీకు పోటీగా పెట్టడంలేదు. ప్రొఫెషన్‌లో ఎవరి ప్రాక్టీసు వారిది. ఎవరిసామర్థ్యాలు వారివి. ఈ లోకాలిటీలో నీ నర్సింగ్‌హోమ్ బాగా నడుస్తోందని విన్నాను. నీ ఆశీర్వచనం వుంటే మంచిది. ఈ పట్టణంలో నువ్వే నాకు ఆప్తమిత్రుడివి. కాబట్టి నా నర్సింగ్‌హోమ్‌ను నువ్వే ఇనాగరేట్ చేయాలి" అన్నాడు డాక్టర్ అహోబలరావు. అతనితోపాటు అతని భార్య నీరజ కూడా ఇంటికొచ్చింది.

ఇద్దర్నీ భార్యకు పరిచయం చేశాడు మల్లికార్జున్. నీరజ బి.కాం. చదివింది.

గుంటూరులో ఈ ఇద్దరు డాక్టర్లూ ఒకసంవత్సరంపాటు ఒకే రూములో వుండి చదువుకున్నారు. తర్వాత తర్వాత వాళ్ళెక్కువగా తటస్థపడకపోయినప్పటికీ ఉత్తరాలద్వారా స్నేహబంధాన్ని పోషించుకుంటూ వచ్చారు.

అహోబలరావు నర్సింగ్‌హోమ్ రోగుల్ని అంతగా ఆకర్షించలేకపోయింది.





అహోబలరావు మంచి ఫిజిషియనేగాని సర్జరీపట్ల అంత ఆసక్తిలేదు. ఆధునిక పద్ధతులతో, పరికరాలతో, ఫర్నిచర్‌తో ఎన్నో లక్షలు ఖర్చుచేసి నర్సింగ్ హోమ్‌ను ప్రారంభించాడుగానీ, పెట్టుబడికి పది పైసలచొప్పున కూడా వడ్డీ గిట్టుబాటు కావడంలేదు.

నీరజకు వ్యాపార ప్రవృత్తిమెండు. పైగా ఆమె చదువుకుంది బి.కాం. ప్రతి రూపాయి పెట్టుబడి ఖర్చుకు ఆదాయం ఎంత శాతంలో వస్తుందో నోటితో లెక్కలు కడుతుంది. కాని ఆ పద్ధతి డాక్టరు అహోబలరావుకు నచ్చదు.

"ఇది ఉల్లిపాయల వ్యాపారంకాదు. కొన్న ధరకూ, అమ్మకం ధరకూ తేడా చూసుకొని ఏరోజుకారోజు లాభనష్టాలు బేరీజు వేసుకోవడానికి. డాక్టరు వృత్తిలో సంపాదన అనేక అంశాలపై ఆధారపడి వుంటుంది. రోగులకు నమ్మకం కుదరాలి. మంచికాలం రావాలి. అప్పటిదాకా వేచి వుండాలి."

నీరజ మూతిని మూడువంకర్లుతిప్పి నొసటిని నాలుగుసార్లు కదిలించింది.

"ఏమో ... జమాఖర్చుల్ని చూస్తే నాగుండె బేజారయిపోతోంది. ఈ రోజుల్లో ఏ వ్యాపారం చేసుకున్నా పెట్టుబడికి పాతికశాతం లాభం వస్తోంది. ఫిక్సెడ్ డిపాజిట్లో బ్యాంకులో పడవేసుకున్నా కడుపులో నీళ్లు కదలకుండా బతకొచ్చు"

భార్య మనస్సును మరీ బాధించడం ఇష్టంలేక సంభాషణను పొడిగించలేదు డాక్టరు అహోబలరావు.

డాక్టరు అహోబలరావు తర్వాత మరో నర్సింగ్‌హోమ్ వెలిసింది ఆ ప్రాంతాల్లో. దానికి రోగులు అంతంతమాత్రంగానే వస్తున్నారు.

ప్రియంవద నర్సింగ్‌హోమ్‌కుగల పేరు ప్రఖ్యాతులు పల్చబడితేగాని తమనర్సింగ్ హోమ్‌ల గడపలు రోగులు తొక్కరనే అభిప్రాయం లోలోపల ఆ ప్రాంతంలోని మిగతా నర్సింగ్ హోమ్‌ల డాక్టర్లకు ఏర్పడడంలో ఆశ్చర్యమేమీ లేదు.

నీరజ అప్పుడప్పుడూ ప్రియంవద దగ్గరకు వెళ్ళివస్తూ వుంటుంది. పిచ్చాపాటి మాట్లాడుకుంటారు. డాక్టర్ల గురించీ, రోగుల గురించీ, ప్రాక్టీసు లాభనష్టాల గురించీ నీరజ ఉత్సాహంగా మాట్లాడు తుందిగానీ ప్రియంవద అంత ఆసక్తి కనబర్చదు. తన భర్తకు అమోఘమైన ప్రాక్టీసు వున్నప్పటికీ ఆమె అంత నిర్లిప్తంగా ఎందుకుంటూందో నీరజకు బుర్ర బద్దలుకొట్టుకున్నా అంతుబట్టేది కాదు.

ఒకసారి నీరజ అంది-

"విజయవాడ మొత్తంమీద డాక్టర్ మల్లికార్జున్‌గారి ప్రాక్టీసుబావుంది. సంపాదనలో కొంత ఉదార స్వభావాన్ని ఆయన కాస్త తగ్గించుకుంటే నెలకు ఆయన యాభై వేలుసంపాయించవచ్చునంటారు మావారు. అంత గొప్ప ప్రాక్టీసుగల డాక్టరు భార్య కావడానికి మీరు గత జన్మలో ఎంతో పుణ్యంచేసుకొని వుంటారు"

దానికి మసగ్గా మబ్బుపట్టినట్టు నవ్వింది ప్రియంవద.

"ఆడదానికి మొగుడి ప్రాక్టీసు గొప్పదనం కాదు కావల్సింది. భార్యా పిల్లల్ని చూసుకోవడానికి ఆ భర్తకు ఎంత తీరిక వున్నదనేది ముఖ్యం''

ఆ మాటల వెనుకగల నిర్వేదాన్ని నీరజ పసిగట్టింది. అయితే వివరమడిగే ధైర్యం ఆమెకులేదు. భర్త రెండు చేతులా సంపాయిస్తున్నప్పుడు ఇంటి

విషయాల్ని భార్య చూసుకోవచ్చుననేది నీరజ అభిప్రాయం.

ఒకరోజు సాయంకాలం డాక్టర్ మల్లికార్జున్‌కు అఖిలేశ్వరీదేవి టెలిఫోన్ చేసింది.

"డార్లింగ్! ఏం చేస్తున్నావ్?"

"ఇప్పుడే రూమ్స్‌కు ఒక రౌండ్ వేసివచ్చాను"

"డార్లింగ్! డాక్టర్ లైఫ్ మహాబోర్. ఎంత సేపటికి రోగులు, రోగాలు, ఆపరేషన్లు, మందులు..ఎంత ఛండాలమైన రోగినైనా చూడాలి. వాళ్లుచెప్పే సోదంతా ఓపిగ్గా వినాలి"

"అయితే ఏంచేయమంటావ్?"

"ప్రపంచంలో ఏదైనా చేయొచ్చు... సాహసముండాలిగాని. ఈ రాత్రికి మీరు మీ కారులో నాతోపాటు హైదాబాద్ బయలుదేరుతున్నారు"

"నేనా?...ఎందుకు?"

"చెబుతాను. మీరు నాతో వస్తారా, రారా?"

"ఎందుకో ముందు చెప్పు"

"మీ జీవితమార్గాన్ని మార్చదల్చాను"

"నా జీవిత మార్గాన్నా?"

"అవును. ముమ్మాటికీ. ప్రపంచంలో పాలిటిక్స్‌కు మించిన ప్రొఫెషన్ ఈరోజుల్లో మరోటిలేదు. మినిస్టర్లకున్న హోదా, దర్జా, డబ్బు సంపాదన, పలుకుబడి, గౌరవం మరొకరికిలేదు. మీరు యం.యస్. చదివినా, పిహెచ్.డి చేసినా, మూడువేల ఆపరేషన్లు చేసినా, మూడు కోట్ల రూపాయలు సంపాయించినా...ఒక స్టేట్‌మినిస్టర్‌తో ఈక్వల్ కాదు, ఏమంటారు?"

"అది నీ అభిప్రాయం. నేననేదేముంది"

"మీరు కరెక్టుకాదు. నేను చెబుతున్నాను. సరిగ్గావినండి. మూడు నెలల్లో ఎలక్షన్లున్నాయి. అధికారపార్టీ తరపున ఈ నియోజకవర్గంలో టికెట్ సంపాయించడానికి ట్రై చేస్తున్నాను. ఆమధ్య సెంట్రల్ మినిస్టరు నాకు ప్రామిస్ చేశాడు. ఆయన అధిష్ఠానవర్గంలో ముఖ్యమైన మెంబరు. ఆయన మాటను సి.ఎం., పి.ఎం ఎవ్వరూ కాదనరు"

"విష్‌యు గుడ్‌లక్"

"నాకు కాదు"

"మరెవ్వరికి?"

"మీకోసం టికెట్ ట్రైచేద్దామని నా ఉద్దేశం"

"నాకోసమా?"

"అవును. నూటికి నూరుపాళ్ళు మీ కోసమే. అధికారపార్టీ తరపున టికెట్ వచ్చిందంటే ఎం.ఎల్.ఏ అయినట్లే! ఆపైన మినిస్టర్ కావడానికి నేను విశ్వప్రయత్నం చేస్తాను. మినిస్టర్ కూడా మీరవుతారు. హామీపత్రం రాసిస్తాను"

"నాకు పాలిటిక్స్‌దేనికి! ఆ టిక్కెట్టేదో నువ్వు తెచ్చుకుని, యం.ఎల్.ఏ అయి మినిస్టరవ్వు. నేనెంతో సంతోషిస్తాను. నా శక్తి కొద్దీ సహాయంచేస్తాను"

"అలాకాదు డార్లింగ్. టిక్కెట్ వస్తే గెల్చే అవకాశాలు మీకే మెండుగా వుంటాయి"

"నాకు పాలిటిక్స్ అంటే మురుక్కాలవకంటే అసహ్యం ఎక్కువ. నేను హైదరాబాద్ రాను. నువ్వెళ్లు"

"కాదు డార్లింగ్! నీకోసం నేను ట్రై...."

టెలిఫోన్ రిసీవర్ను ఇన్‌స్ట్రుమెంట్ మీద పెట్టాడు మల్లికార్జున్.

అంతలో ఒక పేషెంట్ గదిలోకి వచ్చాడు. అతన్ని వివరాలు అడగటం





మొదలెట్టాడు.

మళ్ళీ టెలిఫోన్ మోగింది.

ఆ టెలిఫోన్‌ను మల్లికార్జున్ ఎత్తలేదు. ఓ నిముషంపాటు మోగి, తర్వాత ఆగి పోయింది.

## 6



"శ్రీమతి ప్రియంవదకు....

నమస్సులు. డాక్టర్ మల్లికార్జున్‌కు ఈ పట్టణంలో జోరుగా ప్రాక్టీసువుంది. అది ఆయన పూర్వజన్మ సుకృతం కావచ్చు, ఆ డాక్టర్‌గారి భార్య అయిన మీరు ఎంతో మురిసిపోవచ్చు. సంఘంలో ఎంతో ప్రిస్టేజి వున్నట్టు ఫీల్ కావచ్చు. కాని డాక్టర్ మల్లికార్జున్ నిజస్వరూపం మీకు తెలియకపోవచ్చు. ఆయన్ను ఆదర్శపూర్వకమైన భర్తగా, గొప్ప డాక్టరుగా మీరు వూహించుకోవచ్చు

అట్లాంటి ఊహల్లో మీరుంటే ఆ ఊహలు గాలిలో గడుసుదయ్యా ల్లాంటివని చెప్పక తప్పదు. మల్లికార్జున్ బతుక్కు బొమ్మా బొరుసూ వున్నాయి. మీరు బొమ్మనే చూస్తూపొంగిపోతున్నారు, బొరుసుచూస్తే కుంగిపోతారు.

డాక్టర్ మల్లికార్జున్ తాగుబోతు. ఆసంగతి కొత్తగా చెప్పనక్కర్లేదు, మీకు తెలిసే వుంటుంది. క్లబ్బులో రోజూ పేకాట ఆడతాడు. ఏ అర్ధరాత్రో తప్ప ఇంటికి రాడు కాబట్టి ఆ విషయం కూడా మీకు ఎరుకే అయివుంటుంది.

అతను పచ్చి వ్యభిచారి. ఇది మీకు తెలియకపోవచ్చు. అత్యద్భుతంగా, నమ్మ రాని నిజంగా వుండొచ్చు. ఇది కల్పన కాదు. పచ్చి నిజం. టవున్లో అందరికీ తెలుసు. ఈ టవున్లో అఖిలేశ్వరీదేవి అనే ఒక షోకిల్లారాణి ఉంది. పేరుకు సంఘసేవకురాలు. కాని పబ్లిక్‌గా శరీర లావణ్యాన్ని అమ్ముకుంటూ బతికే బజారుగత్తె. దానికీ, డాక్టర్ మల్లికార్జునుకూ సంబంధాలున్నాయి. ఎన్నో రాత్రుళ్లు డాక్టరుగారి కారు ఆమె ఇంటిముందు గంటల తరబడీ వుంది. ఈ విషయం ఆ వీధిలోని వాళ్ళందరకూ ప్రత్యక్షంగా తెలుసు. ఎన్నోసార్లు డాక్టరుగారు ఆమె పడకగదిని పావనం చేశాడు. ఆమె వలలో డాక్టరుగారు ఇరుక్కోవడం- అతని పరువు ప్రతిష్టలకు గొడ్డలిపెట్టని, మీ సంసారానికి ఆరని చిచ్చని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

డాక్టరుగారి వైద్య వృత్తిలో ఘోరమైన నేర ప్రవృత్తి మరొకటి వుంది. అతను స్త్రీలోలుడు. అతనిలో సెక్స్ వీక్‌నెస్ విపరీతంగా వుంది. వైద్యంకోసం నర్సింగ్ హోమ్‌కొచ్చే స్త్రీల నగ్న సౌందర్యాల కోసం ఎగబడతాడు. వైద్య పరీక్ష నెపంతో కన్సల్టింగ్ రూమ్‌లో ఎగ్జామినేషన్ టేబుల్‌మీద ఎంతోమంది స్త్రీల అంగాంగాలను తిలకించాడట. అతను వృత్తికి మచ్చతెచ్చే అవినీతి పనుల కెన్నింటికో పాల్పడిన దాఖలాలున్నాయి. అతని అంతులేని కామదాహానికి బలియైన అభాగ్యులెందరో సాక్ష్యా లివ్వడానికి సిద్ధంగా వున్నారు.

ఆమధ్య ఆపరేషన్ థియేటర్లో తానొక్కడే ఆపరేషన్ చేస్తాననే మిషతో

ఒక యువతికి పెథిడిన్ ఇంజెక్షన్ ఇచ్చి, రేప్ చేశాడట. ఆమెకు స్పృహ వచ్చి జరిగిన మోసాన్ని తెల్సుకునేసరికి డాక్టరుగారు నర్సింగ్‌హోమ్‌లో లేడట. పోలీసుస్టేషన్‌కెళ్ళి రిపోర్టు ఇస్తే తనపరువు బయట పడిపోతుందని, ఏమీ చేయలేక కుమిలి కుమిలి ఏడ్చిందట. ఇట్లాంటి దారుణకృత్యాలు వైద్య వృత్తికి క్షమార్హంకాని అపచారాలు.

డాక్టర్ మల్లికార్జున్ అత్యాచారాలు మీకు తెలియజేయడానికి ఈ లేఖ రాస్తు న్నాను.

భార్యగా డాక్టరుగార్ని మీరు అదుపు ఆజ్ఞల్లో పెట్టుకోకపోతే, అతనివల్ల బాధపడినవాళ్లు సమయంచూసి తగినట్టు బుద్ధి చెబుతారు.

మీ

శ్రేయోభిలాషి

.........."

ఆ ఉత్తరం చదివి ప్రియంవద కుప్పగా కుర్చీలో కూలబడింది. ఆమెకు ప్రపంచం తల్లకిందులైనట్టు తోచింది. వొళ్ళంతా చెమట పట్టింది. కళ్లు తిరుగు తున్నట్లయింది.

ఇది నిజమేనా ?

ఆయన స్త్రీ లోలుడా?

అఖిలేశ్వరీ దేవితో సంబంధం...

వైద్యంకోసం వచ్చే స్త్రీలను....

ఆపరేషన్ థియేటర్‌లో మత్తుమందిచ్చి ఒక యువతిని రేప్ చేయడం...

ఈ అత్యాచారాలన్నీ నిజంగా ఆయన చేశాడా?

ఎవరైనా అసూయతో, ద్వేషంతో, కోపంతో కల్పించినవా?

డాక్టర్ మల్లికార్జున్ ఆరోజు మధ్యాహ్నం లంచ్‌కి రాలేదు. పదకొండు గంటలకు నర్సింగ్‌హోమ్‌నుంచి ఫోన్ చేసి ఎవరో ఫ్రెండ్‌తో బయటకు లంచ్‌కి వెళుతున్నానని, భోజనానికి రాననీ ఫోన్ చేశాడు.

ప్రియంవద ఆపూట లంచ్ చేయ లేదు.

సాయంత్రం మూడు గంటలకు కాఫీ తాగలేదు.

నాలుగున్నర గంటలకు స్కూలు నుంచి పిల్లలొచ్చినా పలకరించలేదు.

'శ్రేయోభిలాషి' లేఖలోని విషయా లను గురించి ప్రియంవద తీవ్రంగా ఆలోచిస్తూనే వుంది. భర్త రాకకోసం అంతకంటే తీవ్రంగా ఎదురుచూస్తూనే వుంది.

రాత్రి ఒకటిన్నరగంటల ప్రాంతంలో కారు హారన్ వినబడగా డ్రాయింగ్‌హాలు సోఫాలోంచి గబగబా లేచి బయటకు పోయింది.

అప్పటికే చౌకీదారు మెయిన్ గేటు తెరిచాడు.

కారు లోపలకొచ్చింది. డ్రైవింగ్ సీటులో ఒకామె కూర్చునివుంది.

వెనకసీట్లో స్పృహ లేకుండా పడి వున్నాడు మల్లికార్జున్.

గేరేజ్‌ముందు కారాపి అందులోంచి ఠీవిగా, మెరుపుతీగలా ఓ స్త్రీ దిగింది.

"ఒక పార్టీలో మీ ఆయన తప్పతాగి పడిపోతే నేను తీసుకొచ్చాను. వెనకసీట్లో పడుకున్నాడు. లోపలకు తీసుకెళ్ళండి" అంది ఆమె.

కోపోద్రేకాలతో, అవమానంతో ప్రియంవద మొహమూ, శరీరమూ జవ జవలాడాయి. అయినప్పటికీ తమాయించు కుంది.

"థాంక్స్" అంది ముక్తసరిగా





ప్రియంవద.

"వస్తాను" అంటూ బయలుదేర బోయింది.

"మీ పేరు?"

"నేనెవరో మీకు తెలియదా!... అఖిలేశ్వరీదేవిని"

గతుక్కుమంది ప్రియంవద మనసు. దూరంగా పడుతోన్న లైట్ కాంతిలో ఆమెను స్పష్టంగా చూడలేకపోయింది.

"ఇంత రాత్రి మీరెట్లా వెళతారు?"

సుతారంగా నవ్వింది అఖిలేశ్వరీదేవి.

"నాకోసం ఇంకోకారు బయటవుంది" అంటూ విసవిస నడిచి గేటుబయటకు వెళ్ళింది అఖిలేశ్వరీదేవి.

* * *

కారులోంచి డాక్టర్ మల్లికార్జున్‌ను డ్రాయింగ్‌రూమ్‌లోకి చేర్చడానికి పది నిముషాలు పట్టింది ప్రియంవదకు. చౌకీదారు సాయపడ్డాడు.

ఆమె మనోవేదనకు, మానసిక క్షోభకు అంతులేకపోయింది.

ఎంత చదువు చదివితేఏం? ఎంత పేరుగల, సామర్థ్యంగల డాక్టరైతేనేం? సంఘంలో ఎంత ప్రెస్టేజివుంటేనేం? ఇట్లా చిల్లరవాళ్ళలాగ తప్పతాగి పడిపోవడమా? ఎంత న్యూనత? తాగటం వ్యసనం కావచ్చు. కాని దానికిపరిమితులు లేవా? తన చుట్టుపక్కలవాళ్లు ఏమనుకుంటారనే ఇంగితజ్ఞానం వుండనక్కర్లేదా? ఛి...ఛీ తప్పతాగిన ఆయన్ను ఒక స్త్రీ, అందులో అఖిలేశ్వరీదేవి తీసుకొచ్చి తనకప్పచెప్పడమా?...ఇంతకంటె తనకు అవమానమేంకావాలి?

ఏదో కుట్ర జరుగుతోంది. ఆయనలోని బలహీనతల్ని ఎవరో బట్టబయలు చేసి, స్వార్థప్రయోజనాలకు వినియోగించుకుంటున్నారు. ఒక వ్యక్తి సామాజికంగా, నైతికంగా పతనంకావడానికి ఎన్నో పరాయి శక్తులు పొంచి వుంటాయి. ఆ శక్తుల ప్రభావానికి లోను కాని దృఢమైన మనోబలం వుండాలి. అది ఆయనలో లోపించడంవల్లనే ఇన్ని అనర్థాలు...

మల్లికార్జున్ సోఫాలో పడుకున్నాడు. తాను ఎక్కడున్నాడో తెలీని స్థితిలో వున్నాడు.

కాళ్ళబూట్లు, సాక్స్, మెడచుట్టూవున్న టై విప్పింది. ఇంగ్లీషులో ఏదో అంటూ పక్కకు వొత్తిగిల్లి పడుకున్నాడు. ఆ మాటలు ఆమెకు స్పష్టంగా వినపడలేదు.

తెల్లవార్లూ ప్రియంవద మేల్కొనే వుంది. ఏవేవో ఆలోచనలు... జీవితాన్ని గురించీ, పిల్లల్ని గురించీ, వాళ్ళ భవిష్యత్తు గురించీ, భర్త ప్రవర్తన గురించీ. భర్త ప్రవర్తనను మార్చడానికి తాను గట్టిగా ప్రయత్నించాలి. లేదా తాను భర్త చేష్టలకు రాజీపడి, సర్దుబాటు కావాలి. ఈ మనోవేదనను, మానసిక సంక్షోభాన్ని, అశాంతిని ఎంతకాలం తాను భరించగలదు. లోకంలో డాక్టర్ల భార్యలంతా ఇట్లాగే బాధపడుతున్నారా? తనెంతమందో డాక్టర్లను చూసింది. వాళ్ళు సుఖంగా, ఏ పొరపొచ్చాలులేకుండా సంసారజీవనం గడపడంలేదూ! భార్యాపిల్లలతో సినిమాలకు, షికార్లకు, శుభకార్యాలకు వెళ్ళడంలేదూ! తనూ, పిల్లలూ, ఆయనా కల్సి సరదాగా సినిమాకెళ్ళి ఎంతకాలమైంది? ఎవరి ఇంటికైనావెళ్ళి ఎన్ని నెలలైంది? ఆయనకు తీరితేగా...!

పిల్లలు సినిమాలకోసం అడుగుతూ వుంటారు. ఎప్పుడైనా ఆదివారాల్లో మ్యాట్నీకి తనే తీసుకెడుతూవుంటుంది.

తండ్రితో సినిమా చూడాలని సంధ్య కెంతో సరదా! కాని ఎప్పుడైనా అడిగితే "నాకు తీరికెక్కడిది? కాచు పంపిస్తాను. మీరువెళ్ళండి" అంటారాయన. సినిమాకు వెళ్ళడానికి కాచు ప్రధానమా? తల్లి దండ్రుల సమక్షంలో సినిమా చూడాలని పిల్లలకు సహజంగా వుంటుంది. ఆ మాత్రం గ్రహింపు ఆయనకులేదు. ఎవరైనా పెళ్ళిళ్ళకు, ప్రధానాలకు, శుభ కార్యాలకు పిల్చినా ఆయన వెళ్ళడు. తానే వెళ్ళాలి. "మీవారు రాలేదా?" అని తనని గుచ్చిగుచ్చి అడుగుతూంటారు.

"ఆయనకు అర్జంటుఆపరేషన్ వుంది", "నర్సింగ్ హోమ్ కెళ్ళారు" "హైద్రాబాద్ నుంచి ఎవరో వచ్చారు'' అని ఏదో చెప్పాల్సివస్తుంది. తాను ఇట్లాంటిజీవితాన్ని కలలో కూడా వూహించలేదు. భర్త



కళ్ళముందు కనీసం నియతకాలిక వేళల్లోనైనా వుండాలి. కష్టసుఖాలు చెప్పుకోవాలి. మంచిచెడ్డలు చర్చించుకోవాలి...

మరునాడు ఉదయం ఏడుగంటలకే లేచాడు మల్లికార్జున్. షేవింగ్, స్నానం డ్రస్ వేసుకోవడం అన్నీ ముగించి, ఫ్రెష్‌గా తయారై డైనింగ్ టేబుల్ దగ్గర కొచ్చాడు ఎనిమిది గంటలకు.

పిల్లలు కూడా స్కూలు దుస్తులు ధరించి డైనింగ్ టేబుల్ దగ్గరకు వచ్చారు.

"వారేయ్ కిరణ్! నీకు మేథ్స్‌లో సరిగ్గా మార్కులు రావడంలేదు. ఇంజినీరింగ్ చదవాలంటే ఇప్పట్నుంచే లెక్కల్లో పదునుకత్తిలా వుండాలి. ట్యూషన్ పెట్టించమంటావా?" అన్నాడు మల్లికార్జున్.

"మొన్న మా టీచర్ అన్యాయం చేసింది డాడీ!" అన్నాడు కిరణ్ బుంగమూతి పెట్టి.



"అదేమిట్రా?"

"అసలు నాకు ఫస్ట్ మార్కులు రావాల్సింది డాడీ. కానినాపేపర్లో అయిదు మార్కుల బిట్ కొశ్చన్‌కు ఆన్సర్ వాల్యూ చేయలేదు. అది చేస్తే ఫస్టు మార్కులు వచ్చేవి"

"ఎందుకు చేయలేదురా?"

"మమ్మీ చూసేదాకానాకూ తెలియదు. ఆరోజు టీచర్ను అడిగాను. చూసి, మర్చి పోయి వుంటానందిగానీ, పేపరుమీద మార్కు లేయలేదు"

"గట్టిగా అడగకపోయావట్రా"

"రెండుసార్లు అడిగాను. కాని విని పించుకోలేదు"

"అసలు కిటుకు మరోటుంది డాడీ" అంది సంధ్య ఇడ్లీ తింటూ.

"ఏమిటమ్మా అది" అన్నాడు మల్లికార్జున్ ఆశ్చర్యంగా.

"వాడి క్లాసులోనే వాళ్ళ బ్బాయి చదువుతున్నాడట. వాడికెప్పుడూ ఫస్టు మార్కులొస్తాయట. ఆ క్వశ్చన్‌కు ఆన్సర్‌ను వాల్యూచేస్తే మన కిరణ్‌కు ఫస్టుమార్కులు వస్తాయట. అందుచేత ఆ టీచర్ పార్శియాల్టీ చూపెట్టిందట"

"అవును డాడీ" అన్నాడు కిరణ్ హుషారుగా.

"మరి ప్రిన్సిపాల్‌తో రిపోర్టు చేయక పోయావట్రా"

"ఆ సంగతి తెలిస్తే క్లాసులో టీచర్ ఏడిపిస్తుందిగా" అంది సంధ్య.

నవ్వాడు మల్లికార్జున్.

వాళ్ళకు టిఫిను వడ్డిస్తూ ఆసంభాషణ వింటూ కూర్చుంది ప్రియంవద.

రాత్రి ఆయన ఏ స్థితిలో ఇంటికి వచ్చాడో, తన మనస్సును ఎంత క్షోభ పెట్టాడో, ఇప్పుడు పిల్లలతో ఎట్లా ముచ్చట్లు ఆడుతున్నాడో ... తాగిన వాళ్ళకు మతిమరుపు సహజమేమో....! గతరాత్రి తన స్థితిని గ్రహించిన వ్యక్తి మళ్ళీ నలుగురిలో మొహం ఎత్తుకొని తిరగ్గలడా?

ప్రియంవద మనస్సులో ఆ 'శ్రేయోభిలాషి' రాసిన లేఖ మెదులుతూనే వుంది. దాని విషయమై భర్తను నర్సింగ్ హోమ్‌కు వెళ్ళేలోపల అడుగుదామని సమయం కోసం వేచి చూస్తూనేవుంది. అయితే పిల్లలముందు అట్లాంటివిషయాల్ని ప్రస్తావించడం బావుండదు. తల్లి దండ్రులు పోట్లాడుకోవడాన్ని పిల్లలు ప్రత్యక్షంగా చూస్తే వాళ్ళ మనస్సులు కలత పడతాయి. తల్లిదండ్రులపైన వుండాల్సిన గౌరవం పల్చబడిపోతుంది. అందుచేతనే పిల్లలు స్కూలుకు వెళ్ళాక భర్తను అడుగుదామనుకుంది.

"రిక్షావాడు వచ్చే వేళైందిరా. త్వరగా తినండి" అంది ప్రియంవద కసురుతూ.

"రిక్షావాడు అప్పుడే రాడమ్మా! ఆ మేజిస్ట్రేటుగారి మనవడు తయారయ్యే టప్పటికి ఎనిమిదిన్నరవుతుంది. ఆ తర్వాత వాడు ఇద్దరు పిల్లల్ని ఎక్కించుకు రావాలి" అన్నాడు కిరణ్.

"రిక్షాలో ఎంతమంది ఎక్కుతార్రా?"

"నలుగురూ, అయిదుగురూ" అంది సంధ్య.

"అదేమిటి ప్రియా! మన ఇద్దరి పిల్లలకే ప్రత్యేకంగా ఒక రిక్షా మాట్లాడ రాదూ! నలుగురు పిల్లలు ఇరుక్కుని ఎట్లా పోతారు?" అన్నాడు మల్లికార్జున్ సలహా ఇస్తున్నట్టు.

"మనం ఇద్దరి కోసం మాట్లాడి హెచ్చుగా కిరాయి ఇచ్చినా, మరో




ఇద్దర్ని ఎక్కించుకోకుండా వుండడు. అది వాళ్ళ ఆనవాయితీ. క్రితం సంవత్సరం రెండు నెలలు అట్లాగే మాట్లాడాను. వాడు ఒప్పుకున్నాడు. ఏంలాభం? వారం పదిరోజులు పోయాక ఇంకో కుర్రాణ్ని ఎక్కించాడు. ఆపైన మరో వారానికి మరో కుర్రాణ్ని వతనగా పెట్టుకున్నాడు" అంది ప్రియంవద.

"మరి నువ్వు గట్టిగా అడగలేదా?" అన్నాడు మల్లికార్జున్.

"అడిగాను. పొట్టగడవొద్దమ్మగోరూ అంటూ బీద అరుపులు అరిచాడు. అందరి రిక్షావాళ్ళు అంతే!"

"మా రిక్షా నయం డాడీ! ఎదురింటి పిల్ల ఎక్కే రిక్షా వుందా? అందులో ఏడుగురు పిల్లలు ఎక్కుతారు.ఎక్కడైనా అప్ వస్తే నలుగురు పిల్లలు దిగి రిక్షాను నెడతారు" అన్నాడు కిరణ్.

అంతలో రిక్షా వచ్చిన బెల్ మోగింది.

పిల్లలు గబుక్కున డైనింగ్ టేబుల్ దగ్గర్నుంచి లేచారు. తమ గదిలోకెళ్ళి బ్యాగ్‌లు తెచ్చుకున్నారు.

"మమ్మీ...టాటా"

"డాడీ...టాటా"

అంటూ ఇద్దరు పిల్లలూ చేతులు వూపి బయటకు వెళ్ళారు.

మల్లికార్జున్ టిఫిన్ తిని, దగ్గరోవున్న సింక్‌లో చేతులు కడుక్కొని, నాప్‌కిన్‌తో తుడుచుకొంటూండగా కాఫీకప్పు సాసర్ అతనిముందు పెట్టింది.

నిశ్శబ్దంగా కాఫీ తాగాడు మల్లికార్జున్. కోటు జేబులోంచి త్రీ ఫైవ్స్ ప్యాకెట్ తీసి అందులోంచి ఒక సిగరెట్టు తీసి లైటర్‌తో వెలిగించాడు. సిగిరెట్‌ను రెండు పీల్పులు పీల్చగానే అతనిముందు 'శ్రేయోభిలాషి' లేఖను పెట్టింది ప్రియంవద.

"ఏమిటది?"

"చదవండి మీకే తెలుస్తుంది"

చదవసాగాడు డాక్టర్ మల్లికార్జున్. వాక్యం వాక్యం చదివిన కొద్దీ అతని మొహంలో రంగులు మారసాగాయి. చివరిదాకా చదవకుండానే టేబుల్ మీద విసిరివేశాడు. ఆగ్రహోదగ్రుడైనట్టు అతని మొహంలో ఎరుపుదనం తెలుపుతోంది.

"పొంతం చదవండి" అంది ప్రియంవద అతని పక్కనే నిలబడి.

"అది నీకు రాసిన లేఖ. నువ్వు చదివావుగా. చాలు" అన్నాడు మల్లికార్జున్ చిరుక్కున లేస్తూ.

"నేను చదివాను. చదివిన దగ్గర్నుంచీ కుమిలిపోతూనే వున్నాను" అంది ప్రియంవద. ఆమె గొంతులో జీర స్పష్టంగా ధ్వనించింది.

బయటకు వెళ్ళబోతున్న మల్లికార్జున్ ఠక్కున ఆగి, వెనక్కు చూశాడు.

"అదెవరో గిట్టనివాళ్ళు రాసింది. ఈమధ్య టవున్లో నా ప్రాక్టీసు బావుందనీ, నన్ను అన్‌పాపులర్ చేయాలని ఏవేవో కుట్రలు పన్నుతున్నారు. లేనిపోని అభూత కల్పనలు కల్పిస్తున్నారు. గాలిని పోగు చేసి పుకార్లు పుట్టిస్తున్నారు. వాటిని నువ్వు ఏమాత్రం నమ్మనక్కరలేదు. అనవసరంగా బుర్ర ఖరాబుచేసుకోవద్దు. నామీద నాకు నమ్మకముంది. నామార్గం ఎప్పుడూ సక్రమంగానే వుంటుంది" అన్నాడు మల్లికార్జున్.

"సక్రమంగా వుంటుందని మీరను కుంటే ఎట్లా? మన చుట్టూ వుండేవాళ్ళు అనుకోవాలి. నలుగురిమధ్యా బతికేటప్పుడు నలుగురి నోళ్ళలోనూ చెడుగా

నానకూడదు" అంది ప్రియంవద గంభీరంగా.

చేతిలోవున్న సిగిరెట్‌ను డైనింగు టేబుల్ కిందికి విసిరేశాడు మల్లికార్జున్.

"అందులోని విషయాలన్నీ నిజమని నమ్మావా?"

"నా నమ్మకానికేమొచ్చె! నేను ఇల్లు వదిలి బయటకు వెళ్ళేదాన్ని కాదు. లోకం ఏమనుకుంటూందో నాకు తెలీదు. ఏమైనా నిప్పులేనిదే పొగరాదు. పొగ రానిదే నాలుగుదిక్కులకూ వ్యాపించదు."

"ఈరోజుల్లో నిప్పులేని పొగను సృష్టించే నిపుణులు ఎంతోమందివున్నారు. నీ సామెతకు ఈనాడు విలువలేదు, అర్థం లేదు. ఆకాశరామన్న లేఖల్ని పట్టించుకుంటే జీవితంలో అడుగు ముందుకు వేయలేం"

"రాత్రి మిమ్మల్ని కారులో డ్రాప్ చేసిందెవరు?"

"నన్నా! ఎవరి కారులో?"

"మీ కారులో"

"నా కార్ని నేనే డ్రయివ్ చేసుకొచ్చాను"

"అమాత్రం గుర్తులేకుండా మందు సేవించారన్నమాట. మీరు తప్పతాగి, వెనకసీట్లో స్పృహలేని స్థితిలో వుండగా మీ కార్ని అఖిలేశ్వరీదేవి డ్రయివ్ చేసుకొచ్చింది. రాత్రి ఒకటిన్నరకు మన గారేజ్ ముందు కారును ఆపినపుడు నేను స్వయంగా చూశాను. గేటుతెర్చిన మన చౌకీదారు చూశాడు — కారును ఎవరు నడిపిందీ, కారువెనుక సీట్లో మీరు ఏ స్థితిలో పడివున్నదీ!"

"రాత్రి పార్టీలో మందు డోస్ కొంచెం ఎక్కువైనట్టుంది. నాకు సరిగ్గా గుర్తు లేదు."

"ఆ అఖిలేశ్వరీదేవి గురించి ఆ లేఖలో ఎన్నో విషయాలున్నాయి. అవన్నీ పచ్చి అబద్ధాలంటారా?"

"అబద్ధాలుకాక నిజాలంటావా? ఆమె పబ్లిక్ ఫిగర్. సోషల్ వర్కర్. పాలిటిక్స్‌లో తిరుగుతూ వుంటుంది. ఆమెను గురించి రకరకాలుగా చెప్పుకుంటారు. వాట్ని గురించి ఎవ్వరూ పట్టించుకోరు."

"ఆమె ఇంటిముందు రాత్రుళ్ళపూట అప్పుడప్పుడూ మీ కారు వుంటుందట."

"ఆమె ఇంటిముందేం? ఎవరికి జబ్బు చేసి అర్జంటుగా రమ్మన్నా వెళుతూనే వుంటాను. ఆమెకు గుండెజబ్బు వుంది. రెండు మూడుసార్లు వెళ్ళి వైద్యం చేశాను. తప్పేముంది?"

"తప్పేముందని నాతో అంటే లాభమేముంది? మీ ఇద్దరికీ అక్రమ సంబంధముందని అందరూ ఎందుకనుకుంటున్నారు?"

"ఇదుగో ప్రియా! లోకుల సంగతి నాకు చెప్పకు. ఆ లేఖను మర్చిపో. నామీద అసూయకొద్దీ, మన కుటుంబంలో కలతలు రేకెత్తించాలనీ ఎవరో రాసింది. దాన్నంత సీరియస్‌గా తీసుకుంటావేం?"

"ఒకళ్ల కుటుంబంలో మరొకళ్లు కలతలు ఎందుకు రేకెత్తిస్తారండీ! మన కుటుంబంలో ఏదో లోపం వుండబట్టే ఇతరులకు అలుసైపోయాం. మీరు తాగుబోతు డాక్టరనే చెడ్డపేరు ఇదివరకే టవున్లో వుంది. దానికి తగ్గట్టు స్త్రీ లోలుడనీ, లేడీపేషెంటకోసం ఎగబడతారనీ, ఎగ్జామినేషన్ టేబుల్‌పైన నానాభండాలం చేస్తారనీ...అయ్యో...ప్రతి వృత్తికీ వున్నట్లే వైద్యవృత్తికూడా ఎథిక్స్ అంటూ వున్నాయి గదండీ! అంతటి అపచారాలను ఎలా పాల్పడుతున్నారు? ఒక




డాక్టరుకు ఇట్లాంటి అపకీర్తి వస్తే మీ నర్సింగ్‌హోమ్‌కు ఏ ఆడది ధైర్యంగా వస్తుందండీ!"

మల్లికార్జున్ మొహం కోపోద్రేకాలతో కందగడ్డలాగా అయింది.

"ప్రియా! నిజానిజాలు తెల్సుకోకుండా నువ్వు అతిగా మాట్లాడుతున్నావు. డాక్టరనేవాడు వైద్యపరీక్ష చేసేటప్పుడు శరీరంలో అనేక భాగాల్ని చూడాల్సి వుంటుంది. పురుషుడైనా, స్త్రీ అయినా, పిల్లవాడైనా డాక్టరుకు ఒకటే. నీకు ఇన్ని అనుమానాలుంటే ప్రాక్టీస్ మానేస్తాను."

"మానేయండి" అంది ప్రియంవద గొంతు కాస్త హెచ్చించి. ఆ స్వరంలో ఏదో అధికారం గర్జన రూపంలో వెలువడింది.

మల్లికార్జున్ ఆశ్చర్యంతో నిలువునా నీరైపోయాడు- భార్య నోటి వెంట అంతటి తెగింపు గర్జన వెలువడేప్పటికి. రెప్పలార్పకుండా కొన్ని క్షణాలపాటు ఆమెకేసి చూశాడు.

ఆమె మొహం తీవ్రమై గంభీరంగా, కనకదుర్గమ్మకు ఆగ్రహం వచ్చినట్టుగా వుంది.

నెమ్మదిగా సిగిరెట్టు వెలిగించాడు మల్లికార్జున్-సిగిరెట్టు పొగతో ధూపం వేద్దామన్నట్టు. ఎప్పుడూ రానికోపం ఆడదానికొస్తే భరించే ధైర్యం కొంతమంది మగవాళ్ళకు మాత్రమే వుంటుంది.

"అవునండీ!ఎంత గొప్ప డాక్టరైతేనేం, ఎంత బిజీగా ప్రాక్టీసు వుంటేనేం, ఆవృత్తికిగల నైతిక సూత్రాల్ని పాటించకుండా అవినీతిగా ప్రవర్తిస్తుంటే – ఆ ప్రాక్టీసు దేనికి? వృత్తిద్వారా పదిమందికి మీరు మేలు చేయొచ్చు. కాని ఒక్కరికి అన్యాయం చేసినా ఆ మేలంతా కీడుగా మారుతుంది. కడివెడు పాలల్లో ఒక చుక్క విషం పడితే ఆ పాలకు విలువ ఏముంటుంది?"

ఆమె వంకే చూస్తూ నిలబడ్డాడు మల్లికార్జున్ దిగ్భ్రమ చెందిన మనస్సుతో.

"మనిషి ఉద్యోగం చేసినా, వ్యాపారం చేసినా, వృత్తిరీత్యా బతికినా, మరేది చేసినా నైతిక విలువల్ని కోల్పోకూడదు. కాలాలు మారినా, ప్రభుత్వాలు మారినా, చట్టాలు మారినా ప్రాథమికంగా మనిషి నైజాన్ని చట్రంలో బంధించే కొన్ని నైతిక విలువలుంటాయి. వాటిని గౌరవించనప్పుడు, వాటిని పాటించే మనోబలం లేనప్పుడు ఆ వృత్తికి స్వస్తి చెప్పడం మంచిది. ప్రాక్టీసుద్వారా ఇప్పటికే మీరు ఎంతో సంపాయించారు. ఆ ప్రాక్టీసు పేరుమీద ఇంకా అప్రదిష్ట తెచ్చుకోకముందే మానేస్తేమంచిదంటాను. ఇంట్లో వుండండి. భార్యా పిల్లలతో కాలక్షేపం చేయండి. క్షణం తీరికలేని డాక్టరుగారి భార్యగా, తాగుడు, క్లబ్బులు, పేకాట అలవాట్లుగల డాక్టరుగారి భార్యగా నిత్యమూ నేనుపడే అంతులేని వేదనకు ఫుల్‌స్టాప్ పెట్టండి. ఇల్లాలికి ఇంట్లో సుఖశాంతులు ముఖ్యం. తన కుటుంబశ్రేయస్సు తర్వాతనే ఇల్లాలికి లోకం శ్రేయస్సు. ఈ జీవితానికిది చాలు"

ఆవేశంతో వూగిపోతూ అంది ప్రియంవద.

"ఆలోచిస్తాను" అంటూ సిగిరెట్టు గోడపక్కకు విసిరి కోపంగా బయటకు కారుదగ్గరకు వెళ్లాడు మల్లికార్జున్.

* * *

ఆరోజు ఉదయం పేపర్లలో, వచ్చే

ఎన్నికల్లో ప్రదేశ్ కమిటీవారు అనేక నియోజక వర్గాలకు ఎం.ఎల్.ఏలుగా సిఫార్సు చేసిన అభ్యర్థులతో జాబితా విడుదలైంది. ఆ జాబితాలో డాక్టర్ మల్లికార్జున్ పేరుంది.

పట్టణంలో ఎంతో మందికి ఆశ్చర్యమేసింది.

సీటు కోసం ప్రయత్నించి, హైదరాబాద్ చుట్టూ కాళ్లు వేసుకొని తిరిగి, అంతో ఇంతో ఖర్చుచేసి, నానా యాతనలూ పడ్డ ప్రబుద్ధులంతా నెత్తిన కొంగు వేసుకొని, నిరాశా నిస్పృహలతో నీలుక్కుపోయారు.

అంతకు ముందెవ్వరూ డాక్టర్ మల్లికార్జున్ సీటుకోసం ప్రయత్నిస్తాడని అనుకోలేదు. పైపెచ్చు, వూపిరాడని ప్రాక్టీసుగల డాక్టరు. రోజుకు ఎట్లా లేదన్నా అయిదారు ఆపరేషన్లు చేస్తాడు సంప్రదింపులకోసం వచ్చే రోగులతో నర్సింగ్‌హోమ్ ఎప్పుడూ తొడతొక్కిడిగా వుంటుంది. ఒక్కోసారి గంటన్నర బయట బెంచీమీద కూర్చుంటేగానీ డాక్టరుగారితో ఇంటర్వ్యూ దొరకదు. అలాంటిది ఆయనెందుకు రాజకీయాల్లోకి దిగుతాడు? రాజకీయాలనేవి ఏ జీవన వృత్తిలో చెల్లుబడి కాక, పైకిరాలేక, అంతిమ లక్ష్యంగా బతుకుదెరువు కోసం ఆశ్రయించేవి. అట్లాంటి అవసరం మల్లికార్జున్‌కేమొచ్చింది?' అనుకున్నారు చాలా మంది.

ఆరోజు ఉదయం నర్సింగ్ హోమ్‌కు బయలుదేరే వరకూ పేపరు కూడా చదవలేదు మల్లికార్జున్. బాత్‌రూమ్‌లోంచి బయటకు రాగానే "డాడీ! నీకు ఫోన్" అంటూ కేకవేసింది సంధ్య.



ఫోన్ అందుకున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

"హల్లో..."

"........."

"ఆ హో బ ల రా వా? కంగ్రాచ్యులేషన్సా? ఎందుకు?"

"........."

"జాబితాలో నా పేరుందా? ఆశ్చర్యంగా వుందే! దరఖాస్తుపెట్టిన గుర్తు కూడా లేదే నాకు! అయినా రాజకీయాలు దేనికి నాకు? పొరబాటున వచ్చిందేమో! ఇంకా నేను పేపరు చూడలేదు"

ఆ తర్వాత 'కంగ్రాచ్యులేషన్స్' తెలియజేస్తూ నలుగురైదుగురు టెలిఫోను చేశారు. అందరితోనూ తన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు మల్లికార్జున్.

అప్పుడు పేపరు చూశాడు మల్లికార్జున్. తొలిజాబితాలో తమ నియోజక వర్గానికి అధికార పార్టీ అభ్యర్థిగా తన పేరుంది. నిజమే!

కాని, ఇదెలా జరిగింది? అఖిలేశ్వరీదేవి ప్రయత్నించి, పట్టుబట్టి, తన పలుకుబడి సంతా వినియోగించి తనకు టికెట్ తెప్పించి వుంటుంది. ఆమధ్య ఆమె హైదరాబాద్ వెళ్లివచ్చినప్పుడు తనతో అంది "మీకు టికెట్ వస్తుంది. ఈ లోపుగా తగిన గ్రౌండ్ తయారు చేసుకోండి" అని! కాని తాను తుస్కారంగా నవ్వి వూరుకున్నాడు. ఆమె మాటల్లో అంత నిజముందని అనుకోలేదు.

మల్లికార్జున్‌కు టెలిఫోన్ కాల్స్ రావడం, అందరూ కంగ్రాచ్యులేషన్స్ చెప్పడం విన్నది ప్రియంవద. ఆ కంగ్రాచ్యులేషన్స్ ఎందుకో, భర్తకు అంతహఠాత్తుగా ఏం అదృష్టం వరించిందో ఆమెకు అర్థం కాలేదు.

కాఫీని సేవిస్తూన్న మల్లికార్జున్‌ను

అడిగింది.

"ఏమిటి విశేషం?"

"ఇవాళ పేపరు చూడలేదా?"

"ఊహూ! పిల్లలు స్కూలుకెళ్లాక, మీరు నర్సింగ్ హోమ్‌కు వెళ్లాకగానీ పేపర్ను చూడను. అప్పటిదాకా నాకు తీరిక ఎక్కడిది?"

"నాకుఅధికారపార్టీవాళ్లుయం.యల్‌ఏ సీటు ఇచ్చారు ఈ నియోజక వర్గానికి"

కనుబొమలు ఆశ్చర్యంతో అరసెంటీ మీటరు వెడల్పుసాగాయి ప్రియంవదకు.

"మీరు రాజకీయాల్లోకి ఎప్పుడు దిగారు?" అంది ప్రియంవద.

"ఇంకా దిగలేదు"

"మరి టికెట్ ఎట్లా ఇచ్చారు?"

"అదే అర్థంకావడంలేదు" అన్నాడు మల్లికార్జున్ అమాయకంగా. అందులో నటనలేదు.

"మరిప్పుడు దిగుతారా రాజకీయాల్లోకి" అంది ప్రియంవద.

"నువ్వు డాక్టర్ ప్రాక్టీసు మానేయమంటున్నావుగా" అన్నాడు మల్లికార్జున్ వ్యంగ్యంగా.

ప్రియంవద సమాధానం చెప్పలేదు. ఏదో పనివున్నట్టు వంటగదిలోకి వెళ్ళింది. 'డర్టీ పొలిటిక్స్‌లోకి దిగేకంటే మెడికల్ ప్రాక్టీసే మంచిది' అనుకుంది ప్రియంవద.

ఉదయం ఎనిమిదిమ్ముప్పావుకు డాక్టర్ మల్లికార్జున్ కారు ప్రియంవద నర్సింగ్ హోమ్ ముందు ఆగింది. అతను కన్సల్టింగ్ రూమ్‌లోకి వెళ్ళబోతూండగా వరండాలో బెంచీలమీద బారులు తీర్చి కూర్చున్న పేషెంట్లు ఒక్కొక్కరే లేచి నమస్కారాలు పెట్టారు. కాలక్షేపం కోసం పత్రికలు, మెగజైన్లు చూస్తున్న వాళ్ళు కూడా వినయంగా లేచి నిలబడి నమస్కారం చేశారు.

ఇతరత్రా నర్సింగ్ హోమ్‌లకు, ప్రియంవద నర్సింగ్‌హోమ్‌కు కొన్ని ముఖ్యమైన వ్యత్యాసాలున్నాయి ఆ వ్యత్యాసాల్ని గుర్తించిన రోగులు ప్రియంవద నర్సింగ్‌హోమ్‌కు విరివిగా వస్తూంటారు. డాక్టర్ మల్లికార్జున్ అనవసరంగా రోగుల్ని తన నర్సింగ్‌హోమ్ గదుల్లో విశ్రాంతి తీసుకోనివ్వడు. కొంతమంది డాక్టర్లు పేషెంట్‌కున్న రోగాన్ని గోరంతలు కొండంతలుగా చెప్పి నర్సింగ్ హోమ్ రూమ్‌లో చేరమని సలహాఇస్తారు. "మీరు వెంటనే రూమ్‌లో చేరండి. డాక్టర్ రెండుపూటలా చూడాలి. ఏ క్షణం జబ్బు ఏ మలుపు తిరుగుతుందో చెప్పజాలం. మీ శ్రేయస్సుకోసమే చెబుతున్నా" అని డాక్టరన్న తర్వాత ఆరోగి నర్సింగ్‌హోమ్‌లో చేరకుండా ఎలా వుంటాడు? రోజుకు రూమ్ రెంట్ ఎనభై రూపాయలు. వారంరోజులుంటే డాక్టరు బిల్లుకంటె రూమ్ అద్దెబిల్లు జాస్తి అవుతుంది. కొన్ని నర్సింగ్‌హోమ్‌ల డాక్టర్లు తన ప్రాక్టీసు మీదకంటె రూమ్‌ల అద్దెల మీదనే ఎక్కువ సంపాయిస్తారు. ఒక నర్సింగ్ హోమ్‌లో డాక్టరు ఫీజు పది రూపాయలు మాత్రమే. అయితే ఆ డాక్టరు కాంపౌండరుకు రూపాయి, నర్సుకు రూపాయి, అటెండర్లకు రెండు రూపాయలు, ధర్మనిధికి రూపాయి అదనంగా వసూలుచేస్తారు. కొన్ని నర్సింగ్ హోమ్‌లలో పాథలాజికల్ లేబరేటరీ ఉంటుంది. తలనొప్పికీ, జలుబుకూ, మామూలు జ్వరానికీ, ఏ చిన్న జబ్బుకైనా రక్తపరీక్ష, యూరిన్ టెస్ట్ మొదలైనవి తమ పాథలాజికల్ లేబరేటరీలో చేయించాలని పట్టు

బడతారు. ఇతర చోట్ల చేసినవి పనికి రావు. బ్లడ్, షుగర్ ఎక్కడైనా చేయిస్తే నమ్మకముండదు, తమ దగ్గరే చేయించాలని మరీ మరీ చెబుతారు. ఆ డాక్టరుకు నర్సింగ్‌హోమ్ మీదకంటె పాథలాజికల్ లేబరేటరీమీద ఎక్కువ ఆదాయం వస్తుంది. మరో నర్సింగ్‌హోమ్ డాక్టరు భార్య ఎక్స్‌రేప్లాంట్ పెట్టింది. ఏ చిన్న జబ్బుకైనా ఆ డాక్టరు ముందు ఎక్స్‌రే ఫలానాచోట తీయించుకురమ్మంటాడు. కంటినొప్పికి, కడుపులో పొర్లుకూ, అరి

డాక్టర్ మల్లికార్జున్ కన్సల్టింగ్ రూమ్‌లోకి వెళ్ళేటప్పటికి అక్కడ అఖిలేశ్వరీదేవి కూర్చునివుంది.

"నమస్కారం ఎం.ఎల్.ఏగారూ!" అంది ఆమె.

"నన్ను డాక్టరుగా బతకనివ్వ



కాళ్ళ మంటలకూ, అతిమూత్ర వ్యాధికీ, [illegible]పీక్- దేనికైనా ముందు ఎక్స్‌రే కావాలంటాడు ఆ డాక్టరు. ఆ ఎక్స్‌రే తన భార్య ప్లాంట్‌లో తీస్తేనే చెల్లుబడి అవుతుంది. రోగుల దగ్గర్నుంచి ఇట్లాంటి పీడింపు, వేధింపు డాక్టర్ మల్లికార్జున్ నర్సింగ్‌హోమ్‌లో లేవు.

దల్చుకోలేదన్నమాట!" అన్నాడు మల్లికార్జున్ తన కుర్చీలో కూర్చుంటూ.

అఖిలేశ్వరీదేవి మొహమంతా నోప చేసుకుని నవ్వింది.

"ఏదో సామెత చెబుతారే...అదృష్టం అందలాలు ఎక్కిస్తూంటే బుద్ధి బురదలోకి లాగిందట - అట్లావుంది మీ వ్యవహారం!"

"అంటే?"

"ఇంకా పిల్లవాడికి అరటిపండు వొల్చినట్టు చెప్పాలా? ఆమాత్రం అర్థం చేసుకోలేరా?"

"చేసుకోగలను. కాని నాబోటివాడికి రాజకీయాలు దేనికి? నాకొద్దు ఆ ఎం.ఎల్.ఏ టికెట్"

అఖిలేశ్వరీదేవి కుర్చీలో మూర్ఛబోయినంత పనిచేసింది.

"అదేమిటి డార్లింగ్? మీరు ఈ టికెట్‌ను తిరస్కరిస్తే నేను మా పెరటి బావిలో దూకి సిలువునా ఆత్మహత్య చేసుకుంటాను"

"అదేం ఖర్మ?"

"మీకు అలానే కనబడుతుంది. మీకు టికెట్ రావడానికి నేనెంత కష్టపడ్డాను? నా ఇన్‌ఫ్లుయన్స్‌ను ఎంత ఉపయోగించాను? మీకోసం, ఆ టికెట్ మీకు రావడానికి నేనెంత త్యాగం చేశాను? ధన, మాన, ప్రాణాల్ని అర్పించాననుకో డార్లింగ్! ఇప్పుడు మీరు టికెట్ వద్దంటే నా కృషేం కావాలి? నా త్యాగమేం కావాలి? పెద్దవాళ్ళముందు నా పరువు మర్యాదలు పల్చబడిపోతాయి" అంది అఖిలేశ్వరీదేవి ఆదుర్దాగా.

"నాకోసం అంత కష్టమెందుకు పడాల్సివచ్చింది? నేను టికెట్ కావాలన్నానా? సంపాయించమని నిన్ను ప్రాథేయపడ్డానా?"

"లేదనుకో! అందులో నా స్వార్థం లేకపోలేదు. నాకు నేను టికెట్ తెచ్చుకోగలను. కాని నేను నిలబడితే నెగ్గలేను. ఆ భయం నాకుంది. నాకు ఇవ్వకపోతే ఆ టికెట్ ఆ బొగ్గు బిజినెస్‌మాన్ బాలసర్సయ్యకు పోయేట్టుంది. వాడికి పోవడం నాకిష్టం లేదు. అందుచేత మీకోసం ట్రై చేశాను. మీకు పాలిటిక్స్‌లో మహారాజయోగం వుండబట్టే టికెట్టు లభించింది. టప్పన్లో ఆ టికెట్ కోసం ఎంతమంది ప్రయత్నించారు? ఎన్ని వేల రూపాయలు కార్లలో తిరగడానికీ, హైద్రాబాద్, ఢిల్లీ హోటళ్ళలో వుండటానికీ తగలేశారు? అలాంటిది సునాయాసంగా మీకు టికెట్ తెప్పించి పెడితే వొద్దంటారేం? ఇదెక్కడి గోలంట"

ఆలోచనలో పడ్డాడు డాక్టర్ మల్లికార్జున్.

బయట నిరీక్షిస్తున్న పేషంట్లలో అసహనపు సందడి బయల్దేరింది.

అంతలో ఫోన్ మోగింది.

"హల్లో...."

"......"

"బాలసర్సయ్యగారా! నమస్కారం ఏదోలెండి! నాకు పెద్ద ఇంటరెస్టు లేదండీ... థ్యాంక్స్" ఫోన్ పెట్టాడు మల్లికార్జున్.

"ఆ కొబ్బరి పీచు మొహంవాడు ఫోన్ చేశాడా? తన ఏడ్పును వెళ్ళగక్కుకున్నాడన్నమాట! వాడికి రాజకీయాలూ, వ్యాపారాలూ ఒక్కటే! పాలిటిక్స్‌లో దిగడం వాడికి ఓ లైన్ ఆఫ్ బిజినెస్"

"సరే ఆయన్ని గురించి ఇప్పుడు పంచాంగం దేనికి? టికెట్ సంగతి ఆలోచిస్తాను. అవతల రోగులు క్యూలో వున్నారు. ఇప్పటికే ఎన్నో రకాలుగా తిట్టుకుంటూ వుంటారు. మళ్ళీ కలుసుకుందాం" అన్నాడు మల్లికార్జున్ ఆమెను పంపించే ఉద్దేశంతో.

"ఆలోచించడంకాదు. తప్పకుండా మీరు నిలబడాలి. తప్పకుండా గెలుస్తారు. మినిస్టరైతే సరేసరి, లేదా ఎం.యల్.ఏగా వుంటూ ప్రాక్టీసు చేసుకోవచ్చు. ఏదైనా మీకు నష్టం లేదు. మినిస్టరైతే ప్రాక్టీసు లేకపోయినా ఫర్వాలేదు. సంపాయించదల్చుకుంటే మహాలక్ష్మి పంచహస్తాలతో మీపై కనకవర్షం కురిపిస్తుంది"




డాక్టర్ మల్లికార్జున్ ఆ సంభాషణ తనకిష్టంలేదన్నట్టుగా చివుక్కున కుర్చీ లోంచి లేచాడు.

"మళ్ళీ కలుద్దాం"

మూతి మూడు వంకర్లు తిప్పివిసుగ్గా లేచింది అఖిలేశ్వరీదేవి- కుంకుమ చల్లిన ఎర్రబంతి పువ్వులాగ మొహం చేసుకొని.



## 7

నర్సింగ్‌హోమ్‌లో రోగుల్ని పరీక్ష చేస్తున్నా, చీటీల మీద మందులు రాసి ఇస్తున్నా డాక్టర్ మల్లికార్జున్ మనస్సంతా ఎం.యల్.ఏ టికెట్ పైనే వుంది. 'తాను అభ్యర్థిగా ఆ నియోజకవర్గంలో నిలబడటమా? అనివార్యకారణాలవల్ల అభ్యర్థిగా నిలబడలేనని ప్రదేశ్ కమిటీ ప్రెసిడెంట్‌కు టెలిగ్రాం ఇవ్వడమా?' అనే ప్రశ్నలతో, వాటికి సమాధానాల్ని వెతుక్కోవడంతో అతని మనస్సు అల్లకల్లోలంగావుంది.

రాజకీయాల్లో తనకు ఓనమాలు రావు. వాటిల్లో అభిరుచి లేదు. చదువుకునే రోజుల్లో స్టూడెంట్స్ కాంగ్రెస్, స్టూడెంట్స్ ఫెడరేషన్ పాలిటిక్స్ ముమ్మరంగా వుండేవి. తన ఫ్రెండ్స్ కొంతమంది అటూ, కొంతమంది ఇటూ చేరి ఎప్పుడూ ఆవేశకావేషాలతో కొట్లాటకు కాలు దువ్వుతూ వుండేవాళ్ళు. తనెప్పుడూ పట్టించుకొనేవాడుకాదు. ఎవ్వరేది చెప్పినా వినేవాడుకాదు. తనని కూడా ఏదో ఒక వర్గంలోకి లాగటానికి ప్రయత్నించారు. ససేమిరా జొరబడలేదు. తన వూళ్లో రాజకీయాల్లో కూడా ఎప్పుడూ తల దూర్చలేదు. ఆసక్తి చూపలేదు. అలాంటి తనకు ఈ ఎం.ఎల్.ఏ సీటు దేనికి? అఖిలేశ్వరి మాటలు విని తాను ముగ్గులోకి దిగితే ముప్పతిప్పలూ పడి మూడు చెరువుల నీళ్లు తాగాల్సిందే!

తనకు మంచి ప్రాక్టీసు వుంది. దీని మీద ఎంతో ఇంటరెస్టు వుంది. రాజకీలోకి దిగితే ఈ ప్రాక్టీసు మీద దృష్టిని కేంద్రీకరించడానికి వీలుండదు. ఒకవేళ ఎం.ఎల్.ఏగా నెగ్గితే నియోజకవర్గపు ప్రజల బాగోగులు చూడటంతోనే కాలమంతా సరిపోతుంది. వాళ్ళ సమస్యలన్నింటినీ ఓపిగ్గా వినాలి. కుళాయిల్లో నీళ్లు రాకపోయినా, కరెంటు దీపాలు వెలగకపోయినా, పబ్లిక్ రోడ్డు మీద మురికినీరు చేరినా, ఓ ఎలిమెంటరీస్కూలు టీచరు ట్రాన్స్‌ఫర్ కావాల్సి వచ్చినా, రిక్షా తొక్కేవాళ్లసమస్యలుపరిష్కరించాలన్నా.. ఇట్లాఎన్నెన్నోసమస్యలు.ఎంతెంతమందో అభ్యర్థనలు...ఏవేవో పనులు, సభలు, సమావేశాలు ... ప్రజాప్రతినిధిగా బతకడమనేది ప్రత్యేక నైపుణ్యంతో కూడిన వ్యవహారం..ఆ జీవన విధానంవేరు... ఆ రాజకీయబాటలో ఎన్నో ఎగుడు దిగుళ్లు...మోసాలు ... కక్షలు...కార్పణ్యాలు...ఎదుటివాణ్ని పైకి రానివ్వకుండా పన్నాగాలు...తాను పైకివెళ్ళే మార్గాన్ని ఎంత నీచానికి దిగైనా సుగమం చేసుకోవడం...ఇట్లాంటివి తన స్వభావానికి సరిపడవు....

ఆరోజు ఆపరేషన్లు ఏమీలేవు. ఒకటి రెండు మైనర్ ఆపరేషన్లువున్నా మధు

నాటికి వాయిదా వేశాడు మల్లికార్జున్.

లంచ్‌కి ఇంటికెళ్లినప్పుడు భార్యను సలహా అడిగాడు మల్లికార్జున్.

"రాజకీయాలు కూడా ఒక వృత్తే. మీరే తేల్చుకోండి!" అంది ప్రియంవద.

"తేల్చుకోలేకనేగదా నీ సలహా అడుగుతూంట"

"మీకు సలహాచెప్పేంత ఎత్తుకు ఎదగలేదు. మీరూ, పిల్లలూ, ఇల్లూ ముఖ్యం నాకు. ఊరూ, వాడా, రాష్ట్రం, దేశం, ప్రపంచం ఆ తర్వాత. ఏది సబబుగా మీ ఆత్మకు తోస్తే అలా చేయండి. రాజకీయాలు పద్మవ్యూహంకంటె ఎక్కువగా చిక్కులతో కూడుకున్నవి. నీతి నిజాయితీలకు పూర్తిగా నీళ్లు వదులుకున్న వాళ్లే రాజకీయాల్లో బాగా రాణించగలరు" అంది ప్రియంవద.

భార్య సూటిగా చెప్పకపోయినా ఆమె మనోవైఖర్ని గమనించాడు మల్లికార్జున్.

ఆ సాయంత్రం నర్సింగ్‌హోమ్‌కు టెలిఫోన్ చేసింది అఖిలేశ్వరీదేవి.

"ఈ రాత్రికి మా ఇంటికొస్తారా?"

"ఎందుకు?"

"మాట్లాడటానికి డార్లింగ్!"

"ఇంతకుముందేనిర్ణయించుకున్నాను"

"ఏమని?"

"రాజకీయాలజోలికి పోవద్దని"

"అదేమిటి డార్లింగ్! నన్ను నిలువునా హత్యచేశావు"

"నువ్వు తెచ్చుకోటికెట్! నువ్వు గెలపడానికి అన్నివిధాలా సాయంచేస్తాను. ఇప్పుడు మించిపోయిందిలేదు. తెల్లచొక్కా విప్పి, మరో రంగుచొక్కా వేసుకోదల్చుకోలేదు. నా కోసం పాటుబడినందుకు మెనీమెనీ థ్యాంక్స్"

ఫోన్ పెట్టేశాడు డాక్టర్ మల్లికార్జున్. లేకపోతే అరగంటసేపు ఆమె మాట్లాడుతుందని అతని భయం.

అయినప్పటికీ అఖిలేశ్వరీదేవి అరగంటలో టాక్సీవేసుకు నర్సింగ్‌హోమ్‌కు వచ్చింది ధుమధుమలాడుతూ.

ఆమెచేతికి ఓ కాగితం ఇచ్చాడు మల్లికార్జున్.

ఆ కాగితం చూడగానే అఖిలేశ్వరీదేవి మొహం ఎండదెబ్బతగిలిన తోటకూర కాడలాగైంది.

ప్రదేశ్ కమిటీ ప్రెసిడెంట్‌కు అనివార్య కారణాలవల్ల యం.యల్.ఏ. టికెట్‌ను తిరస్కరిస్తున్నట్టు, మరెవ్వరికైనా కేటాయించవల్సిందనీ కోరుతున్నట్టు ఇచ్చిన టెలిగ్రాం నకలు అది.

* * *

మధ్యాహ్నం పన్నెండున్నర కావొచ్చింది.

ఎండ మిడిసిపడుతోంది బయట.

రెండో నెంబరుమీద సీలింగుఫ్యాన్ తిరుగుతూంటే ఓ తెలుగు నవల చదువుకుంటూకూర్చుంది ప్రియంవద సోఫాలో. డాక్టర్ మల్లికార్జున్ లంచ్‌కి వచ్చేవరకూ ఆమెకు పని ఏంలేదు. ఆ నవల కథాగమనంలో పూర్తిగా నిమగ్నురాలై గోడమీద గడియారంలో నిముషాలముల్లు తిరిగినట్లుగా నవలపేజీల్ని తిప్పుతోంది.

బయట బజర్ మోగింది.

చిరాగ్గా లేచింది ప్రియంవద 'ఎవరు?' అనుకుంటూ.

ఏదైనా చదువుకుంటూన్నపుడు, ఆ చదివేది ఉత్కంఠ కలిగిస్తూన్నప్పుడు ఏదైనా ఆటంకం కలిగితే ఆమెకు తగని చిరాకువేస్తుంది.

తలుపు తీసింది ప్రియంవద.

ఎదురుగ్గా ఇరవైఏళ్ళ ఓయువతి




రెండుచేతులూజోడించింది నమస్కరిస్తూ.

అయిదు అడుగుల అయిదు అంగుళాల ఎత్తువుంటుంది. సీగ్రీన్ బ్యాక్‌గ్రౌండ్‌మీద అరచేతి వెడల్పున్న పువ్వుల డిజైన్‌తో గల గోల్డెన్ శారీ ధరించింది. జాకెట్టుకూ, చీర కట్టుకూమధ్య ఎనిమిదంగుళాల పొట్ట కనబడుతోంది. బొడ్డు కిందకు చీర కట్టింది. లోనెక్ జాకెట్టు ధరించింది. పయస్సుకు మించిన సైజులో వక్షోజాలు వున్నప్పటికీ, మనిషి పొడగరి కావటంతో అవి శరీరానికి ప్రత్యేకమైన అందాన్నే ఇచ్చాయి. భుజాలు వెడల్పు. మెడ సుంద్రదంగావున్నా, కొంచెం పొడుగ్గా వున్నట్లు అనిపిస్తుంది. కోలమొహం. బుగ్గలు నిండుగావున్నాయి. కోల మొహా నికి సోయగాన్ని ఇచ్చే రీతిలోనే తల కట్టువుంది. జఘనాలు దాటిన జడ. నుదుటి మీద రెండు కనుబొమలమధ్య 'శింగార్' బొట్టు. కళ్లు మెరగ్గా, మగవాడి మనస్సును ముగ్ధమోహనంగా కవ్వించేంత ఆకర్ష ణీయంగా వున్నాయి. మెడలో సింపుల్‌గా ఒంటిపేట గొలుసు. అది బంగారుదో, రోల్డ్‌గోల్డుతో పట్టుకుచూస్తేగానీ తెలియదు మరి. చేతులకు మట్టిగాజులు చీర రంగుతో మ్యాచ్ అవుతున్నాయి. కాళ్లకు చెప్పులో, హైహీల్సో-కుచ్చెళ్ళ చాటున తెలియడంలేదు. చెవులకు రింగులు. శరీర ఛాయ మేలిమి బంగారం. మొదటి చూపులోనే ఆమె సహజ సౌందర్యవతి అనే భావం ఎవరికైనా కలుగుతుంది. స్నో, పౌడర్లతో మొహానికి అదనంగా ఏమీ మెరుగులు పెట్టినట్టులేదు. అయితే ఆమె మొహం ప్రసన్నంగాలేదు. ఏదో ఆందోళన, ఆదుర్దా ద్యోతకమవుతోంది. ఆమె కళ్ళలో అంతుతెలీని విషాదం కొట్టొచ్చినట్టు వ్యక్తమవుతోంది. ఆమెను ప్రియంవద చూడటం అదే మొదటిసారి. అందుచేతనే ఓ నిముషంపాటు ఆపాద మస్తకమూ పరిశీలనగా చూసింది.

"ఏంకావాలి?" అంది ప్రియంవద ఆమెను గుమ్మంఎదుటమెట్ల మీదనిలబట్టే.

"మీతో అయిదు నిముషాలపాటు మాట్లాడాలి."

"నాతోనా?" అంది ప్రియంవద ఆశ్చర్యంగా.

"అవునండీ! డాక్టర్ మల్లికార్జున్‌గారి భార్యగదూ మీరు''

"అవును"

"మీతో పనుండి వచ్చాను"

కొన్ని క్షణాలపాటు మళ్ళీ ఆమెను నఖశిఖ పర్యంతం చూసింది ప్రియంవద. ఆమె మనస్సులోకి ఏభావమూ రాలేదు.

"రండి లోపలకు"

ప్రియంవద వెంటే డ్రాయింగ్ హాల్‌లోకి వచ్చిందామె.

"కూర్చోండి"

ప్రియంవద ఎదురుగ్గానే సోఫాలో కూర్చుందామె.

ఆ డ్రాయింగ్‌రూమ్‌లోని ఫర్నిచర్, గోడలకున్న బొమ్మలు, నేలమీద కార్పెట్ అన్నింటికేసి ఆమె కొత్తగా చూస్తూ వుండగా-

"మీ పేరు?" అంది ప్రియంవద.

ఆమె కొద్దిగా ఖంగుతిన్నట్టు సర్దుకుని కూర్చుంది.

"వినోదిని"

ప్రియంవద కనురెప్పలు అల్లల్లాడిం చింది ఆ పేరు కొత్తగా కనపడి.

"ఏం చేస్తుంటారు?"

"ఇక్కడ ఆక్స్‌ఫర్డ్ కాన్వెంట్‌లో టీచరుగా పనిచేస్తున్నాను"

"మీకు నాతో పనేమిటి?"

వినోదిని కొన్ని క్షణాల పాటు మౌనంగా ప్రియంవద కేసి సూటిగా చూస్తూ కూర్చుంది – తాను వచ్చిన పని చెప్పడమా, మానడమా అన్నట్టు. ఆమె సందేహాత్మను ప్రియంవద గ్రహించింది.

"చెప్పండి. సందేహిస్తారేం?"

అప్పటికీ ధైర్యం చాలనట్టు వినోదిని మొహాన్ని అదోరకంగా పెట్టింది. అది భయమో, ఓడియమో ప్రియంవదకు అర్థంకాలేదు.

"ఇంత దూరమొచ్చి మౌనంగా కూర్చుంటారేం? భయపడాల్సింది ఏమీ లేదు" అంది ప్రియంవద మళ్ళీ.

"నేను డాక్టర్ మల్లికార్జున్‌గారిని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను. ముందుగా మీ అనుమతికోసం, ఆమోదం కోసం వచ్చాను"

పైన తిరుగుతున్న సీలింగ్‌ఫ్యాన్‌జారి నెత్తిమీద దభీమని పడినట్లయింది ప్రియంవదకు. తలంతా దిమ్మెక్కింది. కళ్ళు గిర్రున తిరిగాయి. వొళ్ళంతా స్వేదం కమ్ముకుంది. కాళ్ళకింద ఫ్లోర్ కదిలి నట్లయింది.

తన భర్తను ఆమె పెళ్ళిచేసుకోవాలనుకుంటోందా?

అదెట్లా సాధ్యం?

ఆయన వొప్పుకున్నాడా?

ముందుగా తన అనుమతి కోసం. ఆమోదం కోసం వచ్చిందా?

ఎంత ఘోరం? ఎంత విపరీతం?

తాను బతికుండగానే అది జరుగుతుందా?

ప్రియంవద భౌతికంగా తేరుకొనేసరికి మూడునిముషాలు పట్టింది. అప్పటిదాకా ఎదురుగ్గా కూర్చున్న వినోదినికేసి పిచ్చిగా, అద్భుతాశ్చర్యంతో, అయోమయంగాచూస్తూ కూర్చుంది నిలువు చూపుతో.

"డాక్టర్ మల్లికార్జున్ మిమ్మల్ని ప్రేమించాడా ?" అంది ప్రియంవద హీనస్వరంతో.

"లేదు కామించాడు"

"అంటే"

"మీకు వినే ఓపికవుంటే అయిదు నిముషాలపాటు నా గురించి చెప్పుకుంటాను. వింటారా?"

"చెప్పండి"

"మాది ఈ పక్కనే కొలనుకొండ. మానాన్న రాతిక్వారీ మేస్త్రీ. కూలీలచేత రోజూ కొండలో కొంత భాగాన్ని కొట్టించి లాట్లుగా కట్టించి, లారీలకు ఎక్కించడం ఆయనపని. కాంట్రాక్టరు నెలజీతం ఇస్తూవుంటాడు. కూలీలకు దినకూలీ మొత్తాన్ని వాళ్ళు వాళ్ళు చేసినపని పరిమాణాన్నిబట్టి మానాన్నే బట్వాడా చేస్తూవుంటాడు"

"ఊఁ!"

"మా నాన్నకు నలుగురు ఆడపిల్లలం. మగపిల్లలులేరు. మా అక్క పెద్దగా చదువుకోలేదు ఎనిమిదోక్లాస్ రెండుసార్లు తప్పగా ఇంట్లో పనుల్లోపెట్టారు. మా అమ్మ రోగిష్టిది. ఉబ్బసంవ్యాధి. శీతాకాలమంతా మంచంమీదనుంచి లేవదు. హైద్రాబాద్‌లో చేపమందు తిన్నా ఉబ్బసంవ్యాధి తగ్గలేదు. ఎన్నెన్నో వైద్యాలు చేయించాం కాని ఆమెరోగం తగ్గలేదు. కొంత కాలం బావుండేది. మా నాన్న బాగా పని చేసేవాడు, డబ్బు సంపాయించేవాడు. అయితేయేం ఆయనకొక బలహీనత వుండేది. అదిబలహీనతకాదు– వ్యసనం. రోజూ సాయంత్రమయ్యేటప్పటికి కుతికెమీరా తాగి ఇంటికొచ్చేవాడు. ఇంత తిని పడుకొనేవాడు. అంతేగాని ఏమాత్రం





గోల చేసేవాడు కాదు.

"నేను చదువుకొనేదాన్ని. క్లాసులో ఎప్పుడూ ఫస్టుమార్కులు వొచ్చేవినాకు. మావూళ్లో మంచి స్కూలులేదు. రోజూ సీతానగరం వెళ్ళి అక్కడ స్కూల్లో చదువుకొనేదాన్ని స్కూలు ఫైనల్లో మొదటితరగతిలో ప్యాసయ్యాను. కాని నాకు పైచదువులు చదవాలని వుండేది. కనీసం బి.ఎ. అయినా పూర్తిచేద్దామని నా పట్టుదల. అంతలో మా అమ్మ చని పోయింది జబ్బుముదిరి. విజయవాడవెళ్ళి చదువుకోవాలి. అప్పటికే మా అక్క పెళ్ళయింది. వూళ్లోనే ఓ కూలీకుర్రాడి కిచ్చి చేశాడునాన్న- కుటుంబానికి ఆస రాగా వుంటాడని. నేను ఇంటర్ చదవా లంటే విజయవాడవెళ్ళి చదువుకోవాలి. మిగతా చెల్లెళ్ళు ఏదో వానాకాలం చదువులు చదువుతున్నారు. వాళ్ళకూ చదువులమీద ఏమంత ధ్యాసలేదు.

"నన్ను విజయవాడ కాలేజీలో చేర్పించడానికి నాన్న ఇష్టపడలేదు. నాకూ పెళ్ళిచేసి బయటకు పంపించాలని మానాన్న ఉద్దేశం. కాని నాకు చదువుకో వాలని, ఏదో ఉద్యోగం చేయాలని, ఇంటి ఆచారాలకు సాంప్రదాయాలకు భిన్నంగా బతకాలని నాకు విపరీతంగా వుండేది. నాన్న అదేమీ కుదరదన్నాడు. రెండుపూటలు అన్నం మానేసి అలిగాను. కాని నాన్న తన పట్టు వీడలేదు. ఆయనకు చదువు సంధ్యలమీద మొదట్నుంచీ గౌరవం లేదు. 'చదువుకున్నవాడికంటె కాయకష్టంచేసుకొనేవాడు మేలు.అందులో ఆడపిల్లల చదువులు అక్షరంముక్క అబ్బడానికేగానీ, ఉద్యోగాలు చేయడాని క్కాదు.' అంటూండేవాడు. బాబాయిని ఆశ్రయించాను. నాన్నను ఒప్పించమని బతిమిలాడాను. బాబాయిమాట నాన్న వింటాడు. బాబాయి గట్టిగా చెప్పాడు. దాంతో నాన్న ఒప్పుకున్నాడు.

"అయితే కాలేజీలో చేర్పించడానికి తనదగ్గర డబ్బు ఏమీ లేదన్నాడు నాన్న. బాబాయ్ మూడొందలు ఇచ్చాడు ఫీజుకూ, పుస్తకాలకూ. కాలేజీలోచేరాను. ఇంటర్మీడి యట్ పాసయ్యాను ఫస్ట్ క్లాసులో. 'చది వింది చాలు. ఇకముందు చదువుకు పెట్టుబడిపెట్టే తాహతు నాదగ్గరలేదు. చదువు మానేయ్' అన్నాడు. బాబాయ్ దగ్గరకువెళ్ళి కళ్ళనీళ్లు పెట్టుకున్నాను. 'చదువుకోమ్మా! మీ నాన్నకు ముందు చూపులేదు. మొండిమనిషి. ఈ రోజుల్లో మగపిల్లలు చదువుకున్నా, ఆడపిల్లలు చదువుకున్నా ఒకటే. ఇద్దరికీ ఉద్యోగావ కాశాలున్నాయి. నేనిస్తాలేడబ్బు'అన్నాడు బాబాయ్. బాబాయ్ మళ్ళీ విజయవాడలో కాలేజీలో చేర్పించాడు.

"నేను బి.ఎ. పూర్తిచేసేలోపుగా నా చెల్లెలు పెళ్ళయింది. నా పెళ్ళి చేయాలని నాన్న ఎంతో పట్టుబట్టాడుగానీ బి.ఏ అయిందాక చేసుకోననీ, కాదూకూడదంటే కృష్ణా నదిలోదూకి చస్తానని అన్నాను. బాబాయ్ కూడా నన్ను సమర్థించి చెప్పాడు. 'నీ ఖర్మ ఎలా వుంటే అలా జరుగుతుంది' అనివూరుకున్నాడు నాన్న.

"బి.ఏకూడా ఫస్టుక్లాసులో పాసయ్యాను. ఆ తర్వాత ఉద్యోగంకోసం ఎన్నో చోట్లకు దరఖాస్తులు పెట్టాను. రెండు మూడుసార్లు కాంపిటీషన్ టెస్టులు కూడా రాశాను. కాని చివరకు నా అవస్థచూసి, బాబాయే ఎవరో సిఫార్సుతో ఒక కాన్వెంటులో టీచరు ఉద్యోగం ఇప్పిం చాడు. జీతం స్కేలులేదు. ముందుగా నెలకు నాలుగొందలు ఇస్తామన్నారు.

టీచింగ్ నచ్చితే ఆర్నెల్లుపోయాక స్కేలు ప్రకారం జీతమిస్తామన్నారు. ఈ నిరుద్యోగ సమస్య సర్వత్రా వ్యాపించిన ఈ రోజుల్లో ఆ మాత్రం పట్టుదొరికితే చాలని సంతృప్తిపడ్డాను...."

ప్రియంవద ఆసక్తిగా వింటోంది- ఏ మాత్రం విసుగు కనబర్చకుండా.

"ఆఁ...తర్వాత"

"వళ్ళువంచి పనిచేస్తున్నాను. టైం ప్రకారం రెగ్యులర్‌గా క్లాసులకు వెళుతున్నాను. పిల్లలకు చదువుచెప్పే విధానాన్ని హెడ్‌మిస్ట్రెస్ అప్పుడప్పుడూ చాటుగావచ్చి గమనిస్తూ వుండేది. ఆర్నెల్లు గడిచాక నాకు స్కేలుఇచ్చి టీచరు ఉద్యోగంలో ఖాయంచేశారు. ఆరోజెంతో సంతోషపడ్డాను. స్కేలు ప్రకారం జీతం తీసుకున్నాక నాన్నకూ, బాబాయికీ బట్టలు కొని తీసుకెళ్ళి ఇచ్చాను. నాన్న ఎంతో సంతోషించాడు. 'నువ్వింత ప్రయోజకురాలివి అవుతావనుకోలేదు. చదువుకోవాలనే నీ ఆసక్తికి ఎన్నో ఆటంకాలు కల్పించాను. నీ మనస్సునెంతో క్షోభపెట్టాను' అన్నాడు నాన్న కళ్ళనీళ్లపెట్టుకొని. బాబాయి నాకు ప్రోత్సాహం ఇచ్చాడు." మన వంశంలో ఈ మాత్రం



చదువుకున్న ఆడది ఏవేపు చూసినా ఏడు తరాల దూరంలో లేదమ్మా! చక్కగా వుద్యోగం చేసుకుని, పైవాళ్ళనుమెప్పిస్తూ ఎంతో వృద్ధిలోకి రావాలమ్మా! బాగా చదువుకున్న వాణ్ని చూసి, ఉద్యోగస్థుణ్ని వెతికి నీకు పెళ్ళిచేసే బాధ్యత నాదమ్మా! ఎంత చదువుకున్నా, ఏం ఉద్యోగం చేస్తూన్నా ఇంటి గౌరవాన్ని కాపాడల్సిన కర్తవ్యం నీపైన వుందమ్మా! ఈ రోజుల్లో చదువుకున్న ఆడవాళ్లు ఇంటిదనానికీ, నైతిక విలువలకూ అంత ప్రాముఖ్యత

ఇవ్వరనే అపప్రధ వుంది. ఆ విషయంలో నువ్వు జాగ్రత్తపడతావని నాకు నమ్మక ముందమ్మా!" అన్నాడు బాబాయి. బాబాయి లోకంతీరు తెల్సిన మనిషి. వ్యవహారజ్ఞాని. ఆచరణకూ, అనుభవానికీ బేరీజువేసుకొని సమతూకంగా మాట్లాడే మనిషి. మావూళ్లో కూడా 'పెద్దమనిషి'గా ఆయన కెంతో గౌరవం వుంది. ఆయన మాటల్లో ఎంతో ముందుచూపు, లోకజ్ఞత నాకు తోచింది. 'అల్లాగే'నని తలాడించాను.

"ఈ సమాజంలో ఆడదానిస్థితి అరిటాకు–ముల్లు చందమని మీకు తెలియంది కాదు. అలాంటి దుస్థితిలోనే నేను ఇరుక్కున్నాను..."

"అంటే" అంది ప్రియంవద ఆశ్చర్యంగా.

"ఇప్పటిదాకా నా పుట్టు పూర్వోత్తరాలు, నేను పెరిగిన, చదివిన, ఉద్యోగం చేస్తూన్న విషయాల్ని అనవసరంగా చెప్పి మిమ్మల్ని బోర్ చేశాను. కాని విషయాన్ని పూర్తిగా అర్థంచేసుకోవాలంటే, నా సమస్య పూర్వాపరాల్ని అవగాహన చేసుకోవాలంటే ఆమాత్రం కుటుంబ చరిత్రను వివరించక తప్పదు. ఏమంటారు?"

మౌనంగా వినోదిని మొహంకేసి చూసింది ప్రియంవద.

"రోజూ మా వూరినుంచే విజయవాడ వెళ్ళి వస్తూండేదాన్ని. ఒక్కదాన్నే పట్టణంలో రూమ్ తీసుకొని వుండటమంటే మాటలుకాదు. అందువల్ల ఎన్నో ఇబ్బందులున్నాయి. విజయవాడ పోయి రావడానికి ఎన్నో రైళ్లున్నాయి. స్టేషనుకు మా స్కూలు దగ్గరే. నడిచే వెళ్ళేదాన్ని. నడిచే మళ్ళీ సాయంత్రంపూట స్కూలు నుండి వచ్చేదాన్ని. ఎందుకో సడన్‌గా నా ఆరోగ్యం దెబ్బతింది. రోజూ రెండు పూటలూ తలనొప్పి వచ్చేది. కొన్నాళ్ళు ఆ బాధ భరిస్తూ తిరిగాను. అక్కడికీ రెండ్రోజులు స్కూలుకు సెలవు పెట్టాను. స్కూలుకు సెలవు పెట్టకుండా పనిచేయాలని నా పట్టుదల. అట్లా సెలవు పెట్టకుండా సంవత్సరం పొడవునా పనిచేసే టీచర్లకు మేనేజ్‌మెంట్‌వారు సంవత్సరం చివర వార్షికోత్సవంనాడు ఒక నెల జీతం బోనస్‌గా ఇస్తారు. ఆ పేరు సంపాయించాలని నాకుండేది. కాని శిరోభారంచేత రెండ్రోజులు సెలవుపెట్టక తప్పలేదు. చివరకు ఒక మంచి డాక్టరుకు చూపెట్టుకుందామని నిర్ణయించుకున్నాను. వాకబు చేయగా డాక్టర్ మల్లికార్జున్‌గారు మంచి డాక్టరని తెల్సింది. ఒకరోజు సాయంకాలం ఆయన నర్సింగ్‌హోమ్‌కు వెళ్లాను. కన్సల్టింగ్ రూమ్‌లోకి పిలవగా వెళ్లాను. అదే డాక్టర్ మల్లికార్జున్‌ను మొదటిసారిగా నేను చూడటం. అందరు డాక్టర్లలాగా ఆయన వుంటాడనుకున్నాను. కాని ఆయన చేష్టలు నాకు వింతగా, విపరీతంగా, పోకిరీగా, అశ్లీలంగా కనబడ్డాయి.."

కొన్ని క్షణాలపాటు చెప్పడాన్ని హఠాత్తుగా ఆపివేసింది వినోదిని.

ప్రియంవదలో ఉత్కంఠ హెచ్చింది
"చెప్పండి"

"ఎగ్జామినేషన్ టేబుల్‌మీద పడుకోమన్నారు. అసలు నేను గదిలోకి వచ్చేటప్పుడే నన్ను నిలువునా వివస్త్రనుచేసి చూసినట్టుచూశారు... ఆయన స్వభావం 'అంతేనేమో' అనుకున్నాను. ఆయన చెప్పినట్టుగా టేబుల్‌మీద పడుకున్నాను. స్టెతస్కోప్‌తో గుండెలమీద పరీక్షించారు. వూపిరి పీల్చమన్నారు. పొదల




మన్నారు. తలనొప్పికీ, గుండె పరీక్షకూ సంబంధమేమిటని మొదట్లో అనుకున్నాను. కాని ఏదైనా సంబంధముంటుందేమో, వైద్య పరీక్ష గురించి నాకేం తెలుసు డాక్టరు ఏం చెబితే అది చేయడం ధర్మం గదా అనుకున్నాను. స్టెతస్కోప్‌తో రెండు మూడుసార్లు నా రొమ్ముల్ని నొక్కారు. వొళ్లు జలదరించింది. పొరపాటున అది నా రొమ్ములకు తగిలిందేమో అనుకున్నాను. లేచి కూర్చోమన్నారు. టేబుల్‌పైనే కూర్చున్నాను. వయసెంత అన్నారు. చెప్పాను. ఏం చేస్తూంటారు అన్నారు...చెప్పాను. ఎక్కడుంటారు అన్నారు ... చెప్పాను. నా జబ్బును పరీక్షించటానికీ, నా వ్యక్తిగత వివరాల్ని అడగటానికీ సంబంధమేమిటో నాకు బోధపడలేదు. అయినా కొంతమంది డాక్టర్లు రోగ నిర్ధారణ చేసేముందు వంశవృక్షం వివరాలన్నీ అడగటం కద్దని సమాధానపడ్డాను.

"నేను టేబుల్‌మీద కూర్చునేటప్పుడు నా పైట కొద్దిగా జారింది. నా రొమ్ముల కేసి అదేపనిగా, కామ ప్రకోపనంగా చూశారు. సిగ్గుపడి పైటను పైకి లాక్కొన్నాను.

"'పైట తొలగించు' అన్నారాయన చిరునవ్వుతో."

ప్రియంవద ముఖం చిట్లించుకుంది బాధగా. అది గ్రహించింది వినోదిని.

"అన్యధా భావించకండి మేడమ్. నేను జరిగింది జరిగినట్టు చెబుతున్నాను నాకు జరిగిన అన్యాయాన్ని చెప్పుకోవడానికి. ముక్కూ మొహం తెలీని అడది సెక్స్ చేష్టల్ని గురించి చెబుతూంటే ఎబ్బెట్టుగా, రోతగా వుండొచ్చు. చేయని నేరానికి, జరిగిన ఘోరాన్ని కళ్ళకు కట్టినట్టుగా చెబితేగానీ నా ఆవేదన తీరదు" ఏమంటారు?"

'చెప్పండి' అన్నట్టు కళ్ళతో సైగ చేసింది ప్రియంవద.

"నేను పైట తొలగించలేదు. డాక్టర్ని పేషెంట్ అనుమానిస్తే ఎగ్జామినేషన్ చేసేదెట్లా అన్నారాయన చిరుకోపంగా. ఎదురుచెప్పలేక పైట మెల్లగా జార్చాను. ఓ నిముషంపాటు నా రొమ్ముల సైజునూ, సోయగాన్నీ చూశారు. ఆ తర్వాత ఆయనే పైట భుజాలమీద కప్పారు. 'ఒంట్లో ఒక భాగంలో నొప్పికి మరేదైనా భాగంలో అనవసరమైన పెరుగుదల కారణం కావచ్చు' అన్నారాయన. నిజమే కాబోలుననుకున్నాను. తర్వాత పడుకోమన్నారు. మళ్ళీ ఎగ్జామినేషన్ టేబుల్‌పైన కాళ్లు సాచి పడుకున్నాను. మోకాళ్ళకింద వరకూ చీరతొలగించి చూశారు. 'కుడికాలు మడమపైన కుంకుడు కాయంత కాయ వుంది ... గట్టిగా, నల్లగా. అదేమిటని అడిగారు. చెప్పాను - చిన్నతనంలో ఆటలాడుతుంటే ఓ దెబ్బ తగిలి అట్లా అయిందని.

"ఆయన పెదవులు బిగించి ఓ నిముషంపాటు సీరియస్‌గా ఆలోచించారు. నాకు అంతుబట్టలేదు. కిందకు దిగమన్నారు. ఎగ్జామినేషన్ అయిందని గబుక్కున దిగాను..."

"ఆ గదిలో ఎవ్వరూలేరా?" అంది ప్రియంవద.

"ఎవ్వరూలేరు. నేను వచ్చేముందు ఓ నర్సువుంది. ఆమెను ఫార్మసీ రూమ్‌లోకి వెళ్ళి ఓ మందు తీసుకొని రూమ్ నంబరు త్రీలోకి వెళ్ళి పేషెంట్‌కు ఇచ్చి రమ్మని చెప్పారు. ఆమె వెళ్ళింది"

"ఆతర్వాతేం జరిగింది?" అంది

ప్రియంవద.

"జరగరాని ఘోరం ఆ తర్వాతనే జరిగింది" అంది వినోదిని గొంతులో దుఃఖం జవజవలాడగా.

"ఏమిటది?" అంది ప్రియంవద ఉత్సుకతతో.

"ఓ మైనర్ ఆపరేషన్ చేయాలిఅన్నారు డాక్టరుగారు. నాగుండె గుభేల్ మంది. 'ఆపరేషనా' అన్నాను భయపడుతూ. 'ఆపరేషనంటే అంత పెద్దదికాదు. చాలా మైనర్. అయిదు నిముషాల్లో అయి పోతుంది. కాలిమీద కరుడుగట్టిన ఆకాయ తీసివేస్తేనేగాని మీ తలనొప్పి తగ్గదు. వెంటనే దాన్ని తీసివేయకపోతే క్యాన్సర్ లక్షణాలు 'డెవలప్' అయ్యే ప్రమాద ముంది' అన్నారాయన. 'క్యాన్సర్' అనగానే నా ప్రాణం గాలిలో కల్సినంత పనయింది. ఎక్కడో చదివాను- చిన్నప్పుడు తగిలిన గాయాలు కరుడుగట్టి ఒక్కొక్కప్పుడు క్యాన్సర్‌కు దారి తీయొచ్చని. అంచేత నాలో అంతులేని భయం వ్యాపించింది. వెంటనే ఆపరేషన్‌కు ఒప్పుకున్నాను. అయితే నా దగ్గర యాభై రూపాయలకంటేలేవు. ఆ సంగతి చెప్పాను డాక్టరుగారితో. 'దానిదేముంది? మైనర్ ఆపరేషన్ కాబట్టి అంత డబ్బుచాలు. ఆపరేషన్ అయింతర్వాత పావుగంటలోనే మీరు మామూలుగా రిక్షా ఎక్కి వెళ్లొచ్చు' అన్నారాయన. 'సరే' అన్నాను.

"చేయించుకున్నారా ఆపరేషన్" అంది ప్రియంవద కుతూహలంగా.

"ఏమో నాకు తెలేదు! కాని మడెంకు మటుకు గాజుగుడ్డతో చిన్న డ్రసింగ్ కట్టువుంది. రిక్షా ఎక్కేటప్పుడు చూసు కున్నాను"

"అప్పటిదాకా మీకేమీ తెలియదా?" అంది ప్రియంవద.

"తెలీదు. జన్మలో ఎప్పుడూ నేను ఆపరేషన్ చేయించుకోలేదు. ఆపరేషన్ థియేటర్లోకి పోగానే నా గుండె చెదిరి పోయింది అక్కడున్న ఇన్‌స్ట్రుమెంట్లు, కత్తులూ, కత్తెర్లూ, లైట్లు చూడగానే. నా భయాన్ని గ్రహించి, 'ఏం భయపడక్కర్లేదు. పెద్దపెద్ద ఆపరేషన్లకు వాటిని ఉపయోగిస్తాను. మైనర్ ఆపరేషన్‌లకు 'బ్లేడు' చాలు. అయినా ఎందుకైనా మంచిది. పెథిడ్రిన్ చిన్న మోతాదులో ఇస్తాను. మీకంతా తెలుస్తూనే వుంటుంది. రవ్వంత బాధకూడా వుండదు" అన్నా రాయన. ఆపరేషన్ టేబుల్ ఎక్కాను"

"ఆపరేషన్ థియేటర్లో ఎవ్వరూ లేరా?" అంది ప్రియంవద సందేహంగా.

"ఓ నర్సువుంది. చిన్న కత్తులూ, కత్తెర్లూ స్టెరిలైజ్ చేసి చిన్న టేబుల్ పైన పెట్టింది. డ్రసింగ్ మెటీరియల్‌ను చిన్న ట్రేలో పెట్టింది. నాకు ఇంజక్షన్ ఇచ్చింది. ఆతర్వాత ఆమె బయటికెళ్ళినట్లుంది. నాకు మూడు నిముషాల్లోనే పూర్తిగా మత్తు వచ్చింది. అయినా డాక్టరుగారు ఏంచేస్తూవుందీ నాకు తెలుస్తూనేవుంది.."

"ఏంచేశారు?" అంది ప్రియంవద.

"ఏం చెప్పేది మేడం? నా బ్రతుకును బూడిదపాలు చేశారు. ఏ డాక్టరూ తన వృత్తిధర్మంలో చేయని దారుణానికి పాల్పడ్డారు. సాటిస్త్రీ ముందు అందులో ఒక మగవాడుచేసిన నీచాతి నీచమైన అవినీతికృత్యాన్ని ఆయన భార్య ముందు ఎట్లాచెప్పేది?...కాని చెప్పక తప్పదు. నాకు జరిగిన అన్యాయానికి, ఆ అన్యాయానికి న్యాయమైన పరిష్కార మార్గంకోసం మీతో చెప్పకతప్పదు...."

ప్రియంవద ఆమె ఉద్వేగాన్ని గమ





నిస్తూ నిశ్శబ్దంగా కూర్చుంది.

"...నా మొహానవంగి నా రెండు బుగ్గల్ని ముద్దుపెట్టుకున్నారు. ఎందుకో అనుకున్నాను అది ఆపరేషన్‌లో ఒక భాగంకాదని తెలుసు...ఆ తర్వాత నా నడుంచుట్టూ చేయివేశారు...పైట తొల గించారు. ఏదో చేయబోతున్నారనే అను మానం దృఢపడింది. జాకెట్‌హూక్స్ తీసి వేశారు...రెండుచేతుల్ని రొమ్ములపై... కొద్దినిముషాల తర్వాత నా మోకాళ్ళపై చీర తొలగించడం...ఆపరేషన్ టేబుల్ పైన నన్ను ఆక్రమించడం...మత్తులో అంతా తెలుస్తూనేవుంది....ఆయన ఏం చేస్తున్నారో చూస్తూనేవున్నాను...కాని ఏం చేయలేకపోయాను. బిగ్గరగా అరవా లనుకున్నాను...అరిచానేమో! ఎవ్వరూ పలకలేదు...రాలేదు...క్రమేపీ నామత్తు ఎక్కువైంది...నా మొహంపై ఆయన ఉచ్ఛ్వాసనిశ్వాసాలు...ఏదో బాధ... అనూహ్యమైన అనుభూతి...కళ్ళముందే ఘోరాతిఘోరం జరిగిపోతూన్న తీవ్ర మైన ఆవేదన...కాని ఏం చేయలేని, ప్రతిఘటించలేని అశక్తత...స్పృహవచ్చి చూసుకొనేసరికి దూరంగా డాక్టరుగారు సిగరెట్టుకాలుస్తూ కుర్చీలో కూర్చుని వున్నారు తనకేమీ తెలీదన్నట్టు.

"...టేబుల్ మీదనుంచి లేచాను—సత్తువ కోల్పోయినట్టుగా, సీరసాతి సీర సంగా! 'బ్రా'హుక్స్‌లేవు, జాకెట్ వొదు లుగావుంది. సరిచేసుకున్నాను. చీరను మోకాళ్లకిందికి లాక్కున్నాను. అప్పుడు గ్రహించాను డాక్టరుగారు మత్తుమందిచ్చి రేప్‌చేశారని. దుఃఖం పొర్లుకొచ్చింది. నిజ మేనా? డాక్టరుగారి దగ్గరకొచ్చి ఆవేశంగా అడిగాను-ఏంచేశారని? 'ఆపరేషన్‌చేశాను. చూసుకోండి మీ కాలు మడిమను' చూసు కున్నాను. ధానికి డ్రస్ చేసివుంది. కాని.. 'నన్ను మీరు రేప్‌చేశారు. మత్తులోకూడా గ్రహించాను. ఇంత దుర్మార్గానికి ఏ డాక్టరూ పాల్పడడు. మిమ్మల్ని నమ్మి నందుకు నా శీలాన్ని పాడుచేస్తారా? ఇది మీ వృత్తిధర్మమేనా? డాక్టరుకు పేషెంట్ అంటే సోదరితో సమానం. అలాంటిది... నన్ను మోసగించి, నా మానాన్ని దోచు కున్నారు. ఇది న్యాయమేనా?' అని బిగ్గరగా అరవాలనుకున్నాను. కాని ఆ పని చేయలేకపోయాను. నాలో నేను కుమిలి, ఏడ్చుకుంటూ నర్సింగ్‌హోమ్ బయటి కొచ్చాను. కాని తర్వాత కొన్నాళ్ళకుగానీ తెలియలేదు..."

"ఏమిటది?" అంది ప్రియంవద.

"నెలతప్పినట్టు"

"ఆఁ!" అంది ప్రియంవద నిర్ఘాంత పోతూ.

"అవునుమేడమ్, నాకునెలతప్పింది. అందుకు డాక్టర్ మల్లికార్జున్ కారణం. ఆయనే నన్ను పెళ్ళిచేసుకోవాలి. లేక పోతే నా బతుకేంకావాలి? నన్నెవరు పెళ్ళిచేసుకుంటారు? నాకు నెలతప్పినట్టు మా నాన్నకు తెలిస్తే నిలువునా నరికే స్తాడు. నాకు ఆత్మహత్య తప్ప శరణ్యం లేదు. డాక్టర్ మల్లికార్జున్‌తో మాట్లాడ దామని వొచ్చాను" అంది వినోదిని ఉద్విగ్న మనసుతో.

దట్టమైన మబ్బుల్లో సూర్యుడ స్తమించి నట్లయింది ప్రియంవద మొహం. తన భర్త ఎంత ఘోరానికి పాల్పడ్డాడు! ఇది క్షమించరానినేరం. ఈ సమస్య ఎట్లా పరిష్కారమవుతుంది. వినోదినిది తప్పేం లేదు. ఆమె శీలం బలిఅయింది. డాక్టర్ మల్లికార్జున్‌ను పెళ్ళిచేసుకోవాలని ఆమె అనడంలో అన్యాయమేమీలేదు. ఇదే

నేరాన్ని డాక్టర్ మల్లికార్జున్‌తప్ప మరెవ్వరైనాచేస్తే తను ఏంసలహా ఇచ్చేది?

"చెప్పండిమేడమ్... నన్నేంచేయమంటారు? డాక్టర్ మల్లికార్జున్‌ను పెళ్ళిచేసుకోవాలి. లేదా ఏనుయ్యో, గొయ్యో చూసుకోవాలి. మరోదారి లేదునాకు" అంది వినోదిని.

"నేనేం చేసేది? మీకు అన్యాయం జరిగింది. ఒకస్త్రీగా ఆ విషయాన్ని కాదనలేను. ఆయనతోనే మాట్లాడి తేల్చుకోండి". అంది ప్రియంవద.

"ఆయన ఇంట్లోలేరా?"

"లేరు నర్సింగ్‌హోమ్‌లో వుంటారు"

"ఇంటికెప్పుడొస్తారు?"

"మామూలుగా ఒకటి రెండుగంటల మధ్య లంచ్‌కి వస్తారు. కాని ఒక్కొక్కసారి పని ఒత్తిడిగా వుంటే రాకపోవచ్చు"

"అయితే నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళమంటారా" అంది వినోదిని.

"మీ ఇష్టం" అంది ప్రియంవద.

రెండు నిముషాలపాటు ఆలోచిస్తూ కూర్చుంది వినోదిని. తర్వాత ఏమనుకుందో ఏమిటో "నమస్కారం" అంటూ లేచి వెళ్ళింది వినోదిని.

ప్రియంవద అలానే సోఫాలో కూర్చుండిపోయింది ఆలోచిస్తూ.

* * *

మధ్యాహ్నం ఎండ లోకం మీద కన్నెర్రగా మండిపడుతోంది. రిక్షాలో కూర్చున్న వినోదిని మనస్సులోని ఆలోచనలు అంతకంటే ఎక్కువ మంటగా మండుతున్నాయి. తాను జీవన మరణ మార్గాన్ని ఒక గొప్ప, పేరుగల వ్యక్తితో తేల్చుకోబోతోంది. తనకు అన్యాయం జరిగింది. డాక్టరుమల్లికార్జున్ అక్రమంగా ప్రవర్తించి, తనపై అత్యాచారం చేశాడు. క్షణికోద్రేకంలో, క్షణికానందంకోసం ఆ పాపకృత్యానికి పాల్పడ్డాడు. ఫలితంగా తనలో పాపఫలం ... తన జీవితంలో ఇలాంటి దుర్భరమైన, దారుణమైన సమస్య ఎదురవుతుందని ఎప్పుడూ వూహించలేదు. ఇలాంటి విపత్కర పరిస్థితుల్లోనే తాను నిబ్బరంగా, ధైర్యంగా ముందు ఆలోచనతో ప్రవర్తించాలి. పరిస్థితుల్ని ఎదుర్కోవడంలో తాను వెనుకంజ వేస్తే, పిరికిగా వుంటే...తన భవిష్యత్తుపై తానే చీకటి తెరను దించుకున్నట్లవుతుంది. ఇట్లాంటి డాక్టర్ల ఘోరకృత్యాలకు ఎంత మంది అభాగ్యులు బలయ్యారో...ఎంత మంది కావాల్సివుందో అనుకుంటూ వుండగానే రిక్షా ప్రియంవద నర్సింగ్‌హోమ్ ముందు ఆగింది.

రిక్షా దిగి, రిక్షావానికి డబ్బులిచ్చి గేటులోకి వచ్చింది వినోదిని. డాక్టరుగారి కన్సల్టింగ్ రూమ్ ముందు మూడు బెంచీలపై పేషెంట్లు వున్నారు. వాళ్ళందరూ అయిపోతేగానీ తనకు లోపలికి ప్రవేశం దొరకదు కామోసు అనుకుంది వినోదిని.

కాని తను పేషెంట్‌గా అక్కడికి రాలేదు. డాక్టరుగారితో తనకున్న పని వేరు. క్యూలో నిలబడాల్సిన అగత్యం తనకేముంది? తాను నేరుగా స్ప్రింగ్ డోర్ తెర్చుకుని లోపలకు పోవచ్చు. తన అవసరం అలాంటిది. తనకా అధికారముంది...

డోర్ దగ్గర చీటీలిచ్చే కుర్రవాణ్ణి అడిగింది వినోదిని–

"డాక్టరుగారున్నారా?"

"లేరు"

"ఎక్కడున్నారు"

"ఆపరేషన్ థియేటర్లో వున్నారు"

"ఎప్పుడొస్తారు?"

"నాకేం తెల్సు? నాతో చెప్పిపోలేదు. ఆపరేషన్ అయిపోగానే వస్తారు" అన్నాడా కుర్రవాడు నిర్లక్ష్యంగా.

"అంటే ఎంతసేపట్లో?"

"అదే నాకు తెలియదని చెబుతూంట. డాక్టరుగార్ని కల్సుకోవాలంటే చీటీఇస్తాను కూర్చోండి. మీ నంబరు రాగానే పిలుస్తాను లోపలకు వెళ్లొచ్చు"

"నేను పేషెంట్ నుకాను" అంది వినోదిని ఉక్రోషంగా.

"మరి వారి బంధువా?"

"అలాంటిదే"

"ఏమైనా మీరు 'క్యూలో' కూర్చోవాల్సిందే. వారి ఆర్డర్ ప్రకారం వారిని చూడాలంటే ఎక్కువ తక్కువలేమీలేవు. చివరికి వారి భార్య కూడా చీటీపుచ్చుకుని నంబర్ను పిలవగానే లోపలకు వెళ్ళాల్సిందే" అన్నాడాకుర్రవాడు తన డ్యూటీ నిర్వహణలోని కాఠిన్యాన్ని ప్రదర్శిస్తూ.

ఆ కుర్రవాడి కచుకుదనానికి ఆమెకు కోపం వచ్చింది. లాగి లెంపకాయ వేద్దామన్నంత కోపం వచ్చింది. వాడికి నిండా పదహారేళ్లులేవు. తన పర్మిషన్ 'మీదనే డాక్టరుగారి ప్రాక్టీసంతా ఆధారపడి వున్నట్టుగా మాట్లాడుతున్నాడు. దేవుడూ పూజారి సామెత గుర్తుకొచ్చిందామెకు.

"నంబరెంత?"

"మీనెంబరు ఇరవై ఒకటి అవుతుంది"

అంతలో ఇద్దరు పేషంట్లు వచ్చి చీటీలు తీసుకొని బెంచీలమీద కూర్చున్నారు.

ఆ కుర్రవాడు కొంటెగా వినోదిని కేసి చూసి,

"ఇప్పుడు మీ నెంబరు ఇరవై మూడవుతుంది. మళ్ళీ ఆలస్యంచేశారంటే ముప్పైదాకా పోతుంది. అప్పుడు చీటీ పుచ్చుకున్నా ప్రయోజనం వుండదు. మీ నంబరు వొచ్చేసరికి డాక్టరుగారు లంచ్ కి ఇంటికెళ్ళిపోతారు" అన్నాడు.

"ఆపరేషన్ థియేటర్లోకి పోవచ్చా?"

"పోవడానికి వీల్లేదు"

"ఏం?"

"అది సినిమా హాలు కాదు ఎవరు బడితే వాళ్లు పోవడానికి"

అంతలో ఎవరో అన్నారు 'డాక్టరుగారు వస్తున్నారు' అని. బెంచీలపై కూర్చున్న రోగుల్లో కాస్త కలకలం పుట్టింది.

డాక్టర్ మల్లికార్జున్ గది ముందుకు రాగానే "నమస్కారం" అంది వినోదిని.

కనుబొమలు ముడిచి ఆశ్చర్యంగా ఓ క్షణంసేపు చూశాడు డాక్టర్ మల్లికార్జున్.

డాక్టరుగారు లోపలకు వెళ్ళగానే స్ప్రింగ్ డోర్లు ముడుచుకున్నాయి. వాకిటముందు కుర్రవాడు ఓ నిముషం నిలబడి లోపల్నుంచి బెల్ వినపడగానే లోపలకెళ్లాడు 'పేషెంట్లను పిలవమంటారా?' అని డాక్టరుగార్ని అడగటానికి.

అదే సమయంలో వినోదిని స్ప్రింగ్ డోర్ తెర్చుకొని లోపలకొచ్చింది.

ఆకుర్రవాడు తెల్లమొహం వేశాడు.

వినోదిని డాక్టరుగారి కుర్చీకి ఎదురుగ్గా కూర్చుంది.

"నేను బెల్ కొట్టేవరకూ ఎవ్వర్నీ లోపలకు పంపించొద్దు" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ ఆకుర్రవాడితో.

"ఎస్సార్" అంటూ ఆ కుర్రవాడు వెళ్ళిపోయాడు.



డాక్టర్ మల్లికార్జున్ వినోదిని కేసి చూశాడు.

ఆమె మొహం అశాంతిగా, ఉరిమే మేఘంలా ఉద్విగ్నంగా వుంది.

"తలనొప్పి తగ్గిందా?" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ కుశల ప్రశ్నగా.

"ఇప్పుడది ప్రోబ్లమ్‌కాదు"

"మరి"

"పెద్ద ప్రాబ్లమ్ వచ్చింది"

"ఏమిటది?"

"ఆరోజు ఆపరేషన్ థియేటర్లో నా కాలి ఆపరేషన్ నెపంతో మీరేంచేశారో గుర్తుందా! నాకు మత్తుమందిచ్చి..." అంది వినోదిని గొంతు స్థాయినికాస్త హెచ్చించి.

ఉలిక్కి పడ్డాడు డాక్టర్ మల్లికార్జున్. అతని మొహంలో రంగులు త్వరత్వరగా మారాయి.

"ఏంచేశాను?" అన్నాడు మల్లికార్జున్ పిరికిగా.

"గుర్తు తెచ్చుకోండి"

డాక్టర్ మల్లికార్జున్ మొహం సీరియస్‌గా మారింది. తాను ఏంచేసిందీ అతనికి గుర్తు లేక పోలేదు. తాను వృత్తి ధర్మానికి వ్యతిరేకంగా ఎన్నో పనులు చేశాడు. వాటన్నిటినీ ఒప్పుకుంటే ఈ వృత్తిలో కొనసాగలేడు.

"ఇప్పుడేమైంది?" అన్నాడు మల్లికార్జున్ అలక్ష్యంగా.





"కాకూడనిది అయింది"

"అంటే?"

"నాకు నెల తప్పింది"

నుదురుకు ఇనుపరాడ్ తగిలినట్టుగా షాక్ తగిలింది. కొన్ని క్షణాలపాటు నోరు కదపలేదు. అతని మొహంకేసి చూస్తూ కూర్చుంది వినోదిని అతని నుంచి అనుకూలమైన సమాధానాన్ని ఆశిస్తూ.

కాని మల్లికార్జున్ ఎంత సేపటికీ మాట్లాడక పోయేటప్పటికి వినోదిని అంది.

"మీరు నన్ను పెళ్ళిచేసుకోవాలి."

నుదురుమీద ఇనుపరాడ్‌తో మరో దెబ్బ తగిలినట్లయింది.

''అసంభవం!'' అరిచాడు డాక్టరు మల్లికార్జున్

"కావచ్చు. మీ దృష్టిలో మీకు భార్య వుంది, పిల్లలున్నారు, సమాజంలో కీర్తి ప్రతిష్ఠలున్నాయి. నేను పేదదాన్ని. కాన్వెంట్ స్కూల్లో టీచర్ను. మీకుగల హోదాలో, స్థితిలో నన్ను రెండో భార్యగా స్వీకరించడం అనేది అసంభవమే! నేను కాదనడంలేదు. కాని నా దుస్థితినీ, నా ప్రస్తుత పరిస్థితినీ కూడా మీరు ఆలోచించాలి. నేను పెళ్ళి కాని దాన్ని. నేను కావాల్సి అవినీతి పని చేయలేదు. కాలు జారలేదు. నన్ను మీరు మోసం చేశారు. మత్తుమందిచ్చారు. ఆపరేషన్ అనే మిషతో నన్ను మలినం చేశారు. నా జీవితానికి శాశ్వతమైన మచ్చ తెచ్చారు. నేను చేయని నేరానికి మీరు నాకు శిక్ష విధించారు. ఈ అన్యాయానికి మీరే కారకులు. నా గర్భంలో పెరుగుతున్న శిశువుకు మీరే బాధ్యులు. మీరే తండ్రి. పెళ్ళికాని కన్య గర్భవతి అయితే ఆమె భవిష్యత్తు ఈ సమాజంలో ఎంత నికృష్టమో మీకు తెలియందికాదు" అంది వినోదిని తీవ్రమైన ఆవేశంతో.

తాపీగా సిగిరెట్ వెలిగించాడు మల్లికార్జున్.

"ఇప్పుడు మించిపోయిందేమీ లేదు. అంతమాత్రంచేత నీ బతుకు అంధకారమయమేమీ కాదు. నీ భవిష్యత్తు లేకుండాపోదు. అబార్షన్ చేస్తాను" అన్నాడు మల్లికార్జున్ నింపాదిగా.

వినోదిని అప్రతిభురాలయింది.

"నా సమస్యకు అదే పరిష్కార మార్గమా?"

"అదే సింపుల్ సొల్యూషన్"

"మీ మెడిసిన్ ప్రాక్టీసులో ఎంత మంది అమాయక కన్యల శీలాన్ని ఇట్లా మోసంచేసి, మీ కామదాహానికి బలిచేసి ఇట్లా ఎబార్షన్లు చేశారు? ఇదే మీ జీవన పద్ధతైతే, ఇకముందు ఇట్లా జరగటానికి వీల్లేదు. మీకు గుణపాఠం చెప్పాలి. నేను అబార్షన్ చేయించుకోను. పాపం చేయడం, ఆ పాపఫలాన్ని చిన్న కత్తితో తీసి వేయడం మీకు సింపుల్ కావచ్చు. కాని స్త్రీ తనకు జరిగిన అన్యాయానికి ఆ పరిష్కార మార్గాన్ని ఆశించదు."

"అయితే ఏం చేయమంటావు?" అన్నాడు మల్లికార్జున్ విసుగ్గా.

"నన్ను పెళ్ళి చేసుకోండి."

"ఇంపాజిబుల్" బిగ్గరగా అరిచాడు మల్లికారున్ మొహమంతా ఎర్రబడగా.

"నేను అంగట్లో అమ్ముడుబోయే బొమ్మను కాను. నాకు కొన్ని అభిప్రాయాలు, ఆశయాలు బలంగావున్నాయి. నా శీలాన్ని దోచిన మగవాడే నాకు మొగుడు. అతనికి వేరేభార్య వున్నా, పిల్లలున్నా నాకు నిమిత్తంలేదు. నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవడానికి నిర్ణయించుకున్నాను. నా నిర్ణయానికి తిరుగు లేదు. మీ ఆవిడతో కూడా చెప్పాను."

"మా ఆవిడతోనా?"

"అవును. మీకోసం ముందుగా మీ ఇంటికెళ్ళాను. జరిగిన విషయమంతా మీ ఆవిడతో చెప్పాను. నా కర్తవ్యమేమిటని మీ ఆవిడను ప్రశ్నించాను. తనకు తెలీదు, మిమ్మల్నే అడగమంది. ఇక్కడకొచ్చాను"

ఆమె తన ఇంటికెళ్ళి, జరిగిన సంగ





తంతా భార్యతో చెప్పిందనగానే మల్లికార్జున్‌కు వెర్రికోపంతో వళ్ళంతా కుతకుతలాడింది. ఈ ఘోరం భార్యకు తెలిస్తే తనని క్షమించదు! ఇప్పటికే తనమీద ఆమెకు ఎంతో చవకబారు అభిప్రాయాలు ఉన్నాయి. తాను అవినీతిపరుడనీ, భార్యకు ద్రోహంచేసే దుష్టుడనీ, వృత్తిపరంగా ఎన్నో నేరాలుచేస్తున్న నికృష్టుడనీ ఆమె అనుకుంటున్నది. వినోదిని తన ఇంటికెళ్ళి అంతా చెప్పిందంటే-తనమీద ఆమెకున్న అభిప్రాయాలు దృఢపడినట్లే.

"మా ఇంటికెందుకెళ్లావ్?" అన్నాడు మల్లికార్జున్ గర్జించినట్లుగా.

"మీకోసం"

"నేనిక్కడ వుంటానని తెలియదా?"

"ఏమో! ఇంటిదగ్గర వుంటారనుకున్నాను."

"లేనప్పుడు వెంటనే ఇక్కడికెందుకు రాలేదు."

"డాక్టర్‌గారూ! ...మగవాళ్లు తమ తప్పుల్ని భార్యలకు తెలియకుండా దాయడానికి ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నంలో మరికొన్ని తప్పులు చేస్తారు. ఎప్పటికైనా భార్యకు భర్త చేసిన తప్పులు ఏదోరకంగా తెలియకపోవు. చివరకు భగవంతుడైనా తెలియజేస్తాడు. అప్పుడు ఎదుర్కొనే ప్రమాదంకంటే ముందుగానే తెలియడం మంచిది. అందుకనే చెప్పాను."

బయటవున్న పేషెంట్ల సందడి ఎక్కువైంది. వాళ్ళు తొందరపడుతున్నారు. ఎంతసేపని నిరీక్షిస్తారు. ఒకళ్ళిద్దరు తలుపు తెప్పుకొనిరావడానికి ప్రయత్నించబోయారు.

తాను తప్పు చేశాడు. ఆ తప్పువల్ల అనూహ్యమైన విపత్కర పరిస్థితి వచ్చింది. తన పరువు ప్రతిష్ఠల్ని పాడుచేయడానికి వినోదిని దృఢంగా నిర్ణయించుకున్నట్లుంది. ఆమెమీద తాను కోపాన్ని ప్రకటించి, ఆగ్రహావేశాలతో ప్రవర్తించి ప్రయోజనంలేదు. అభాసుపాలు కావల్సి వస్తుంది. కాబట్టి ఓర్పుగా, నేర్పుగా ఆమెను బయటకు పంపించి పరిష్కార మార్గాన్ని తర్వాత ఆలోచించుకోవచ్చు అనుకున్నాడు.

"ఇప్పుడు బిజీగా వున్నాను. బయట బోలెడంతమంది పేషెంట్లు వున్నారు. మీరు ఎల్లుండి ఆదివారం సాయంత్రం మూడుగంటలకు రండి. తీరిగ్గా మాట్లాడుకోవచ్చు" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ మామూలు ధోరణిలో.

"కాని మీ నిర్ణయం చెప్పలేదు"

"అప్పటికి ఆలోచించుకొని చెబుతాను. నీకు అన్యాయం చేయను"

"మీరు ఇంకా అన్యాయంచేసినా నేను సహించను. నన్ను పెళ్ళి చేసుకోకపోతే ఆత్మహత్యే నాకు శరణ్యం"

"అంత ఆవేశపడకు"

"ఇది ఆవేశంకాదు. మీరు చేసిన అన్యాయానికి ఆహుతి అవుతున్న ఆడదాని ఆక్రందన. మీరు న్యాయం కలగజేయకపోతే పోలీసుస్టేషన్ కెళ్ళి మీమీద రిపోర్టుచేస్తాను"

"తొందరపడొద్దు. ఎల్లుండి ఆదివారం నాడు మూడు గంటలకు రండి" అన్నాడు మల్లికార్జున్.

"సరే" అంటూ వినోదిని కుర్చీలోంచి లేచి బయటకు వెళ్ళిపోయింది.

కుర్చీకి చేరగిలబడి ఆలోచనలో పడ్డాడు డాక్టర్ మల్లికార్జున్.

"సార్" అంటూ ఆ కుర్రవాడు లోపలకు వచ్చాడు.

"బయట పేషెంట్లు తొందరపడు

తున్నారు సార్. ఒక్కొక్కర్నే లోపలకు పంపించమంటారా?"

"వొద్దు. డాక్టరుగారికి వొంట్లో బావుండలేదని చెప్పు. ఇవాళ పేషెంట్లను ఎవ్వర్నీ చూడరని చెప్పు" అన్నాడు డాక్టరు మల్లికార్జున్ చిరాకుగా.

ఆ కుర్రవాడు బయటికెళ్లాడు.

తర్వాత పావుగంటకు వ్యాకుల చిత్తుడై వున్న డాక్టర్ మల్లికార్జున్ కారు వేసుకొని క్లబ్‌కు వెళ్లాడు.



8

మధ్యాహ్నం రెండుగంటలైంది.

రెండున్నరైంది.

మూడైంది.

డాక్టర్ మల్లికార్జున్ లంచ్‌కి ఇంటికి రాలేదు.

వినోదిని నర్సింగ్‌హోమ్ కెళ్ళి ఏం గోల చేసిందో ఏమిట్లో!

అక్కడున్న వాళ్ళందరితో డాక్టర్ గారి అకృత్యాల్ని చెప్పిందేమో!....

...తనని పెళ్ళిచేసుకోమని బలవంతం చేసిందేమో?...మల్లికార్జున్ ఏమన్నాడో? అంత తేలిగ్గా తన తప్పు ఒప్పుకుంటాడా? మగవాళ్లు తమ తప్పుల్ని ఒప్పుకుంటే సమాజంలో స్త్రీకి ఇన్ని అన్యాయాలు ఎందుకు జరుగుతాయి? ఎన్నో కుటుంబాలు ఎందుకు నాశనమవుతాయి?

ఉండబట్టలేక నర్సింగ్ హోమ్ కు టెలిఫోన్ చేసింది ప్రియంవద మూడూ ఇరవైకి.

"డాక్టరుగారు వున్నారా?"

"లేరండీ"

"ఎక్కడికెళ్ళారు?"

"తెలీదండీ!... ఈ పూట రోగుల్ని ఎవ్వర్నీ చూడలేదు. వొంట్లో బావుండ లేదని వెళ్ళిపోయారు" అన్నది రిసెప్షనిస్టు.

ఫోన్ పెట్టేసింది ప్రియంవద.

సోఫాలో చేరగిలబడింది.

ఆమె భోజనం చేయలేదు.

వినోదిని వెళ్ళింతర్వాత ఆమె బుర్రంతా ఆలోచనలతో వేడెక్కింది. మనస్సు ఏమీ బావుండలేదు. రకరకాల ఆలోచనలతో చిక్కుబడినదారపువుండలా వుంది. తనని గురించీ, తన భవిష్యత్తును గురించీ, పిల్లల్ని గురించీ ఏదో ఒక నిర్ణయానికి రావాలనే పట్టుదల ఆమెలో హెచ్చింది. ఆ పట్టుదలతోనే ఆలోచిస్తోంది నిర్విరామంగా.

తనని నాన్న డాక్టరుకిచ్చి ఎందుకు పెళ్ళిచేశాడు?సొంతంగా అంతడబ్బు ఖర్చు పెట్టి నర్సింగ్‌హోమ్ ఎందుకు ఏర్పాటు చేశాడు? ఇప్పుడాయన బతికుంటే ఎంతగా విచారించేవాడో?...ఆయన్ను తీసుకెళ్ళటంలో భగవంతుడు ఒకరకంగా ఆయనకు మేళ్ళేచేశాడు...అల్లుడిగారి ఈ అత్యాచారాల్నిచూసి, తనుపడే ఈ మనోవేదనను చూసి ఎంతగా బాధపడేవాడో?...అది తప్పింది.

లోకం దృష్టిలో తాను ఎంతో అదృష్టవంతురాలు. పట్టణంలో అంత ప్రాక్టీసు గల డాక్టరుగారి భార్య కావడానికి పూర్వజన్మ సుకృతం ఉండాలంటారు. కాని తన మానసిక క్షోభ లోకానికేం తెలుసు? నిత్యమూ తను మానసికంగా అనుభవించే




నరకం ఇతర్లకేం ఎరుక?

ఆయన నర్సింగ్‌హోమ్‌నుంచి రోగుల్ని కూడా చూడకుండా పారిపోయాడంటే ఏదో గందరగోళం జరిగివుంటుంది. సందేహం లేదు. ఆయన చేస్తున్న ఘోరాల్ని, నేరాల్ని బయటపెట్టి వుంటుంది. ఆమెతో ఏదో తగాదాపడి, కర్తవ్యం బోధపడక, అయోమయ అవస్థలో ఎక్కడికో వెళ్ళివుంటాడు. అఖిలేశ్వరీదేవి దగ్గరకెళ్ళాడేమో సలహాకు. లేదా క్లబ్‌కు వెళ్ళివుండాలి మనస్సును మళ్ళించుకోవడానికి. ఇంకెక్కడికెళతారు?

ఆయన అత్యాచారాలకు క్లయిమాక్స్ వచ్చింది. మత్తు మందిచ్చి ఒక పెళ్ళిగాని యువతిని ఆపరేషన్ థియేటర్లో చెరచడమా? వైద్య వృత్తికి ఎంతటి అపఖ్యాతి? వినోదినిలాంటి అమాయక అభాగ్యులెంతమంది మల్లికార్జున్ దుష్కృత్యాలకు తమ జీవితాల్ని మట్టిపాలు చేసుకున్నారో? ముందు ముందు ఇలాంటి కన్నీటిగాథల్ని తాను ఎన్ని వినాల్సివస్తుందో?

తనేం చేయాలి?

తన కర్తవ్యమేమిటి?

ఆయన్ను మంచిమార్గంలో పెట్టడం ఎలా? ఆశక్తి,సామర్థ్యాలు తనకున్నాయా?

లేవు.

ఆయన్ను తను ఎదిరించలేదు.

ఆయన్ను మంచిమార్గంలో పెట్టలేదు.

ఆయన అలవాట్లను మార్చలేదు.

తన ఈ స్థితికి తరుణోపాయం ఏమిటి?

ఏం చేయాలి?

జీవితంనుంచి పారిపోవడమా?

ఎక్కడికి?

పిల్లలు ఏం కావాలి?

వాళ భవిష్యత్తేమిటి?

తను లేకపోయినా ... ఆయన బతకగలడు? పిల్లైతే మరెవర్నయినా పెళ్ళి చేసుకోగలడు .... మగవాళ్ళదేముంది? భార్యపోయి ఆర్నెల్లు తిరక్కముందే ఎంతోమంది మగవాళ్ళు మళ్ళీ పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు. పిల్లలు ఎట్లా బతుకుతారు? వాళ్ళ చదువులు, పోషణ, క్రమశిక్షణ...ఎవరు చూస్తారు? వాళ్ళకోసమైనా తను బతక్క తప్పదు.

...అన్నయ్య దగ్గరకు వెళ్ళితే...? కాపురాన్ని చక్కదిద్దుకోలేక అన్నయ్య దగ్గరికెళ్ళితే ఏం బావుంటుంది? నలుగురూ నవ్విపోరూ..? వదినెకు పల్చనైపోదూ...?

మరేం చేయాలి?

ఆయనతో ముఖాముఖి తేల్చుకొని... విడిపోతే తాను బతకలేదా? తనకి ఆస్తి వుంది...డబ్బువుంది...పిల్లల్ని పోషించుకోగలదు. వాళ్ళకు చదువులు చక్కగా చెప్పించుకోగలదు. వాళ్ళను మంచి క్రమశిక్షణలో పెట్టగలదు ... కాని తాను ఒంటరిగా జీవించగలదా ? భర్తతో విడిపోయిన ఆడదానిమీద సమాజానికి గౌరవముంటుందా?సానుభూతివుంటుందా? మగవాడు ఎన్నితప్పులైనా చేయవచ్చు! నైతికంగా ఎంత పతనమైనా కావచ్చు. భార్యను ఎన్ని కష్టాలైనా పెట్టవచ్చు, మానసికంగా ఎంతటి మానసిక దుస్థితికైనా గురిచేయవచ్చు. వాటిని సమాజం క్షమిస్తుంది. మగవాడు మగవాడే నంటుంది. అట్లాంటి సమాజంలో భర్తను వొదిలేసి తాను ఒంటరిగా బతగ్గలదా...!

సోఫాలో కూర్చుని నిర్విరామంగా ఆలోచిస్తూనేవుంది ప్రియంవద.

గోడమీద గడియారం తన విధి ప్రకారం తిరుగుతూనే వుంది.

ఆలోచిస్తూ, ఆలోచిస్తూ ప్రియంవద

అలసిపోయి నిద్రపోయింది.

* * *

మల్లికార్జున్ సాయంత్రం ఆరున్నరకు ఇంటికొచ్చాడు.

ప్రియంవదకు ఎంతో ఆశ్చర్యమేసింది. ఆవేళప్పుడు ఆయన ఇంటికి రావడమా? క్లబ్బుకు వెళ్ళకుండా, ఫ్రెండ్స్ ఇళ్ళకు పార్టీకి వెళ్ళకుండా, మరెక్కడికైనా వెళ్ళకుండా.

ప్రియంవద మనస్సు అగ్నిగుండంలా వుంది. ఆ అగ్నిగుండాన్ని వినోదిని రగిలించి వెళ్ళింది.

"ఇవాళ పెందరాళే ఇంటికొచ్చారేం?" అంది ప్రియంవద.

"ఏం రాకూడదా?" అన్నాడు మల్లికార్జున్ కోటు విప్పుతూ.

"ఎందుకు రాకూడదు? వచ్చినందుకు సంతోషిస్తున్నాను. పొద్దుగూకకముందు భర్త ఇంటికి వస్తే ప్రతి భార్యా నిండుగా సంతోషిస్తుంది. ప్రతి ఇల్లాలూ కోరుకునేది అదే! గుమస్తా భార్య అయినా, ఆఫీసరు భార్య అయినా, లాయరు భార్య అయినా, వ్యాపారస్తుని భార్య అయినా, డాక్టర్ భార్య అయినా... ఎవరైనా భర్త పెందరాళే ఇంటికొస్తే పరమానందభరితురాలవుతుంది" అంది ప్రియంవద.

సోఫాలో కూర్చుని ఆనాటి పేపరు తీసుకున్నాడు మల్లికార్జున్.

"ఏమైంది?" అంది ప్రియంవద.

"ఏమిటి?" అన్నట్టు తలెత్తి చూశాడు మల్లికాకార్జున్.

"వినోదిని అనే యువతి మధ్యాహ్నం నర్సింగ్ హోమ్‌కు వచ్చిందా?"

"ఊఁ!"

"ఆమెకు ఏం సమాధానం చెప్పారు?"

"ఆమెకు సమాధానం నేనెందుకు చెప్పాలి? ఆమెకూ, నాకూ సంబంధమేమిటి?"

"ఏమీ లేదా?"

"లేదు. ఆమె ఏదో కట్టుకథ అల్లుకొచ్చి నన్ను గోల చేయాలని చూసింది. ఇలాంటి అల్లరి చిల్లరవాళ్ళ బ్లాక్‌మెయిల్‌కు నేను లొంగుతానా?"

"ఆమె చెప్పేదంతా కట్టుకథేనా?"

"కాక, నిజమనుకుంటున్నావా? ముందుగా ఇంటికొచ్చి నీ సానుభూతి సంపాయించిందటగా!"

"నా సానుభూతా?...ఆమెకు జరిగిన అన్యాయం..."

"అదంతా అబద్ధం! ఆమెను నేను ఏం చేయలేదు? ఆమె ఎవరి దగ్గర పడుకుందో, ఎక్కడెక్కడ తిరిగిందో... గర్భవతినంది. కావాలంటే అబార్షన్ చేస్తానన్నాను దయతల్చి. పోయింది ఏడుస్తూ" అన్నాడు మల్లికార్జున్ నిర్లక్ష్యంగా.

"ఇదంతా మీరు గుండెమీద చేయి వేసుకొని చెబుతున్నారా? బుకాయిస్తున్నారా?"

"నిజమే చెబుతున్నాను"

"చెప్పండి – నామీద, పిల్లల మీద ప్రమాణం చేసి. మీరు ఆమెను ఆపరేషన్ థియేటర్లో రేప్ చేయలేదూ...?" అంది ప్రియంవద గట్టిగా.

"ఈ మాత్రానికే ప్రమాణాలుదేనికి" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్, ఆవిషయం ఎంతో తేలిగ్గా తీసిపుచ్చేదైనట్టు.

"సూటిగా సమాధానం చెప్పండి–నేను అడిగినదానికి" అంది ప్రియంవద కాస్త గొంతు హెచ్చుచేసి.

"నీకు సమాధానం చెప్పనక్కర్లేదు. అది నా సొంత విషయం"

ప్రియంవద రెచ్చిపోయింది.

"అది మీ సొంత విషయం ఎట్లా అవుతుంది? ఒక యువతికి అన్యాయం చేయడం మీ సొంత విషయమా? మీరు మీరు సొంతంగా ముక్కుమూసుకుని జపం చేసుకుంటున్నారా? మీ చుట్టూ వున్న సమాజంతో మీకు సంబంధం లేదా? మీకు ఇల్లులేదా? భార్యలేదా? పిల్లలు లేరా? మీరు ఒక తప్పుచేస్తే దాని ప్రభావం మొత్తం కుటుంబంపై పడుతుంది. మీరు అవినీతిగా ప్రవర్తిస్తే దానివల్ల వచ్చే చెడ్డపేరు కుటుంబానికి చుట్టుకోకుండా వుంటుందా? కాబట్టి మీరు నాకు సమాధానం చెప్పకుండా తప్పించు కోలేరు"

"నేను మగవాణ్ని. నా ఇష్టంవచ్చి నట్టు ప్రవర్తిస్తాను. నీకిష్టమైతే నోరు మూసుకుని ఇంట్లో పడివుండు. లేదా నీఇష్టమొచ్చినచోట వుండు. అంతేగానీ నన్ను, నా చేష్టల్ని ప్రశ్నించే, విమ ర్శించే హక్కు నీకులేదు. ఇంట్లో ఆడది నోరెత్తడాన్ని నేను సహించను" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ కోపో ద్రేకంతో వూగిపోతూ.

"అంతవరకూ తెగించారన్నమాట" అంది ప్రియంవద అంతకంటే హెచ్చుగా కోపోద్రేకంతో వణికిపోతూ.

"ఇందులో తెగింపు ఏమీలేదు. నా మనసులోమాట చెబుతున్నాను"

"అంటే నన్ను ఇంట్లోనుంచి వెళ్ళి పొమ్మనేగా మీ మనసులోమాట"

"నువ్వు అర్థం చేసుకొనేదాన్నిబట్టి వుంటుంది"

"ఈ ఇంట్లోంచి వెళ్ళిపోవడానికి నాకేం అభ్యంతరంలేదు. భయంలేదు. జీవితానికి దడిచి పారిపోయే పిరికిదాన్ని కాదు. నేను పిల్లల్ని పెట్టుకుని జీవించ గలను. వాళ్ళకు చదువులు చెప్పించుకో గలను. వాళ్ళను తీర్చిదిద్దుకోగలను. జీవితంలో ఎన్ని కష్టాలనైనా ఎదుర్కో గలను. ఈ ఇంట్లోంచి నేనూ, పిల్లలూ వెళ్ళిపోతాం. మీరు స్వేచ్ఛగా తిరగండి. ఈ ఇంట్లో మీకు కావల్సినవాళ్ళను తెచ్చి పెట్టుకోండి. నర్సింగ్‌హోమ్‌ను వేశ్యాగృహం చేసుకోండి" అంది ప్రియం వద కన్నీటి కుంపయ్యే ఏడుస్తూ.

"ఛీ.ఛీ. వెధవ కొంప. మనశ్శాంతి లేదు" అంటూ డాక్టర్ మల్లికార్జున్ విసవిసా బయటకు నడిచాడు.

నిలబెట్టిన బొమ్మలాగా వుండిపో యింది ప్రియంవద నిర్ఘాంతపోతూ.

ఓ రెండు నిముషాల తర్వాత కారును స్టార్ట్ చేసిన చప్పుడు వినిపిం చింది

* * *

రాత్రి పన్నెండున్నరైంది.

లోకమంతా నిశ్శబ్దంగా వుంది.

'ఇది తనకు ఆఖరి రాత్రి' అనుకుంది ప్రియంవద పిల్లల బెడ్‌రూంలో కుర్చీలో కూర్చుని.

డబుల్ కాట్‌పైన పిల్లలు నిశ్చింతగా నిద్రపోతున్నారు.

...పిల్లలు ఎంత హాయిగా, సుఖంగా నిద్రపోతున్నారు! వాళ్ళకు స్కూలు, ఆటలు, చదువు తప్ప మరో ప్రపంచం తెలియదు. తల్లిదండ్రుల మధ్య కలతలు, మనస్పర్ధలు, పోట్లాటలు, ప్రేమానురాగాలు విద్వేషాలుగా మారడం ....ఇవన్నీ ఆ పసివాళ్ళకు తెలియదు. ఒకే మాటగా, పరస్పర అన్యోన్యంగా, జీవితాంతమూ ఆదర్శ దంపతులుగా వుండాల్సిన తల్లిదండ్రులు తమను నడి సంద్రంలో నావను వదిలేసి

నట్టు విధికి వదిలేసి ఎవరిదారివాళ్లు చూసుకుంటూన్నట్టు వాళ్ళకు ఏమాత్రం తెలియదు...పాపం! తెల్లనివన్నీ పాలు అని నమ్మే అమాయకులు... తాను లేకపోతే ఏమవుతారో!

డాక్టర్ మల్లికార్జున్ ఇంకా ఇంటికి రాలేదు.

ఆరోజు ప్రియంవద భర్త రాకకోసం ఎదురుచూడటం లేదు.

తన మరణంకోసం ఎదురు చూస్తోంది.

కుర్చీ పక్కనే టీపాయ్ వుంది. ఆ టీపాయ్‌మీద స్లీపింగ్ పిల్స్ సీసా వుంది. దానిపక్కనే గ్లాసులో చల్లనినీళ్లున్నాయి.

తాను డాక్టర్ మల్లికార్జున్‌తో కల్సి జీవించలేదు!

తాను పోయింతర్వాత పిల్లలేమవుతారు? వాళ్ళ భవిష్యత్తేమిటి? వాళ్ళ ఆలనా పాలనను మల్లికార్జున్ చూస్తాడా? వాళ్ళ బతుకులు తెగిన గాలిపటాలవుతాయా? క్రమశిక్షణలేక చెడిపోతారా? వీధులు పట్టుకు ఆకతాయి వెధవల్లాగ తిరుగుతారా?

...లేకపోతే వాళ్ళను నాన్న ఫ్రెండ్ డాక్టర్ వెంకటామయ్యగారికి



ఆయనతో విడిపోయి ఒంటరిగా బతకనూలేదు!

అందుకే ఆత్మహత్య చేసుకోదల్చింది.

ఆ టీపాయ్ మీద స్లీపింగ్ పిల్స్ సీసా, గ్లాసునిండా నీళ్లపెట్టి గంటన్నరైంది.

అప్పట్నుంచీ ఆత్మ క్షోభతో మథనపడుతోంది...

అప్పగిస్తే? ఆయనెంతో మంచివాడు. పెద్దమనిషి. ముప్ఫైయేళ్లు గవర్నమెంటు డాక్టరుగా పనిచేసి రిటైరయ్యాడు. నాన్న పోయినప్పుడు చిత్తూరు గవర్నమెంట్ హాస్పిటల్లో వుంటూ, పెద్దకర్మ నాటికి మూడ్రోజులు సెలవుపెట్టి విజయవాడ వచ్చాడు తననెంతో ఓదార్చాడు ... రిటైరయ్యాక ఇక్కడికే వచ్చేసి సొంత ఇంట్లోనే వుంటున్నాడు. ఆయన ఇద్దరు కొడుకులూ ఎక్కడో వుద్యోగాలు చేసుకుంటున్నారు. చీకూ చింతా లేకుండా ప్రశాంత జీవితం గడుపుతున్నాడు - ఆధ్యాత్మిక గ్రంథ పఠనంలో. ఇప్పటికీ తనంటే ఎంతో అభిమానం, ఆప్యాయత, వాత్సల్యం. చిన్నప్పుడు తనని ఎత్తుకొని తిప్పేవాడట. చాక్లెట్లు కొనిచ్చేవాడట. అప్పుడప్పుడూ ఇంటికొస్తూ వుంటాడు యోగక్షేమాలు కనుక్కోవడానికి. మజ్జిగ తప్ప ఏమీ పుచ్చుకోడు. అమధ్య ఒకసారి వచ్చినప్పుడు ఎంతో బాధ పడుతూ అన్నాడు-

"అమ్మాయ్! అల్లుడుగారి ప్రవర్తన పట్టపగ్గాల్లేకుండా వుందట! కర్ణాకర్ణిగా విన్నాను. కాస్త అదుపులో పెట్టక పోయావా?" అని.

తను నిర్విణ్నురాలైంది.

"డాక్టరు వృత్తి పవిత్రమైంది. పేషెంట్ల నమ్మకంపైనే అది కొనసాగుతుంది. డాక్టరుగారి నైతిక ప్రవర్తనపై రోగులకు నమ్మకం లేకపోతే ఆ డాక్టరు అప్రదిష్ట పాలవుతాడు. మీ ఆయన వృత్తిధర్మంలో తప్పటడుగులు వేస్తున్నాడని తెలియవచ్చింది. అందులో నిజమెంతో, అబద్ధమెంతో నాకు తెలియదు గాని అనోటా ఆనోటా వినవస్తోంది. కాస్త చెప్పి చూడమ్మా!" అన్నాడు డాక్టర్ వెంకట్రామయ్యగారు చిరునవ్వు మొహంతోనే చురకలు తగిలిస్తూ.

తాను విని వూరుకుంది, అప్పట్లో చేసేదేంలేక.

అయినా ఇపుడు తాను ఓ నిర్ణయం తీసుకున్నాక, తను లేనప్పుడు పిల్లల్ని గురించి ఏమవుతారోనని ఆదుర్దా పడటం, ఆందోళన చెందడం దేనికి...? వాళ్లు ఎలా పెరిగేదీ, ఎలా బతికేదీ, ఏం చేయబోతున్నదీ తాను చూడ బోతున్నదా?...లేదు....లేదు...

అంతలో బయట కారు హారన్.

ఆయన వస్తున్నారు!

ఆయన తన దగ్గరకు రాకముందే తాను స్లీపింగ్ పిల్స్ వేసుకోవాలి. ఈ బతుక్కి స్వస్తి చెప్పాలి!

ఆయన మొహం చూస్తే తన గాఢ నిర్ణయం మారొచ్చు - అనుకుంటూ ఓ నిముషం పాటు పిల్లలకేసి దుఃఖోన్మాదంతో కన్నార్పకుండా చూసి, గాఢ నిద్రలో వున్న పిల్లల్ని మనసారా ముద్దు పెట్టుకొని, స్లీపింగ్ పిల్స్ నోట్లో వేసుకుంది. గడగడా మంచినీళ్లు తాగింది ప్రియంవద.

ఆ తర్వాత పిల్లలిద్దర్నీ కావిలించు కొని మంచంమీద పడుకొంది.

డాక్టర్ మల్లికార్జున్ ఆ గదిలోకి ఎప్పుడొచ్చాడో...

టీపాయ్ మీదున్న స్లీపింగ్ పిల్స్ బాటిల్నూ, గ్లాసులో కొద్దిగా మిగిలివున్న నీళ్లనూ ఎప్పుడు చూశాడో...

మరునాడు ఉదయం నర్సింగ్ హోమ్లో స్పృహ వచ్చింది ప్రియంవదకు.

పక్కనే డాక్టర్ మల్లికార్జున్ వున్నాడు.

"ఎంత సాహసం చేశావు ప్రియా!"




అన్నాడు మల్లికార్జున్ ఆవేదనతో కూడుకున్న ఆవేశంతో.

మంచం పక్కనే పిల్లలున్నారు దిగాలు పడ్డ మొహాలతో.

వాళ్లకేసి ఆత్రుతగా చూసింది ప్రియంవద.

* * *

"మమ్మీ! మమ్మీ!" అన్న పిల్లల కేకలకు దిగ్గున లేచింది ప్రియంవద సోఫాలోంచి.

పిల్లలు అప్పుడే స్కూలునుంచి వచ్చారు.

కళ్లు నులుముకొని వాళ్ళకేసి చూపు మార్చి మార్చి చూసింది - నిజంగా వాళ్లు తమ పిల్లలేనా అన్నట్టు.

...ఇప్పటిదాకా తాను కన్నది కలత నిద్రలో కలలన్న మాట!

గ్రహించింది ప్రియంవద.

"అప్పుడే వచ్చారా?" అంటూ పిల్లల్ని కావిలించుకుంది ప్రియంవద. ఆమెకళ్లు ఆమెకు తెలియకుండానే చెమర్చాయి.

"అప్పుడేయేంటిమమ్మీ! ఇంటికి రావడానికి అరగంట లేటయితేనూ!" అన్నాడు కిరణ్.

"ఎందుకైందిరా?" అంది ప్రియంవద ఆశ్చర్యాన్ని నటిస్తూ.

"మమ్మీ...మమ్మీ!" అంది సంధ్య ఏదో దుర్ఘటనగురించి చెప్పబోతున్న తడబాటుతో.

"ఏమిటమ్మా?"

"పెద్ద యాక్సిడెంట్!" అన్నాడు కిరణ్ మొహాన్ని వెడల్పుచేసి.

"ఎక్కడ్రా?"

"నేను చెబుతాను మమ్మీ! కళ్లారా చూశాను" అంది సంధ్య ముందుకొచ్చి.

"నేనూ చూశాను! నేను చెబుతాను మమ్మీ!" అన్నాడు కిరణ్ ముందు కొచ్చి.

పిల్లలిద్దరూ 'నేను' 'నేను' అని వాదులాడుకోసాగారు.

"అబ్బా! వుండండ్రా! ఎవరో ఒకరు చెప్పండి. ఇందులో తగాదా దేనికి! సంధ్య పెద్దదిగదా!...దాన్ని చెప్పనీయమ్మా!" అంది ప్రియంవద కిరణ్‌ను బుజ్జగిస్తూ.

సంధ్య గర్వంగా తమ్ముడికేసి చూసి, చెప్పడం మొదలెట్టింది.

"మమ్మీ! కాన్వెంట్ దగ్గర్లో కిళ్ళీకొట్టు లేదూ ... అక్కడ ఒకరోడ్డు టరన్ తిరుగుతుంది...అక్కడ ఓ లారీకింద ఓ రిక్షా పడింది. ఆ రిక్షాలో...ఆ రిక్షాలో ఒకమ్మాయివుంది..పాపం...ఆ అమ్మాయి నడుం విరిగిపోయింది ... అబ్బా! ఎంత నెత్తురనుకున్నావ్"

ప్రియంవద, 'అయ్యో! పాపం' అంది సానుభూతిగా.

"ఆ రిక్షాకు పదిగజాల దూరంలోనే మా రిక్షావుంది. అంచేత కళ్లారాచూశాం. నాకు భలే భయమేసిందనుకో! లారీ ముందు చక్రంకింద ఆ అమ్మాయినడుం నజ్జునజ్జు అయింది. నెత్తురు రోడ్డుమీద కాలవలుకట్టింది. అంతలో ఎవరిదో కారు వచ్చింది. అందులో ఆ అమ్మాయిని వేసుకొని గవర్నమెంట్ హాస్పిటల్‌కు తీసుకెళ్లారట!...ఆ రిక్షావాడు అవతల మురుక్కాలవలో పడ్డాడు. వాడికి పెద్దగా దెబ్బలు తగల్లేదనుకో! పాపం ... ఆ అమ్మాయి బతుకుతుందో...లేదో"అంది సంధ్య దిగులుగా మొహంపెట్టి.

"అమ్మాయంటే స్కూలు కెళ్ళే అమ్మాయా?" అంది ప్రియంవద.

"కాదు మమ్మీ! పెద్దమ్మాయే" అన్నాడు కిరణ్.

"ఎన్నేళ్లుంటాయి?" అంది ప్రియంవద.

"మా రాణీ టీచరంత వుంటుంది మమ్మీ!" అంది సంధ్య.

'అంటే ఇరవయ్యేళ్ళదాకా వుండొచ్చు నన్నమాట! పాపం! ఆ వయస్సుకే నూరేళ్ళబతుకు నిండిపోయింది. పెళ్ళయిందో లేదో!' అనుకుంది ప్రియంవద సానుభూతిపరమైన విచారాన్ని వ్యక్తపరుస్తూ.

"ఆ లారీ డ్రైవరు లారీ వదిలేసి పారిపోయాడు మమ్మీ!" అన్నాడు కిరణ్.

'తప్పెవరిదైతేనేం! పాపం ఆమె బతుకు ఎలా తెల్లవారుతుందో? ఎవరో అభాగ్యురాలు' అనుకుంది ప్రియంవద.

కాన్వెంట్‌లో టీచరుగా ఉద్యోగం చేస్తున్న ఆ అభాగ్యురాలిపేరు వినోదిని అనీ, అవివాహిత అనీ మరునాడు వార్తాపత్రికల్లో వచ్చినపుడుగానీ తెలియలేదు ప్రియంవదకు.



# 9

మధ్యాహ్నం నర్సింగ్‌హోమ్ నుంచి వచ్చిన దగ్గర్నుంచీ క్లబ్‌లో విస్కీ తాగుతూనే వున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

క్లబ్‌లో జనం ఎక్కువమంది లేరు. సాయంత్రమైతేగానీ రారు - ఉద్యోగులుగానీ, వ్యాపారస్తులుగానీ, పేకాట ఆడేవాళ్లుగానీ, మరెవ్వరైనాగానీ.

క్లబ్‌లో బార్ రూమ్‌లో ఒక మూల కూర్చున్నాడు మల్లికార్జున్.

ఇద్దరు ముగ్గురు ఫ్రెండ్స్ అతనిని ఆ సమయంలో అక్కడ చూసి ఆశ్చర్యంగా పలకరించారు.

"ఏమిటి డాక్టరుగారూ! ఈవేళప్పుడు మీరిక్కడ వున్నారు. నర్సింగ్‌హోమ్ ఏమైంది?"

"నర్సింగ్‌హోమ్ వుంది. నామనస్సే బావుండక ఇక్కడికొచ్చాను. డ్రింక్ తీసుకుంటున్నాను"

"మీ మనస్సు బావుండకపోవటమేమిటండీ? ప్రాక్టీసు ఎక్కువై, ఆపరేషన్లు అధికమై బుర్ర వేడెక్కివుంటుంది"

"మరే"

ఈవిధంగా పలకరించినవాళ్ళకు ముక్తసరిగా సమాధానాలుచెబుతూ విస్కీ తాగుతూ, ఆలోచిస్తూనే వున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

ఆరోజు ఆపరేషన్ థియేటర్లో తను వినోదినికి మత్తు మందిచ్చి అనుభవించిన మాట వాస్తవమే! ఆ సమయంలో ఆమె అందానికీ, ఆకర్షణకూ పరవశుడై క్షణికోద్రేకంలో, ముందూ వెనుకా ఆలోచించుకోకుండా ఆ దుష్కృత్యానికి పాల్పడ్డాడు. కాని ఆ వ్యవహారం ఇంత దూరం వస్తుందని ఆలోచించలేదు. ఆడవాళ్ళతో వ్యవహారం తనకు కొత్తకాదు. కాని గతంలో ఎవ్వరూ ఇట్లా తననెదిరించి, ఇంత ధైర్యంగా తనని పెళ్ళి చేసుకోమని అడగలేదు, పట్టుబట్టలేదు.

అబార్షన్ చేయించి పంపిస్తానంటే వినోదిని ఒప్పుకోలేదు. తన పరువు ప్రతిష్ఠల్ని పీధులపాలు చేసేందుకు నిర్ణయించుకున్నట్టుంది. ఆదివారంనాడు

తను రమ్మన్నాడు ఆమెను. ఆ లోపుగా ఏదైనా ఆలోచించి ఆమె గొడవనుంచి తప్పించుకోవాలి.

కాని, వినోదిని తన ఇంటికి పోయి, జరిగిన విషయమంతా ప్రియతో చెప్పడమే తనకి దుర్భరంగా వుంది. అదే తనని పెద్దగా అప్‌సెట్ చేసింది. ఇంతవరకూ ఏ ఆడదీ తనింటికెళ్ళి తన మీద తన భార్యతో ఫిర్యాదు చేయలేదు. ప్రియ నమ్మి ఉంటుంది. ఇంతకుముందే, ఆ శ్రేయోభిలాషి లేఖతోనే తన బండారం బయట పడింది. తన మీద నీచాభిప్రాయాన్ని ఏర్పరచుకుంది. తను ఎంత బుకాయిస్తే మటుకు మనస్సులో చొర బడిన అభిప్రాయాన్ని ఎట్లా మార్చుకో గలదు. భర్తను గురించి ఏ గాలి కబురు భార్యకు చేరినా సహజంగానే అనుమానం రేకెత్తుతుంది. దానికి తగ్గట్టు అఖిలేశ్వరీదేవి ఆ రాత్రి పార్టీనుంచి కారులో తనని వెనకసీట్లో పడుకోబెట్టుకుని రావడం... ఈరోజు వినోదిని తన ఇంటికి వెళ్ళి జరిగిన అన్యాయాన్ని ప్రత్యక్షంగా చెప్పడం...

ప్రియ తనని క్షమిస్తుందా?

తను రోజూ తాగుతూంటే ఆమె ఓప్పుకుంటోంది.

తను నిత్యమూ క్లబ్‌లో పేకాడి, ఏ అర్ధరాత్రో, అపరాత్రో ఇంటికొస్తూంటే సహిస్తోంది...

తను పిల్లల్నీ, సంసారాన్ని గురించి పట్టించుకోకపోతే సర్దుబాటు చేసుకుంటోంది....

కాని,

ఒక యువతిని నర్సింగ్‌హోమ్ ఆపరేషన్ థియేటర్లో చెరిస్తే, ఆమెకు నెల తప్పితే క్షమించగలదా?

ఇంపాజిబుల్!

క్షమించమని ప్రియను అడిగే హక్కు కూడా తనకు లేదు...

ఏ స్త్రీ మాత్రం భర్త ఒక పెళ్ళికాని యువతిని మోసం చేసి అనుభవించ డాన్ని ఎట్లా సహిస్తుంది? ఆ యువతికి ఖర్మం చాలక గర్భం వస్తే చెప్పనక్కర్లేదు.

తాను ఇహ ఇంటికెళ్ళడం ఎట్లా?

ఇంటికెళ్ళకుండా ఎక్కడయినా ఎంతకాలం వుండగలడు?... ప్రియని తప్పించుకుని తిరగగలడు?

ఎదురుపడితే "వినోదినికి న్యాయం చేకూర్చండి" అని ప్రియ అడిగితే ఏం జవాబు చెబుతాడు తను?

ప్రియ మనస్తత్వం తనకు తెలుసు. ఆమె చాలామంది ఆడవాళ్ళలాంటిదికాదు. సామాజిక, నైతిక విలువల పట్ల ఆమెకు కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. అవినీతిని ఆమె సహించలేదు. సామాజిక నేరస్థునిపై ఆమెకు ఏహ్యాభావం మెండు. భార్యాభర్తల బంధం పట్ల, ఇరువురి బాధ్యతల పట్ల, విడివిడిగా సమాజానికి వారి జవాబుదారీపట్ల ఆమెకు పవిత్రమైన అభిప్రాయాలున్నాయి.

ప్రియను తాను 'ఫేస్' చేయగలడా? ఆమె మనస్సు చాలా సెన్సిటివ్... ఆ మనస్సుకు విఘాతాన్ని కలిగించిన తను ఆమె ఎదుట మొహం ఎత్తుకొని నిలబడ గలడా?

ఏం చేయాలి తను?

తన కర్తవ్యమేమిటి?

విస్కీ తాగుతూనే ఆలోచిస్తున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

అలా చాలాసేపు తాగుతూ ఆలోచి స్తూనే వున్నాడు తీవ్రంగా. కానీ, ఏ నిర్ణ

యానికి రాలేకపోయాడు.

సాయంత్రం అయిదున్నర గంట లైంది.

సాయంత్రపు ఎండ నిద్రగన్నేరు చెట్ల సన్నని ఆకుల్లోంచి బార్ కిటికీ గ్లాసుల పైబడి మెరుస్తోంది. కొంచెం సేపు బయట కూర్చుందామని వరండాలోకి వచ్చాడు. ఒక స్తంభం పక్కనే కూర్చుని సిగిరెట్టు తాగుతూ సినిమా వీక్లీలు తిరగేస్తూ బొమ్మలు చూడసాగాడు డాక్టర్ మల్లికార్జున్.

"హల్లో డాక్టర్" అన్న పిలుపు విన బడింది. వెనక్కి తిరిగి చూశాడు.

డాక్టర్ వెంకట్రామయ్యగారు... మామగారి ఫ్రెండ్. వైద్యంలో అనుభ వంతో తల నెరిసి, వెంట్రుకలు వూడి పోయి, బట్టతల అయినవాడు....రిటైర య్యాడు. ఏమీ తోచనపుడు క్లబ్బుకొచ్చి ఓ గంటసేపు కూర్చుని వెళుతూ వుంటాడు తప్ప అలవాట్లేం లేవు.

''రండి రండి'' అంటూ లేచి మర్యా దగా, వినయంగా, గౌరవంగా ఆహ్వానిం చాడు డాక్టర్ మల్లికార్జున్. మామగారి ఆప్తమిత్రుడు కావడం వల్లనైతేనేమి, గవర్నమెంట్ సర్వీసులో డాక్టరుగా మంచి పేరు తెచ్చుకోవడంవల్లనైతేనేమి, జీవితాన్ని ఉద్యోగ ధర్మానికి అంకితం చేసి న్యాయం సమకూర్చినవాడు కావడం వల్లనైతేనేమి ఆయనంటే మల్లికార్జున్‌కు గురుత్వ గౌరవభావాలున్నాయి. ఎదు రుగావున్న ఖాళీ కుర్చీలో కూర్చున్నాడు డాక్టర్ వెంకట్రామయ్య. పొందూరు ఖాదీ ధోవతిలో, లాల్చీలో, పచ్చటి శరీర ఛాయలో, దేహదారుఢ్యంతో పరిపూర్ణమైన ఆరోగ్యంతో పదేళ్ళ వయస్సు వెనక్కి పోయినట్టుగా వున్నాడు. ఆయన పాటించే ఆరోగ్య సూత్రాలు, ఆయన అలవాట్లు అట్లాంటివి.

"బావున్నారా?" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్. అతని పక్కనున్న టీపాయ్ మీద మూడొంతుల విస్కీగ్లాసువుంది. పక్కనే మూత. విప్పిన సోడా వుంది.

"బాగానే వున్నానబ్బాయ్....ఏమిటి ఇవాళ ముందుగానే క్లబ్‌కు వచ్చినట్టు న్నావ్" అన్నాడు వెంకట్రామయ్యగారు.

"అవునండీ. ఇవాళ నాలుగైదు ఆపరే షన్లు చేశాను 'మూడ్' సరిగ్గాలేదు. రిలాక్స్ అవుదామని వచ్చాను" అన్నాడు మల్లికార్జున్. అతని మాటల్లో కృత్రి మత్వం గోచరించింది వెంకట్రామయ్య గారికి.

''రిలాక్స్ కావడానికి విస్కీ, బ్రాండీలేనా సాధనాలు? దానికితోడు లెక్కలేనన్ని సిగరెట్లు కూడానా" అన్నాడు వెంకట్రామయ్య- మంగలంలో పడ్డ ఉప్పుగల్లులా చిట్లించిన విచార వదనంతో, ఆప్యాయంగా చూస్తూ.

గతుక్కుమన్నాడు మల్లికార్జున్.

"ప్రాక్టీసు చేసే డాక్టరు ఎంతో ఆదర్శంగా, మంచి అలవాట్లతోవుండాలి. ఆ విషయాన్ని నేను ప్రత్యేకంగా చెప్ప నక్కర్లేదనుకుంటాను. కాని ఇప్పటి డాక్టర్లు చాలామంది చెడువ్యసనాలతో, ప్రవర్తనలతో ప్రొఫెషన్‌కే తలవంపులు తెస్తున్నారు. ఎక్కువగా డ్రింక్ చేస్తే లివర్ చెడిపోతుందని, ఎక్కువగా 'స్మోక్' చేస్తే లంగ్ క్యాన్సర్ వస్తుందని డాక్టర్లుగా మనం పేషెంట్లకు సలహా ఇస్తాం...అవునా?"

తల ఆడించాడు డాక్టర్ మల్లికార్జున్.

"మరి డాక్టర్‌వి అయివుండి నువ్వు విపరీతంగా విస్కీ తాగుతున్నావు.




లెక్కలేనన్ని సిగరెట్లు తగలేస్తున్నావు. ఆరోగ్యాన్ని గురించి ఇతర్లకు నువ్విచ్చే సలహా స్వవిషయంలో నీకు వర్తించదా? ఇట్లాంటి పబ్లిక్ స్థలాల్లో ఎంతోమంది వస్తూ వుంటారు. వాళ్ళలో కొంతమంది నీపేషెంట్లే వుండొచ్చు. వాళ్లు చూస్తే ఏమనుకుంటారు? డాక్టరుగారు మనకు నీతులు చెప్పి తానే ఆ వ్యసనాలకు గురవుతున్నాడని అనుకోరూ?"

మౌనంగా తల ఆడించాడు మల్లికార్జున్.

"రోగులకు ఆదర్శంగా వుండాల్సిన డాక్టర్లే దురలవాట్ల విషయంలో బంధితులైతే వైద్య వృత్తికి పరువు ప్రతిష్టలేముంటాయి? అన్నట్టు ఆమధ్య మీ ఇంటికొచ్చాను. నువ్వులేవు. మా అమ్మాయితో కొంచెంసేపు కబుర్లు చెప్పి వచ్చాను. ఎందుకో అమ్మాయిలో పూర్వపు ఉత్సాహం, తేజస్సులేదు. ఆమె కళ్ళకింద నలుపు వలయాలు ఏర్పడ్డాయి. ఏదో దిగులూ, విచారంతో, మానసికంగా మథన పడుతున్నట్టుగా వుంది. నేను సూటిగా అడిగాను. కాని రవ్వంత బయట పడలేదు. అది వాళ్ళ వంశంలోనేవుంది. మీ మామగారుకూడా అంతే! నిండైన, గంభీరమైన మనిషి. తనకున్న బాధల్ని, వ్యథల్ని, ఆవేదనల్ని, సమస్యల్ని చేప నీరు తాగినట్టుగా తనలో ఇముడ్చుకొనేవాడుగాని ఇతర్లకు చెప్పేవాడు కాదు. ప్రియంవద స్వభావం కూడా అదే! నువ్వేమీ అనుకోనంటే ఒక విషయం అడుగుతాను. నిజంచెబుతావా?" అన్నాడు వెంకట్రామయ్య గంభీరంగా.

మల్లికార్జున్ ఇరకాటంలోపడ్డాడు. ముసలాడితో పెద్ద ఇబ్బందే వచ్చిపడింది. పెద్దమనిషితో అబద్ధాలు చెప్పడానికి వీల్లేదు. నిజం చెబితే తనమీద నికృష్టమైన అభిప్రాయాన్ని ఏర్పరచుకుంటాడు.

"అడగండి"

"ఇటీవల నిన్ను గురించి చెడుగా వింటున్నాను. వృత్తినికించపర్చే అనేక పనులు చేస్తున్నావట. వాటిలో నిజానిజాల్ని నేను వెరిఫై చేయలేదనుకో. ఏమైనా ఏ ఆధారాలు లేకుండా పుకార్లు పుట్టవు. ఇంతకీ అసలు సంగతేమిటి? ఏది ఏమయినా ఇలాంటి మాట రాగూడదబ్బాయ్"

మల్లికార్జున్ మౌనం వహించాడు.

"నీతో ముఖాముఖి మాట్లాడదామని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను. కాని వీలుపడిందికాదు. ఇవాళ ఏం తోచక ఓ అరగంటసేపు క్లబ్బులో కూర్చుందామని వచ్చాను. నువ్వు తటస్థపడ్డావు. ఎప్పుడైనా వారానికోసారి క్లబ్‌కు వస్తుంటాను-పాత మిత్రులతో కాలక్షేపం చేయడానికి. కాని నువ్వు పేకాటలోనో, మిత్రులతో కులాసాగా కబుర్లు చెబుతూ డ్రింక్ చేస్తూనో వుంటావు. అట్లాంటప్పుడు నిన్ను డిస్టర్బ్ చేయడం నాకిష్టముండక ఎప్పుడూ తీరిగ్గా మాట్లాడలేదు. ఇవాళ ఆ తీరిక లభించింది. నాలుగుమాటలు నాకు తోచినవి చెబుతాను...వింటావా?"

"చెప్పండి"

"మనం ఉద్యోగమైనా, ప్రాక్టీసు అయినా, వ్యాపారమైనా, మరేదైనా జీవన మార్గంగా ఒకటి ఎంపిక చేసుకున్నాక - దానికి అన్నివిధాలా న్యాయం సమకూర్చాలి. చిత్తశుద్ధితో ఏ అవినీతికీ, అన్యాయానికీ దిగకుండా, నలుగురూ మెచ్చుకొనేట్లు ఏ విమర్శకూ లోను కాకుండా దానిని నిర్వహించాలి. నువ్వు మెడిసిన్ ప్రాక్టీసు చేస్తున్నావు. మంచి

డాక్టరుగా పేరుతెచ్చుకున్నావ్. హస్తవాసి మంచిదనే కీర్తి వచ్చింది. అంతవరకు బాగానేవుంది. అయితే ఇటీవల కొత్త కొత్త డాక్టర్లు చాలామంది తయారై నర్సింగ్‌హోమ్‌లను ఏధికొకటి చొప్పున ఓపెస్ చేస్తున్నారు. తప్పేంలేదు. కానీ కొన్ని నర్సింగ్‌హోముల్లో ఎన్నో ఘోరాలు,నేరాలు, అత్యాచారాలు జరుగుతున్నాయని వింటున్నాం. అయితే అలాంటివి నీ నర్సింగ్‌హోమ్‌లో కూడా జరుగుతున్నాయని విని నేనెంతో నొచ్చుకున్నాను. స్త్రీని గౌరవంగా చూడని ఏ సమాజమూ, సంస్థా, వృత్తి, పరిశ్రమా అభివృద్ధిలోకిరాదు.ముఖ్యంగా వైద్యవృత్తి! పాతికేళ్ళ లోకోత్తర సౌందర్యంగల స్త్రీ



దాన్ని ఒప్పుకోదు. ఆమధ్య పేప
చూశాను. ఒక ముస్లిం దేశంలో ఒ
పరాయి స్త్రీతో అవినీతి వ్యవహారాని
పాల్పడిన భారతీయ డాక్టరుకు ఉరిశి
విధించారట. అతనివల్ల గర్భంపొంది
స్త్రీకి ఒక సంవత్సరంపాటు కఠినమై
జైలుశిక్ష వేశారట. అలాంటిది నీ నర్సిం



హోమ్‌లో అందమైన స్త్రీలను ను
సెక్స్‌దృష్టితో ట్రీట్ చేస్తున్నావట...
మాలిన పనులకు పాల్పడుతున్నా
అదే నిజమైతే ఇది మంచిది కాదబ్బా
మీ ఆవిడకు తెలిస్తే ఆ అప్రదిష్ఠ
భరించగలదా? ఆమె మనసు ఎంత క్ష
పడుతుందో ఆలోచించావా? అదలావు
మన మెడికల్ ఎతిక్స్‌కు ఇది ఎ
విరుద్ధం?"

అయినా, అన్ని రోగాలతో లీసుకుంటూ చూడటానికి అసహ్యంగావున్న అరవై ఏళ్ళ వృద్ధుడయినా డాక్టర్లకు ఒకటే. ఇద్దర్నీ డాక్టరు ఒకే భావంతో చికిత్స చేయాలి. స్త్రీ వ్యసనం అనేది క్షమించరాని దురలవాటు. ఏ న్యాయశాస్త్రమూ

డాక్టర్ మల్లికార్జున్ తలవొంచుకుని వింటున్నాడు. ఎదురు ప్రశ్న వేసే అవకాశం అతనికి చిక్కలేదు.

"ఇల్లు అనేది దేవాలయంలాంటిది. ఇల్లాలు అందులో దేవత. ఇంటినీ, ఇల్లాలినీ పవిత్రంగా భావించి, ప్రేమాభిమానాలతో చూసుకున్నప్పుడే సంసార జీవనం సుఖప్రదమవుతుంది. భార్య అమాయకత్వాన్నీ, మంచితనాన్నీ భర్త అలుసుగా, అవకాశంగా తీసుకొని తన వ్యసనాల్లో తాను మునిగితే ఆ సంసార జీవనం విషాదమయమవుతుంది. పరస్పర అనురాగ ప్రేమాభిమానాలతో విలసిల్ల వల్సిన ఆ సంసారం కలహాలతో, కలతలతో ఛిన్నాభిన్నమవుతుంది. నీ ప్రవర్తన పట్ల ప్రియంవద కుళ్లికుళ్ళి, కుమిలి కృశిస్తోన్నట్టుగా గ్రహించానబ్బాయ్! నువ్వు మనస్సూ, ప్రవర్తననూ మార్చుకోకపోతే మీ ఇరువురి మధ్యా అగాధం అంతకంతకూ పెరిగిపోవచ్చు. ఒక చిన్న ఉదాహరణ చెబుతాను విను"

డాక్టర్ మల్లికార్జున్ మనస్సులో క్రమంగా పశ్చాత్తాపం రగులుకో నారంభించింది. ఉపాధ్యాయుడు చెబుతూంటే చిన్న పిల్లవాడిలా కళ్ళూ, చెవులూ అప్పగించి వినసాగాడు.

"నేను నాగార్జునసాగర్ గవర్నమెంట్ ఆస్పత్రిలో పనిచేస్తూండగా ఒక వ్యవహారం జరిగింది, శివసుబ్బారావని ఒక డాక్టరుండేవాడు. తెనాలినుంచి ట్రాన్స్‌ఫరై వొచ్చాడు. అతనికి ముప్పైయేళ్ళ కంటె వుండవు. అందగాడు. అన్ని అలవాట్లూ వున్నవాడు. ఎప్పుడూ నైట్ డ్యూటీ వేయించుకునేవాడు. ఎందుకో నాకు అర్థమయ్యేదికాదు. ఒకరోజు రాత్రి పదకొండు గంటలకు ఒక రేప్‌కేసు టెస్టుకువచ్చింది. లేడీడాక్టర్ 'లీవ్'లో వుంది. ఆ కేసు టెస్టును శివసుబ్బారావు స్వీకరించాడు. ఆమె చాలా అందంగా వుంది-ఇరవైయేళ్ళ వయస్సులో. బయట ఆమెను టెస్ట్‌కోసం తీసుకొచ్చిన పోలీసు లున్నారు. ఆమెకు రేప్‌జరిగి నాలుగు గంటలైందట. ఎక్కడో పల్లెటూర్లో జరిగింది. ఆమె పోలీసులకు ఫిర్యాదుచేసి మూడుమైళ్లనడిచి హాస్పిటల్‌కు వచ్చేసరికి అంతకాలం పట్టింది. రేప్ జరిగిన సాక్ష్యాలు బలంగాలేవని ఆమెతో శివసుబ్బారావు అన్నాడట. ఆమె బిక్కమొహం వేసిందట. దానికి శివసుబ్బారావు ఓ ఉపాయం చెప్పాడట. తాను ఆమెను అనుభవించి సర్టిఫికేట్ ఇస్తానన్నాడట. అమాయకురాలైన ఆమె కేసుబలంకోసం ఒప్పుకుందట. డాక్టర్ శివసుబ్బారావు ఆమెను ఎగ్జామినేషన్ టేబులుపైనే అనుభవించి రేప్ జరిగినట్టు సర్టిఫికేట్ ఇచ్చాడట. తర్వాత కోర్టులో క్రాస్ ఎగ్జామినేషన్‌లో గందరగోళమై హాస్పిటల్లో తనని డాక్టరు రెండోసారి రేప్ చేసినసంగతి చెప్పిందట. దాంతో కేసు తారుమారైంది. ఆ విషయం తెల్సిన డాక్టరు శివసుబ్బారావు భార్య మొగుడి అత్యాచారంపై అసహ్యమేసి, మొగుణ్ని నానా చివాట్లుపెట్టి, ఒక్కగానొక్క కూతుర్ని తీసుకొని విడిగా బతుకుతానని వెళ్ళిపోయింది. ఆ తర్వాత రెండేళ్ళకు మొగుడికి విడాకులిచ్చింది! ఆ ఫ్యామిలీ అట్లా విడిపోయింది. ఇట్లా నా అనుభవంలో ఎన్నో కుటుంబాలు చెదిరిపోయిన దృష్టాంతరాలున్నాయి భర్తదుష్కృత్యాల వల్ల. కాబట్టి మల్లికార్జున్ నా సలహా..." అంటూ ఏదో చెప్పబోయాడు డాక్టర్ వెంకట్రామయ్య.




"ఇంక మీరేమి చెప్పనక్కర్లేదండీ! నాకు కనువిప్పుచేశారు. మంచి మనిషిగా మారతాను" అన్నాడు డాక్టర్ మల్లి కార్జున్ మస్తిష్కంలోని కారుమబ్బులు క్రమంగా విడిపోగా.

ఆ తర్వాత ఓ పావుగంటసేపు డాక్టర్ వెంకట్రామయ్య ధర్మపన్నాలు బోధించి "మళ్ళీ కలుస్తాను అబ్బాయ్" అంటూ వెళ్ళిపోయాడు.

డాక్టర్ వెంకట్రామయ్య వెళ్ళాక మళ్ళీ విస్కీగ్లాసు చేత్తో పట్టుకున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

సిగిరెట్ వెలిగించాడు.

తనను గురించీ, మెడికల్ ప్రాక్టీసును గురించీ, ప్రియనుగురించీ ఆలోచించ సాగాడు మల్లికార్జున్. ఇంతలో పేకాట ఆడేవాళ్లుచేరి డాక్టర్ మల్లికార్జున్‌కు కబురుచేశారు, చేయి తక్కువయిందని.

ఆలోచనల బరువునుంచి 'రిలీఫ్' కోసం కొంచెంసేపు పేకాట ఆడదామను కున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

టేబుల్ దగ్గరకెళ్ళి ముక్కకోసి సీట్ సెలక్ట్ చేసుకొని కూర్చున్నాడు.

పేకాట మొదలయ్యాక ఆలోచనలకు 'బ్రేక్' పడింది.

ఓ పెగ్ ఖాళీకాగానే మరో పెగ్ విస్కీ సోడాతోసహా పక్కనే టీపాయ్ మీది గ్లాసులోకి చేరుతోంది. ఎన్ని పెగ్గులు తాగిందీ తెలీకుండానే మల్లికార్జున్ తాగు తూనే వున్నాడు. క్రమేపీ నిషా నషాళం లోకి ఎక్కుతూనేవుంది.

రాత్రి పన్నెండున్నరైంది.

డాక్టర్ మల్లికార్జున్ పేకాట ఆడుతూనే ఉన్నాడు. పేకముక్కల ఎరుపు నలుపు రంగులుతప్ప ఆటీన్ రాణికీ, డైమనురాణికీ, ఇస్పేటు ఆసుకూ, కళా వరు ఆసుకీ తేడా అట్టే తెలీడంలేదు. ఒక ఆట రాంగ్‌షో చేశాడు. కళావరు మూడును ఇస్పేటు మూడు అనుకొని రెండూ, నాలుగు మధ్య సీక్వెన్సుగా పెట్టి తిప్పాడు. ఆ రాంగ్‌షోను పట్టు కోవడంవల్ల మూడురెట్లు పాయింట్లు పోయాయి.

ఆ సమయంలో బాయ్‌వచ్చి, "సార్! మీకు ఫోన్ వచ్చింది" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్‌తో. డాక్టర్ మల్లికార్జున్ ఉలిక్కిపడ్డాడు. 'ఇంటిదగ్గర్నుంచి ప్రియంవద చేసిందా!ఆమె సాధారణంగా క్లబ్‌కు ఫోన్‌చేయదే!... ఏమో తనతో మాట్లాడాలని చేసిందేమో! వినోదిని పెట్టిన చిచ్చు ఆమెలో రగిలి రగిలి భగ్గున మండిందేమో!...' అనుకుంటూ ఫోన్ దగ్గరకు వెళ్లాడు మల్లికార్జున్.

ప్రియంవద నర్సింగ్‌హోమ్‌నుంచి టెలిఫోన్.

"హల్లో..."

"......

"ఓహో...ఎమర్జన్సీ కేసా?"

"......"

"లేడీడాక్టర్ వుందిగా. ఆమెను చేయ మను ఆపరేషన్"

"......"

"ఊళ్లో లేదా!...అయితే నేను వస్తు న్నాను...పదినిముషాల్లో వస్తాను. ఆప రేషన్ థియేటర్ రెడీచేయండి, ఎ.సి. ఆన్ చేసి" టెలిఫోన్ రిసీవర్ కిందపెట్టాడు.

పేకాట ఆడే టేబుల్ దగ్గరకు వెళ్ళ కుండానే విస్కీమత్తు ఎక్కువై, తడబడే అడుగులతో క్లబ్‌బయటికొచ్చాడు డాక్టర్ మల్లికార్జున్.

చెట్టుకింద పెట్టివున్న కారుదగ్గర కొచ్చాడు. డోర్ లాక్‌లో కీపెట్టాడు.

ఎంతసేపటికీ కీ లోపలకు వెళ్ళలేదు. అది కాదేమోనని పెట్రోల్ పంపు కీ పెట్టాడు. అదీ అందులోకి పోలేదు. ఆ తర్వాత ఇగ్నిషియన్ కీ పెట్టాడు. అదెట్లా పట్ట గలదు? తీరాచూస్తే అది తన కాపు కాదు.

డాక్టర్ మల్లికార్జున్ కారు మరో చెట్టు కింద వుంది. ఎక్కడ కారును పార్క్ చేసిందీ అతనికి గుర్తులేదు.

ఎలాగో తన కారును గుర్తుపట్టి, కారులో కూర్చుని స్టార్టుచేసి గంటకు అర వై కిలోమీటర్ల వేగంతో డాక్టర్ మల్లి కార్జున్ ప్రియంవద నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళాడు.

డాక్టర్ మల్లికార్జున్ ఆపరేషన్ థియే టర్లోకి వెళ్ళేటప్పటికి పేషెంట్ ఆపరేషన్ టేబుల్ మీద పడుకోపెట్టి వుంది.

స్టెరిలైజ్ చేసిన సర్జికల్ ఇన్‌స్ట్రు మెంట్లను 'ట్రే'లో ఉంచి, సిద్ధం చేసింది నర్సు.

సిజేరియన్ ఆపరేషన్.

కాంప్లికేటెడ్ కేసు.

గుడ్డకప్పిన 'ట్రే'లోంచి ఇన్‌స్ట్రు మెంట్లు తీసేటప్పుడే డాక్టర్ మల్లికార్జున్ చేతులు ఒణికాయి.

'డాక్టరుగారు మస్తుగా తాగి వున్నట్టు వున్నారు. ఏం చేస్తాడో ఆపరేషన్' అను కుంది నర్సు.

'డాక్టరుగారు తెల్లగుర్రం ఎక్కారు. ఎట్లా రైడ్ చేస్తారో' అనుకున్నాడు థియేటర్ బాయ్.

సిజర్స్‌తో పేషెంట్ పొట్ట ఓపెన్ చేశాడు డాక్టర్ మల్లికార్జున్. ఆ తర్వాత పొరకూడా ఓపెన్ చేశాడు. ఆర్టరీలను కట్ చేస్తూ యూటరస్ ఓపెన్ చేశాడు. బిడ్డను బయటకు తీశాడు. మగశిశువు. క్షేమం గానే వున్నాడు.

కాని కట్ చేసిన ఆర్టరీలను కుట్టడంలో డాక్టర్ మల్లికార్జున్ జాగ్రత్త తీసుకోలేదు. అప్పటికే మస్తిష్కంలో నిషాజాస్తి అయి, కళ్ళుతిరగసాగాయి. తన చేతిలో కత్తెర వుందో, పేకముక్కలున్నాయో తెల్సు కొనే స్థితిలో లేడు.

"సార్! ఆర్టరీస్‌ను సరిగ్గా ముడి వేయండి" అంది నర్సు.

ఆ మాటల్ని డాక్టర్ మల్లికార్జున్ విని పించుకోలేదు.

ఆర్టరీలకు ఇక్కడో ముడి, అక్కడో ముడివేసి గబగబా పేషెంట్ పొట్టకుట్టి వేశాడు డాక్టర్ మల్లికార్జున్. వెంటనే వాటర్ సింక్ దగ్గరకెళ్ళి గ్లోవ్స్ తీసివేసి సబ్బుతో చేతులు కడుక్కోసాగాడు.

"సార్! సార్" అంటూ నర్సు పెద్దగా కేకలు వేసింది.

డాక్టర్ మల్లికార్జున్ ఆపరేషన్ టేబుల్ దగ్గరకు వచ్చాడు.

పేషెంట్ పొట్టలోంచి రక్తం ఫౌంటె న్‌లా చిమ్ముతోంది.

"ఆర్టరీలకు సరిగ్గా ముడివేయలేదు సార్! హెవీ బ్లీడింగ్" అంది నర్సు.

డాక్టర్ మల్లికార్జున్ గాబరాతో రాయిలా నిలబడి చూడసాగాడు.

అట్లా డాక్టర్ మల్లికార్జున్ చూస్తుండ గానే పేషెంట్ బ్లడ్‌ప్రెషర్ డవున్కై పోయింది. 'ఏం చేద్దామా?' అని ఆలోచి స్తుండగానే పేషెంట్ చనిపోయింది.

డాక్టర్ మల్లికార్జున్ శిలాప్రతిమలా వుండిపోయాడు కొన్ని క్షణాలపాటు.

తాను ఆమెను హత్య చేశాడు.

తన నిర్లక్ష్యంవల్ల ఆమె చనిపో యింది.

తాను పూర్తిగా విస్కీ మత్తులో వుండి ఆపరేషన్ ఎందుకు చేయాలి?




వైద్య శాస్త్ర న్యాయానికి విరుద్ధంగా ప్రవర్తించాడు. అందువల్లనే ఆమె చని పోయింది.

నిజంగా తను హంతకుడు.

హంతకుడు!

ఆమె భర్త, ఇతర్రతా బంధువుల ఏడ్పుల మధ్య నర్సింగ్‌హోమ్ బయటి కొచ్చాడు డాక్టర్ మల్లికార్జున్, విపరీత మైన వ్యాకులచిత్తంతో. అతను కారు వేసుకొని నేరుగా పోలీసు స్టేషన్‌కు వెళ్లాడు.

* * *

స్టేషన్లో అడుగు పెట్టేసరికి ఒక ప్రభుత్వోద్యోగి ఇంట్లో ఇద్దరు ప్రొత ల్సను పట్టుకొచ్చిన హెడ్‌కానిస్టేబుల్‌తో యస్.ఐ. మాట్లాడుతున్నాడు. ఆ సమ యంలో డాక్టర్ మల్లికార్జున్‌ను ఆ స్థితిలో ఎదురుగ్గా చూసి యస్.ఐ. అద్భుతంగా ఆశ్చర్యపోయాడు.

డాక్టర్ మల్లికార్జున్ జుత్తంతా రేగి వుంది. మొహంలో చెప్పనలవిగాని ఆందోళన. కళ్ళు ఎర్రగా పత్తికాయల్లా వున్నాయి. ఎవర్నో హత్య చేసి, పోలీసు స్టేషనులో రిపోర్టు ఇవ్వడానికి వచ్చిన వ్యక్తిలా వున్నాడు.

"సార్! మీరా? ఏమిటిలా వచ్చారు?" అంటూ కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు యస్.ఐ.

"రిపోర్టు ఇవ్వడానికి" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ గంభీరంగా.

"ఎవరిమీదసార్"

"నామీదే"

"మీమీదా?" మరింతగా ఆశ్చర్య పోయాడు యస్.ఐ. మీసాల మీదకు కుడిచేతి మునివేళ్ళను పోనిచ్చి.

"అవును నేను హత్య చేశాను"

"మీరు హత్య చేయడమా?"అన్నాడు హెడ్‌కానిస్టేబుల్ టోపీని దించి.

"ఎవర్నిసార్?"

"ఒక స్త్రీని. మా నర్సింగ్‌హోమ్ ఆపరేషన్ థియేటర్లో వుంది శవం. నన్ను అరెస్టు చేయండి"

"అంటే ఆపరేషన్ చేస్తూండగా చనిపోయిందా సార్" అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

"ఊం!"

యస్.ఐ. గుబురు మీసాలు 'గుభేల్' అనేట్టుగా బిగ్గరగా నవ్వాడు. ఓనిముషం తర్వాత ఆ నవ్వును ఆపుకొని "అది హత్య కాదు సార్! ఆమె ఖర్మ మూడి 'టపా' కట్టేసింది. అంతే! ఆపరేషన్ టేబుల్ ఎక్కేముందే సగం చచ్చి వుంటుంది. మిగతా సగం ప్రాణం ఆపరే షన్ చేసే టైంలో పోయుంటుంది. అది మీ తప్పుకాదుసార్! రోజులు దగ్గర పడితే డాక్టర్లు బతికించగలరా?...మీ మనస్సు సరిగ్గా వున్నట్టులేదు'' అన్నాడు.

"అదికాదు యస్.ఐ.గారూ! నేను నిజం చెబుతున్నాను. నా నిర్లక్ష్యంవల్లనే పేషెంట్ చనిపోయింది. అంటే ఒక రకంగా నేను హత్య చేసినట్టు" అన్నాడు మల్లికార్జున్ ఆవేశంగా.

అంతలో యస్.ఐ. టేబుల్ మీదున్న టెలిఫోన్ మోగింది. ఫోన్ ఎత్తాడు యస్.ఐ.

"హల్లో"

"......."

"నమస్కారమండీ! అఖిలేశ్వరీదేవి గారా!... చెప్పండి"

"........."

"...అవునండీ! మా హెడ్ అరగంట క్రితమే తీసుకొచ్చాడు స్టేషన్‌కు"

"........."

"అల్లాగా! అయితే సర్లెండి. రిలీజ్ చేస్తాను...ఇంకా రిపోర్టు రాయలేదులెండి. చెప్పారుగా మీ తాలూకు మనిషని. వొది లేస్తానుగా! వర్రీ కాకండి! నన్ను ఈ స్టేషన్‌కు ట్రాన్సఫర్ చేయించి మీరు పుణ్యం కట్టుకున్నారు. మీరు చెబితే ఈ చిన్నపని చేయలేనా?... అన్నట్టు మీ డా. క్టర్ మల్లికార్జున్‌గారు ఇక్కడే వున్నారు"

"........."

"వారి మనస్సు సరిగ్గా వున్నట్టులేదు. ఎవరో నూకలుచెల్లి ఆపరేషన్ థియేటర్లో కన్నుమూశారట!... అది తన నిర్లక్ష్యం వల్ల జరిగిందనీ, తాను హత్య చేశాననీ, అరెస్టు చేయమనీ, రిపోర్టు రాసుకోమనీ అంటున్నారు"

"........."

"మీ రొక్కసారి ఇక్కడకు రాకూడదూ! డాక్టరుగారు మాంచి ఆవేశంలోవున్నారు"

"........."

"రండి వెంటనే బయల్దేరి" అని టెలిఫోన్ పెట్టేశాడు యస్.ఐ.

"రిపోర్టు రాసుకుంటారా?" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ అదే ఆవేశంతో.

"రాసుకోక తప్పదంటారా?" అన్నాడు యస్.ఐ. డాక్టరుగారితో సంభాషణ పొడిగిస్తూ.

తెల్లకాగితం తీసుకొని, బాల్‌పాయింట్ పెన్‌ను కుడిచేతి వేళ్ళమధ్య పెట్టుకొని యస్.ఐ. అక్షరం కాగితంమీద పెట్టకుండా డాక్టర్ మల్లికార్జున్‌ను సంభాషణలో పెట్టాడు.

అఖిలేశ్వరీదేవి అయిదు నిముషాల్లో పోలీసుస్టేషన్‌కు వచ్చింది. డాక్టర్ మల్లికార్జున్ కేసి పరీక్షగా చూసి అతను ఏస్థితిలో వుందీ గ్రహించింది..

"డాక్టరుగారూ! రిపోర్టుదేముంది? రేపొద్దున్నైనా ఇవ్వొచ్చు. ఇంటికెళదాం రాండి" అంటూ డాక్టర్ మల్లికార్జున్‌ను స్టేషన్ బయటకుతీసుకెళ్ళి, కారు ఎక్కించి స్టార్టు చేయించింది.

డాక్టర్ మల్లికార్జున్ నేరుగా ఇంటి కెళ్ళాడు.

* * *

కారు మోత వినగానే చౌకీదారు మెయిన్‌గేటుతీశాడు. డాక్టర్ మల్లికార్జున్ కారును పోర్టికోలో పెట్టి,ఇంటిగడపతొక్కే సరికి తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగ్గా ప్రియంవద.

అప్పటిదాకా ఆమె నిద్రపోలేదు. ఏవేవో ఆలోచనలతోవున్నట్టుంది. మొహ మంతా అలిసిపోయి, పీక్కుపోయినట్టుగా వుంది.

"ప్రియా!" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్.

ఆ పిలుపులో ఏదో తీవ్రమైన పశ్చాత్తాపం, తప్పు ఒప్పుకోలు, క్షమాపణ, అర్థింపు ధ్వనించాయి.

"నన్ను క్షమించు ప్రియా" అంటూ ప్రియంవద కాళ్ళమీద బొరుగాపడ్డాడు డాక్టర్ మల్లికార్జున్! చేసిన తప్పుల్ని తెల్సుకొని, తీవ్రంగా పశ్చాత్తాపాన్ని పొందినవాడిలా వున్నాడతను! అందుకే ప్రియంవద స్త్రీ హృదయం మంచులా కరిగిపోయింది. ఆమె కళ్ళవెంట నీటి బిందువులు బొటబొటరాలాయి ఆర్ద్రతతో.

భర్త కాళ్ళపై సాష్టాంగపడి క్షమించమంటే -- ఎంత ఆత్మక్షోభను భరించిన భార్య అయినా క్షమించకుండా వుండగలదా? అందులో భారతదేశంలో

పుట్టి పెరిగిన హైందవ స్త్రీ.

"ఛీ...అదేంపనండీ! లేవండీ!" అంటూ మల్లికార్జున్‌ను నడిపించుకుని ఇంట్లోకి తీసుకెళ్ళింది ప్రియంవద. పైన బెడ్‌రూంలో పడుకోబెట్టింది. ఆమె ఏం ప్రశ్నించలేదు.

డాక్టర్ మల్లికార్జున్ ఏదో మాట్లాడ బోయాడు.

"తర్వాద్దున్న మాట్లాడుకోవచ్చు లెండి. ముందు రెస్టు తీసుకోండి" అంది ప్రియంవద వారిస్తున్నట్టుగా.

మాట్లాడకుండా పడుకున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

రెండులో ఉన్న ఫ్యాన్ స్పీడును నాలుగులోకి మార్చింది ప్రియంవద.



10

ఆ మరునాడు ప్రియంవద నర్సింగ్ హోమ్ తలుపులు తెరుచుకోలేదు.

ఆ మరునాడే కాదు... ఆ తర్వాత రోజుల్లో కూడా...

ఆ మరుసటిరోజునుంచి డాక్టర్ మల్లికార్జున్ పూర్తిగా మారిపోయాడు.

డాక్టర మల్లికార్జున్-

సిగిరెట్లు పూర్తిగా మానేశాడు.

తాగుడు పూర్తిగా మానేశాడు.

పేకాట మానేశాడు.

క్లబ్ సభ్యత్వాన్ని రద్దుచేసుకున్నాడు.

ఇరవై నాలుగు గంటలూ ఇంట్లోనే వుండటం అలవాటు చేసుకున్నాడు భార్యా, పిల్లలతో కాలక్షేపం చేస్తూ.

భర్తలో వచ్చిన మార్పును ఎంతో సంతోషించింది ప్రియంవద.

ఒకరోజు మధ్యాహ్నం తన ఎం.బి.బి.యస్. పట్టాను కవర్లో పెట్టి, పైన యూనివర్సిటీ అడ్రసును రాస్తూంటగా అక్కడికొచ్చింది ప్రియంవద.

"ఏమిటది?" అంది ప్రియంవద.

"నా డాక్టర్ డిగ్రీ" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్ నిర్లిప్తంగా.

"కవర్లో పెట్టారేం?"

"నాకు ఎం.బి.బి.యస్. డిగ్రీ ఇచ్చిన యూనివర్సిటీకి దాన్ని వాపసు చేస్తున్నాను"

"ఎందుకూ?" అంది ప్రియంవద ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసి.

"ఆ డిగ్రీకి నేను న్యాయం చేకూర్చ లేకపోయాను. అందుచేత వాపసు చేస్తున్నాను"

"అంటే, ప్రాక్టీసు మానేస్తారా?" అంది ప్రియంవద విస్తుపోతూ.

"అవును. మానేశానుగా!"

"మరేం చేస్తారు?"

"ఇంట్లోనే వుంటాను- నీతోనూ, పిల్లలతోనూ కాలక్షేపం చేస్తాను. మనమూ మన పిల్లలూ సుఖంగా బతకడానికి అవసరమైన డబ్బునూ, ఆస్తినీ సంపాయించాను. ఇంకేం కావాలి ప్రియా" అన్నాడు డాక్టర్ మల్లికార్జున్.

నవ్వింది ప్రియంవద.

"ఎందుకు నవ్వుతావు?"

"నవ్వక ఏం చేయమంటారు! ఏదో సామెత చెబుతారే అలావుంది. మెడిసిన్ ప్రాక్టీసులో మీకు ఎంతో సామర్థ్యముంది. ఆ వృత్తి ద్వారా ఎంతో

సేవచేయొచ్చు. మిమ్మల్ని మీరు బాగు చేసుకున్నారు. తమ తప్పుల్ని తెల్సుకొని, పశ్చాత్తాపాన్ని పొంది, జీవిత గమనాన్ని మార్చుకున్న వ్యక్తి కంటె గొప్పవారెవరండి!... మళ్ళీ నర్సింగ్‌హోమ్ తెరవండి. ప్రాక్టీసు మొదలెట్టండి. చిత్తశుద్ధితో వృత్తి ధర్మాన్ని నెరవేర్చండి. ఒక ధనవంతుని దగ్గర తీసుకున్న ఫీజుతో ముగ్గురు పేదవాళ్ళకు ఉచితంగా వైద్యం చేయండి. ఇది సిద్ధాంతంగా మళ్ళీ నర్సింగ్ హోమ్‌ను తెరవండి. ప్రాక్టీసు నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉంటుంది" అంది ప్రియంవద ప్రోత్సాహ ప్రేరణతో.

తన భార్య ఎంత ఉన్నతంగా పెరిగింది! అనుకున్నాడు డాక్టర్ మల్లికార్జున్.

"అలాగే ప్రియా! నీ సలహా ప్రకారమే మళ్ళీ నర్సింగ్ హోమ్‌ను తెరుస్తాను. నువ్వు కోరినట్టే ప్రాక్టీసు చేస్తాను" అన్నాడు మల్లికార్జున్ నూతనోత్సాహంతో.

ఆ మరునాడే ప్రియంవద నర్సింగ్ హోమ్ తలుపులు తెరుచుకున్నాయి-మూతబడిన మూడు నెలల తర్వాత

డాక్టర్ మల్లికార్జున్ నర్సింగ్‌హోమ్‌కు కచ్చితంగా టైంప్రకారం వస్తున్నాడు. రోజూ లంచ్‌కు ఇంటికి వెళుతున్నాడు. రాత్రిపూట తొమ్మిదింటికి నర్సింగ్‌హోమ్ నుంచి నేరుగా ఇంటికి వెళుతున్నాడు.

వారంరోజుల్లో మళ్ళీనర్సింగ్‌హోమ్‌లో రోగులు కిటకిటలాడజొచ్చారు. అయితే ధనవంతులదగ్గర ఎక్కువ ఫీజు పుచ్చుకుంటున్నాడనీ, పేదవాళ్ళదగ్గర అసలే ఫీజు తీసుకోవడంలేదనీ పేషెంట్లు అనుకోసాగారు.

ఒకరోజు ఉదయం తొమ్మిదిన్నగంటలకు 'క్యూ'లో ముప్పావుగంట నిబడి కన్సల్టింగు రూమ్‌లోకి వచ్చిం అఖిలేశ్వరీదేవి.

"నమస్కారం డాక్టరుగారూ!" అం అఖిలేశ్వరీదేవి ఎదురుగ్గా నిలబడి.

ఆశ్చర్యపోయాడు మల్లికార్జున్ ఆ రూపురేఖల్ని చూసి.

చేతులకు, మెడకింద, మొహంమీ తెల్లమచ్చలు మసిబారిన పాతగోడ సున్నం కొట్టినట్టుగా వ్యాపించాయి.

"డాక్టరుగారూ! నేను చేసిన పాపాలక సాక్ష్యాలుగా ఈ తెల్లమచ్చలు వం నిండా వ్యాపించాయి. మీరు ట్రీట్‌మెంట్ చేయాలి" అందామె.

"ఇది నేను ట్రీట్‌చేసే కేసుకాదు డెర్మిటాలజిస్టు దగ్గరకు పోవాలి. సూపర స్పెషలిస్టును సంప్రదించండి''

"ఆయనెవరో మీరే చెప్పండి"

"హైద్రాబాద్‌లో నాకు తెల్సిన ఒక సూపర్ స్పెషలిస్టు వున్నాడు. అతని లెటర్‌రాసి ఇస్తాను. కల్సుకోండి. అత ట్రీట్‌మెంట్‌వల్ల కొంత గుణం కనబ వచ్చు" అన్నాడు డాక్టరు మల్లికార్జున్

''అంతేనా?'' అంది అఖిలేశ్వరీదే మొహమంతా నిస్పృహతో నల్లబడగా.

''అంతే మరి"

అరిచేతుల్లో మొహాన్ని దాచుకొ బావురుమంది అఖిలేశ్వరీదేవి.

హైద్రాబాద్‌లోవున్న తన స్నేహిత నికి లెటర్‌రాసి, దాన్ని ఆమెకిచ్చి "మీర వెళ్ళవచ్చు" అన్నాడు డాక్టరు మల్లికార్జున్ నిర్లిప్తంగా! ఆ తర్వాత మరో పేషెంట్ నిమిత్తం బెల్ నొక్కాడు.

★

# చతుర కతలు



## వార్త

నారాయణరావు కొత్తగా ఓ స్థానిక వార్తా పత్రిక ప్రారంభించాడు. అదృష్టం బాగుండి ఎలాటి ఆటంకమూ లేకుండా పని సాగిపోతోంది. అతని ఆఫీసులో రిపోర్టర్లంటూ ఎవరూ లేకపోవటంతో అతనే సైకిలుమీద తిరిగి 'పిల్లిని పట్టిన పిన్నిగారు' 'ఎలుకను చంపిన ఎలుగ్గొడ్డు' వంటి వార్తల్ని మరింత ఆకర్షణీయంగా రాస్తూ నలుగురిలోనూ పత్రిక పేరు నానేట్టు చేశాడు. అయినా కూడా ఒక రోజు వార్తల కొరత వచ్చిపడింది.

ప్రెస్‌నుండి కంపోజిటర్ వచ్చి 'పేపర్లో ఇంకా ఖాళీ వుంది. ఏదైనా వార్త ఇవ్వండి సార్!' అనడగటంతో నారాయణరావు మరింత కలవరపడిపోయాడు దాంతో తల తిరిగినట్టయి అనాలోచితంగానే పేపరు, పెన్ను తీసుకొని–



"ఈవేళ మధ్యాహ్నం రామ్‌నగర్ లోని శ్యామారావ్‌గారిల్లు మంటల బారిన పడి, ఎంతో నష్టం కలిగిందని అభిజ్ఞ వర్గాలు తెలిపాయి" అని రాసిచ్చాడు. శ్యామారావ్ రాజకీయాలలో ప్రముఖ వ్యక్తి. కంపోజిటర్ వెళ్ళిపోగానే నారాయణరావ్‌కు తను చేసిన పని గురించి పునరాలోచన వచ్చి కంగారెక్కువైపోయింది.

ఈలోపు కంపోజిటర్ మళ్ళీ వచ్చి, 'ఇంకా కాస్త చోటు మిగిలిపోయింది సార్' అన్నాడు. వెంటనే నారాయణరావ్, "ఆ సంఘటన గురించి తెలిసిన వెంటనే మా విలేకరి ఆ ప్రదేశానికి వెళ్ళి విచారించగా అలాటిదేమీ జరగలేదని తెలిసింది' అని ముగించి తృప్తిగా శ్వాస పీల్చుకున్నాడు.

-కస్తూరి రాజశేఖర్

# గుట్టు

'గోలరాముడు' సినిమా చూసి ఆ రసానుభూతితో హాలు బైటకు నడుస్తున్న అచ్యుతానికి, తోటి ప్రేక్షకులలో సరళను చూడగానే గుండె గుభేల్మంది! ఆమెకూడా క్షణం క్రితమే అతన్ని గమనించినట్టు అతనికేసి చూస్తోంది. అచ్యుతం తనను చూడటంతోనే చటుక్కున తల తిప్పేసుకుని ప్రేక్షక సమూహంతోపాటు కదిలిపోయింది.

'ఈ గండం గట్టెక్కేదెలాగురా భగవంతుడా?' అని భయపడ్డాడు అచ్యుతం. నాస్తికుడైతేనేమి - అతనికా సమయంలో దేవుడే గుర్తుకొచ్చేశాడు. సరళ పక్కింటమ్మాయే గాక, అతని భార్యకు మంచి స్నేహితురాలు. భార్య ఇదే సినిమా ఫస్ట్‌షో చూద్దామని పొద్దున్న అంటే, అదో దరిద్రపు సిన్మా - అంటూ తను ఆమెను చివాట్లుపెట్టాడు. తనేమో మధ్యాహ్నం ఆఫీసుకి సెలవుపెట్టి మరీ, ఈ సిన్మాలో నటించిన అభిమాన హీరోయిన్ కోసం మేట్నీకే వచ్చేశాడు. ఇపుడు సరళ ఈ సంగతి భార్యకు చేరేస్తుందేమోననే ఆలోచన రావడంతో హడలిపోసాగాడు.

'సరళ నుంచి వార్త వినగానే తన భార్య పోట్లాడదు. అలుగుతుంది! దాంతో రకరకాలుగా రుచులు మారేవంట, పిల్లి మీదా, ఎలక మీదా పెట్టి మాటలు రువ్వడం, పడకలు వేరుచేయడం - ఇలా వీలైనన్ని రకాలుగా కోల్డ్‌వార్ సాగుతుంది. ఓ చీర కొనివ్వడంతోగాని శాంతి జరిగి, అది సమాప్తం కాదు. అచ్యుతం భయానికి మూలకారణం ఇది!

'దీన్ని తప్పించుకోవడం ఎలాగా?' అని ఆలోచిస్తూ అచ్యుతం పాన్‌షాపు వద్దకు నడిచాడు. సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె తీసుకుని అగ్గిపుల్ల నోట్లో పెట్టుకుని సిగరెట్టుని పెట్టెమీద గీస్తూ

అది వెంగకపోవడంతో తేరుకున్న అచ్యుతం, అగ్గిపుల్లను వూ సేసి సిగరెట్టు నోట్లో పెట్టుకుని వెలిగించుకున్నాడు. గుండె వరకూ పొగపీల్చి వదిలాక అతని మెదడు సర్దుకుంది. ఆ వెంటనే ఓ ఉపాయాన్ని కూడా సరఫరా చేసింది. 'అది తనకు చిన్నతనం కల్గించవచ్చు గాక! భార్యకు భయపడేవాడిగా తనపై ముద్రపడవచ్చుగాక! అయితేనేం తనను ఆర్థిక, మానసికనష్టం నుంచి తప్పిస్తుంది' అనుకుంటూ ఇంటివైపు నడిచాడు అచ్యుతం.

ఇల్లు సమీపించగానే పక్కింటి గుమ్మంలో నిలబడ్డ సరళ కన్పించగా సంతోష పరవశుడయాడు అచ్యుతం!

"మీకో మాట చెప్పాలి" అన్నాడు గుమ్మం దగ్గరకెళ్లి నిలబడి.

ఆమె భృకుటి ముడిపడింది. "ఏమిటి?" అంటూ గుమ్మం మెట్లు దిగి వచ్చింది.

"మరోలా అనుకోకండి! నేను ఆ సినిమాకి వచ్చినట్టు నా మిసెస్‌తో చెప్పకండి" అన్నాడు నెమ్మదిగా, తమ ఇంటి గుమ్మంవైపు ఓ కన్నేసి వుంచి మరీ.

సరళ కళ్లు తళుక్కుమనగా, ఏదో అర్థమైనట్టు నవ్వి "అలాగే" అంది.

'థేంక్యూ!' అంటూ ఇంట్లోకి నడిచాడు అచ్యుతం.

'నయమే! తనను సినిమా హాల్లో చూసినట్టు భార్యతో ఎక్కడ చెప్పేస్తాడో నని భయపడింది తనింతసేపూ. ఆమె మాటల సందర్భంలో ఈ సంగతి తన తల్లితో అంటే కాలేజీ ఎగ్గొట్టి సినిమాకి వెళ్ళినందుకు తనకు చచ్చేన్ని చివాట్లు పడతాయి! అందుకే ఆ విషయాన్ని రహస్యంగా వుంచమని అచ్యుతాన్ని రిక్వెస్ట్ చేసేందుకు తను- ఇంతసేపూ అతనికోసం ఎదురుచూస్తూ గుమ్మంలో నిలబడింది.'

ఇప్పుడిలా వెదకబోయిన తీగ కాలికే తగిలిందని సరళ మనసు కుదుటపడి తేలికగా నిట్టూర్చింది!

—జాకీ

## సుహాసిని!

అప్పారావు పెళ్ళికి తొందరపడి పోతున్నాడు. అప్పారావు చదువు కున్నాడు. చక్కగా వుంటాడు. అతనికి కావలసినది నచ్చిన పిల్లేకాక నచ్చిన పేరు కూడా. ఆ రెండూ కలసిరాక అప్పారావు పెళ్ళి వాయిదా వేస్తూనేవున్నాడు. కాని అతని గార్డియన్ అయిన పెద్దనాన్న గారికి ఇది నచ్చలేదు. అందుకని వచ్చిం దేదో కుదిర్చేశారు. కాని పెద్దనాన్నగారు దయానిధికి ఓరోజు రెండు శుభలేఖలు అందాయి. ఆ రెండు శుభలేఖలలోనూ పెళ్ళికొడుకు అన్నంరాజు అప్పారావే. ముహూర్తసమయం, పెళ్ళి జరిగే ఊరు, కళ్యాణమండపం అన్నీ ఒక్కలాగానే వున్నాయి. ఆ శుభలేఖలలో ఒకటి అప్పారావు స్వయంగా పంపినది. మరొకటి ఆడ పెళ్ళివారు పంపినది. ఆ శుభలేఖలు చూసి దయానిధిగారు మహా కంగారు పడిపోయారు. తనకి పిల్లలు లేకపోవడంతో తమ్ముడి కొడుకు అప్పారావుని చదివించి పైకి తీసుకువచ్చా రాయన. ఆ అప్పారావు ఇంతటి 'ప్రయోజకుడు' అవుతున్నందుకు కారణం అంతుబట్టలేదు ఆయనకు. మరి ఆ శుభలేఖలలో పెళ్ళికూతుళ్ళ పేర్లు వేర్వేరుగా వున్నాయి. దయానిధిగారు వెంటనే పరిగెత్తుకొని విజయవాడ వెళ్లారు.

పెద్దనాన్నగారిని చూసి పెళ్ళికి చాలా ముందుగానే వచ్చినందుకు అప్పారావు ఆనందపడిపోయాడు.సినిమా స్టైయిల్‌లో ఆయన కాళ్ళు తాకబోయాడు కానీ దయానిధి తన కాళ్ళు వెనక్కి తీసేసుకున్నాడు.

కూతురు మీరు కుదిర్చిన సుందరే!నిజంగా సుందరే. కాని నేను సుహాసిని అభిమానిని. నేను ఎవరిని పెళ్ళిచేసుకున్నా నా పెళ్ళాన్ని సుహాసిని అనే పిలుచుకోడానికి నిర్ణయించుకున్నాను. అందుకే నేను



"ఏరా! గల్ఫ్ దేశాలలో ప్రతివాడూ ఇద్దర్ని పెళ్ళి చేసుకుంటున్నట్టు నీకేం పోయేకాలంరా! వాళ్ళల్లా ఇద్దరు ఆడపిల్లలను నాశనం చేస్తున్నావు" అంటూ అప్పారావుమీద విరుచుకుపడ్డాడు.

అప్పారావు అయోమయంగాచూశాడు. దయానిధి తనకు వచ్చిన రెండు శుభలేఖలనీ అప్పారావు మీదకు గిరవాటు వేశాడు. అవి చూశాక అప్పారావుకి అసలు విషయం అర్థమయింది.

"అదేంలేదు పెద్దనాన్నగారూ! పెళ్ళి ప్రింట్ చేయించుకున్న శుభలేఖలలో సుందరిని సుహాసినిగా మార్చాను.సుందరే సుహాసిని. సుహాసినే సుందరి. మీరేం కంగారుపడకండి" అంటూ అప్పారావు పెద్దనాన్నగారిని ఓదార్చి ఈజీఛైర్‌లో కూర్చోబెట్టాడు.

కుర్చీలో కూలబడ్డ దయానిధికి గోడ మీద అప్పారావు కత్తిరించి అంటించిన 'సితార' కవర్ పేజీపై సుహాసిని నవ్వుతూ కనిపించింది!

—తాజీ ప్రసాద్

మనదేశంలో వినోద ప్రదర్శనగా సర్కస్ ప్రారంభమై నూరేళ్లు దాటింది. 1888 నవంబర్‌లో బొంబాయిలోని క్రాస్ గ్రౌండ్స్‌వద్ద భారతదేశపు మొట్టమొదటి సర్కస్‌కంపెనీ ప్రారంభమైంది. గ్రాండ్ ఇండియన్ సర్కస్ అనే పేరుతో నడిచిన ఆ సర్కస్‌కి విపరీతమైన జనాదరణ లభించింది.

అప్పట్లో బ్రిటీష్ సర్కస్ బృందం ఒకటి బొంబాయి వచ్చి ప్రదర్శనలిస్తుంటే, చుట్టుపక్కల వూళ్ళనుంచి వచ్చిన జనం విరగబడి చూడసాగారు. ఆ సర్కస్ ప్రదర్శనల్లో ఓసారి బ్రిటీషువాడైన ఆ కంపెనీ యజమాని, "మా గుర్రాలు చాలా పొగరైనవి! వీటిని మచ్చికచేసుకుని స్వారీ చేయడం ఇతరులకి అసాధ్యం! మీలో ఎవరికైనా ధైర్యం వుంటే ప్రయత్నించండి!" అని సవాలు విసిరాడు.

దానికి ప్రేక్షకులలోంచి ఓ అజానబాహుడైన యువకుడు లేచి ముందుకొచ్చాడు. అతను గుర్రాలను అదుపు చేయడమేగాక, వాటితో చిత్రవిచిత్రమైన విన్యాసాలను చేయించి ప్రేక్షకులతోపాటు సర్కస్ యజమాని కూడా ఆశ్చర్యంతో నోరు తెరుచుకునేట్టు చేశాడు. ఆ సంఘటనే మనదేశంలో సర్కస్ కంపెనీలకు నాంది అయింది.

మహారాష్ట్రలోని అకల్‌ఖోప్ గ్రామానికి చెందిన ఆ యువకుడు విష్ణుఛత్రె ఆ తర్వాత సర్కస్‌ప్రదర్శనలు ఆరంభించి, మనదేశంలో సర్కస్ కంపెనీలకు మూలపురుషుడయ్యాడు. గ్వాలియర్‌కి చెందినబాబాసాహెబ్ ఆప్టే వద్ద గుర్రాలతో విన్యాసాలు చేయించే విద్యలో శిక్షణ పొంది, ఆ విధానంలో ప్రపంచంలోని ఉత్తమ ప్రదర్శకులలో ఒకడిగా పేరు సంపాదించారు.

తాను ప్రారంభించిన గ్రాండ్ ఇండియన్ సర్కస్ విశేష జనాదరణతో నడుస్తున్నప్పటికీ, ఛత్రె కొంత కాలానికి సర్కస్‌ని వదిలేసి, గ్వాలియర్‌కి చెందిన ప్రముఖ సంగీతకారుడు హద్దూఖాన్ వద్ద హిందూస్తానీ సంగీతం నేర్చుకోవడం మొదలు పెట్టాడు. ఆ విధంగా సంగీతంలో సైతం ప్రావీణ్యత సంపాదించిన ఛత్రె తన 61వయేట ఇండోర్‌లో మరణించాడు.

ఆ తర్వాత కొంతకాలం సర్కస్





ప్రదర్శనలు కుంటుపడ్డాయి. ఆ రంగం లోకి కళాకారులను ఆకర్షించడానికి సర్కస్ కంపెనీలు వారికి అనేక ఆశలు చూపడం తప్పనిసరైంది. ఆ కాలంలో సరైన లైటింగ్ ఏర్పాట్లు వుండేవికావు. పెట్రోమాక్స్ లైట్ల వెలుగు లోనే ప్రదర్శనలు జరుపవలసి వుండేది. అదొక పెద్ద ఇబ్బందిగా వుండేది.

1960 తర్వాతే సర్కస్‌కి జనాదరణ పెరిగింది. పల్లెలు, పట్నాలలో సర్కస్ మంచి వినోద సాధనంగా రూపొందింది. ఆర్థిక, వయోతారతమ్యాలు లేకుండా ఆడ, మగ అందరూ సర్కస్ చూసేందుకు ఎగబడసాగారు!

ఏదైనా గ్రామానికి సర్కస్ కంపెనీ వచ్చిందంటే చాలు, అక్కడేదో ఉత్సవం జరుగుతున్నట్టు వాతావరణం కోలాహలంగా మారుతుంది. మేతకోసం బైటకు తెచ్చిన సర్కస్ జంతువుల్ని పల్లె ప్రజలు ఎంతో ఆసక్తితో చూస్తారు. సర్కస్ విన్యాసాలు చేసే సుందరీమణుల చుట్టూ కూడా అదే ఆసక్తితో గుమిగూడతారు. కొందరు అమాయకులైతే ఆ యువతులు మామూలు మనుషులు కాదు, అప్సరసల సంతతి అని భావిస్తారు. మరి కొందరు ఆ సర్కస్ యువతుల్లో ని కొందరు స్త్రీలు కాదనీ, అలా వస్త్రధారణ చేసుకున్న పురుషులేనని నమ్ముతారు. సర్కస్ కళాకారులు సర్కస్‌పట్ల ఆకర్షణతో ఆ వృత్తిలో చేరతారని ఇతరులు అనుకుంటారుగాని అది వాస్తవ విరుద్ధం! ఎక్కువమంది జీవనోపాధికై ఆ వృత్తిలో ప్రవేశించినవారే! అందులో చేరాక తక్కిన ప్రపంచంతో సంబంధాలు తెగిపోయి, సర్కస్ గుడారమే లోకమవడంతో వారికి ఆ వృత్తిపై విసుగు కలుగుతుంది.

సర్కస్ కళాకారుల జీవితంలో



ఒక్కొక్కసారి విషాదాన్ని మనసులో
దిగమింగి ముఖంపై చిరునవ్వుతో కనప
వల్సిన పరిస్థితులు సంభవిస్తాయి
సర్కస్‌లో పనిచేసేవారిలో కేరళ రాష్ట్ర
నికి చెందినవారెక్కువ! రామన్‌నాయర్
అనే కేరళీయుడు ఆ రంగంలో గత 2
ఏళ్ళుగా వుంటున్నాడు. అతను ఎన్నో
ఆశలతో తన తమ్ముడు రాబిన్‌ని కూడా
సర్కస్‌లోకి తీసుకొచ్చాడు. కాని
ఫిరోజ్‌పూర్‌లో ఓ ప్రదర్శన చేస్తుండగ
రాబిన్ ఓ ప్రమాదంలో దుర్మరణం
చెందాడు. అది నాయర్‌కి తెల్సిందిగాని
సర్కస్ చూస్తున్న ప్రేక్షకులు గ్రహించ
లేకపోయారు. ఆ తర్వాత మిగిలిన రెండు
ప్రదర్శనలు ముగించేవరకూ నాయర్‌కి
తమ్ముడి మరణానికి విలపించే అవకాశం
చిక్కలేదు.

కలకత్తాలో ఓ సర్కస్‌లో ప్రీతమ్ సింగ్ జీప్‌తో జంప్‌చేసే ప్రదర్శన చేయాల్సివుంది. అది ప్రారంభించడానికి ఇంకా పావుగంట వుందనగా అతని ఒక్కగానొక్క కొడుకు చనిపోయిన వార్త తెలిసింది. ప్రీతమ్‌సింగ్ సర్కస్ మేనేజరుని ఆ రోజుకి ప్రదర్శన రద్దు చేయమని ఎంతో ప్రాధేయపడ్డాడు. కాని, యజమాని మాత్రం ప్రదర్శన జరగాల్సిందేనని ఆజ్ఞాపించాడు. ప్రీతమ్‌సింగ్ విధిలేక ఫీట్ చేయబోయి, పరధ్యానంగా జీపును బోల్తా కొట్టించడంతో అది తిరగబడి అతని ప్రాణాన్నే బలిగొంది.

సర్కస్ కళాకారుల జీవితమంతా దేశసంచారంలోనే ముగిసిపోతుంది. వారు సదా ఓ నగరం నుంచి మరో నగరానికి, ఓ దేశంనుంచి మరో దేశానికి తిరగవలసి వుంటుంది. ఇతరులకి అది గొప్పగా తోచినా సర్కస్ కళాకారులకి మటుకు అలా తిరగడం హింసలా వుంటుంది.



ఒక్కొక్కసారి ప్రదర్శన మధ్యలో ఆకస్మికంగా సర్కస్ డేరాకు నిప్పంటుకోవడం, వూహించని విధంగా క్రూర మృగాలు ఎదురుతిరిగి గాయపరచడం లాంటి ప్రమాదాలు కూడా సర్కస్ కళాకారులకి ఎదురవుతుంటాయి.

సర్కస్‌లోని మహిళా కళాకారుల బాధలు ఇంకా విపరీతం! 1960 తర్వాతే ఈ రంగంలోకి ఆడవారిని తేవడం ప్రారంభమైంది. వారిని బాలికలుగా వున్నపుడే సర్కస్‌లోకి తీసుకుంటారు. అప్పుడైతే వారి శరీరాన్ని సర్కస్‌లో చేసే అసాధారణమైన విన్యాసాలకి అనువుగా మలిచేందుకు అవకాశముంటుంది. మహారాష్ట్ర, కర్నాటక లోని కొన్ని ప్రాంతాలలో ఆడపిల్ల పుడితే శనిగా భావించి సర్కస్‌వాళ్లకి ఇచ్చేస్తారు. సర్కస్ యువతుల్లో అధికశాతం కర్నాటక, మహారాష్ట్ర, కేరళ రాష్ట్రాలకు చెందినవారని ఓ సర్వేలో తేలింది. 20 సర్కస్ కంపెనీలపై నిర్వహించిన మరో సర్వేలో వారిలో 70 శాతం మంది కేరళీయులని తెలిసింది.

అవయవసౌష్టవాన్ని కాపాడుకుంటూ, ఆకర్షణీయంగా కన్పిస్తూ, అవివాహితగా వున్నంతకాలం సర్కస్‌లోని యువతులకు జీవితం బాగానే వుంటుంది. వివాహమయ్యాక ఆమె అదే వృత్తిలో కొనసాగడానికి భర్త అంగీకరించకపోవచ్చునని, ఒక్కొక్కసారి సర్కస్ యాజమాన్యమే వాళ్లు వివాహం చేసుకోరాదనే నిబంధన విధిస్తుంది.

ఇటీవల బెంగుళూరులో ఓ సర్కస్‌లో 'జిమ్నాస్టిక్స్' చేసే రోజీ అనే యువతి ఆత్మహత్య చేసుకుంది. రోజీ ప్రదర్శనలకు ముగ్ధుడై కృష్ణన్ అనే యువకుడు ఆమెను అభిమానించడంతో, కాలక్రమంలో ఆ ఇద్దరూ పరస్పరం ప్రేమలో పడ్డారు. కాని, వారి పెళ్లికి సర్కస్ యాజమాన్యం సమ్మతించకపోవడంతో రోజీ వురిపోసుకుని చనిపోయింది.

గురిచూసి బాకులు విసిరే నిపుణుడు విన్యాసం చేస్తుండగా ఆ బాకులు తగిలే చెక్కపలక వద్ద నిలబడే సర్కస్ యువతి జీవితం కూడా ఇలాగే విషాదంగా అంతమైంది. ఆమె చెక్కపలకకు



అనుకుని నిల్చుంటే, కళ్ళకు గంతలు కట్టుకున్న ఓ యువకుడు ఆమెకు తగల కుండా చుట్టూ పలకకు గుచ్చుకునేట్టు బాకులు విసరడం ప్రేక్షకులకి వళ్ళు జలదరింపజేసే దృశ్యమే! కానీ ఓరోజు అదే ఆమె ప్రాణాన్ని బలిగొంది. ఓ బాకు గురితప్పి గుండెలోకి దూసుకుపోవడంతో ఆమె మరణించింది. తర్వాత ఓ చేదు వాస్తవం బైటపడింది. బాకులు విసిరే యువకుడు ఆ యువతిని ప్రేమిస్తే, ఆమె తిరస్కరించింది. దాంతో అతనిలో ద్వేషం పడగవిప్పింది. అది గ్రహించి ఆ యువకుడిని మార్చమని ఆమె ఎంత మొత్తుకున్నా సర్కస్ మేనేజర్ పట్టించుకోలేదు. ఆ యువకుడు సమయం కోసం కాచుకుని, గురితప్పినట్టుగా బాకును ఆమెపైకి విసిరి ప్రాణంతీసి తన ద్వేషాన్ని చల్లార్చుకున్నాడు.

సర్కస్ కళాకారులకి అత్యవసర పరిస్థితుల్లో కూడా సెలవు దొరకదు. వారికి సంవత్సరానికి ఒకేసారి 30రోజుల సెలవు వుంటుంది. సాధారణంగా ఆ కాలంలో స్వగ్రామాలకువెళ్ళి గడుపు తారు. సీనియర్ కళాకారులు మరో సర్కస్ కంపెనీకి మారకుండా సర్కస్ యాజమాన్యం చాలా జాగ్రత్తలు తీసు కుంటుంది.

కళాకారులు, వారి కుటుంబసభ్యులకు తాము ఎన్నో సౌకర్యాలు కల్పిస్తున్నట్టు సర్కస్ యాజమాన్యాలు ప్రచారం చేసుకుంటాయి. కానీ, వాస్తవం వేరుగా వుంటుంది. చాలామంది సర్కస్ కళాకారుల సంపాదన తిండికి కూడా సరిపోదు. సర్కస్‌ద్వారా ఎంతగా లాభాలు ఆర్జించినప్పటికీ, ఒక్కోసారి సర్కస్‌ను మూసివేస్తున్నప్పుడు కళాకారులకి 5లేక 10వేల రూపాయలిచ్చి వదిలించుకుంటారు. వృద్ధాప్యదశలో సర్కస్ కళాకారులకి ఆర్థికంగా, ఆరోగ్య రీత్యా బాధలు తప్పవు.

సినిమాలు, ఆపై టెలివిజన్, విడియోలు రావడంతో ప్రస్తుతం సర్కస్‌కి ఆదరణ చాలా తగ్గిపోయింది. భవిష్యత్తులో సర్కస్ పుంజుకుంటుందో లేక పూర్తిగా అంతరిస్తుందో తేల్చి చెప్పవలసింది కాలమే!

—జాస్తి శ్రీకృష్ణ వరప్రసాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

అత్యధిక సంఖ్యలో పాఠకులు చదువుతున్న

సమగ్ర

సినీవార పత్రిక

# సితార



కేవలం రూపాయిపావలాతో సినీప్రపంచవిహారం!